AADOLF187

# సన్న జీవాలు

'కరుణ కుమార'



సంస్కృతి నిలయము

88, కచేరిరోడ్డు, మైలాపూరు, మద్రాసు - 4.

సర్వస్వామ్యములు సంస్కృతి నిలయానివి.
మొదటి ముద్రణము : 1961.
వెల రు. 3-00

# ఇందులో



11

# ప్రకాశకుల విజ్ఞప్తి

కథలు, నాటికలు, నవలలు, చరిత్రలు, కళలు, మతము మొదలైన వివిధ సాంస్కృతికాది విషయాలను గురించీ, విజ్ఞాన విషయాలను గురించీ మంచి పుస్తకాలు ప్రకటించడం మా ఆశయం.

ఈ 'సన్నజీవాలు' అనే కథల సంపుటి మా మొదటి గ్రంథం. కాయకష్టం చేసుకొని జీవించే నిరుపేదల కష్ట జీవితం ఈ కథలలో మనసు కరిగేటట్టు చిత్రించి చూపబడింది. రచయిత కథా వాఙ్మయ రంగంలో ప్రఖ్యాతి సార్జించిన 'కరుణకుమార'. వీరి అసలు పేరు కందుకూరి అనంతంగారు. తెలుగుదేశంలోని పల్లెటూరి జీవితాన్ని కళ్లకు కట్టినట్టు రచించడంలో ఆయనకు ఆయనే సాటి.

ఈ కథలలోని వృత్తానికి అనుగుణమైన బొమ్మలు వ్రాసి యిచ్చిన శ్రీ హెచ్. వి. రామగోపాల్ గారికీ, ఈ పుస్తకాన్ని శీఘ్రంగా అచ్చువేసి యిచ్చిన 'లిబర్టీ ప్రెస్' వారికీ, ప్రూఫులు దిద్ది యిచ్చిన శ్రీ టి. వి. రంగాచార్యుల వారికీ మా కృతజ్ఞతాపూర్వక వందనాలు.

'కరుణకుమార' గారి మిగిలిన కథలనుకూడా క్రమంగా ప్రకటించాలని మా సంకల్పం.

పాఠకలోకం మా గ్రంథాలను ఆదరించి మమ్ము ప్రోత్సహిస్తుందని ఆశిస్తున్నాము.

# రాబోవు ప్రచురణలు



1. చారిత్రక వ్యాసములు (బౌద్ధయుగము).
   శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ
   (ఎనిమిదవ ముద్రణము.)

2. వాఙ్మయ వ్యాసావళి.
   శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

3. 'కరుణకుమార కథలు'
   మొదటి భాగము
   (రెండవ ముద్రణము.)

4. ఆంధ్రవీరులు
   శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ

5. రేడియో నాటికలు
   శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ



# సన్నజీవాలు

## టార్చిలైటు

రెడ్డిపాలెం అని ఓ చిన్న పల్లెటూరు. ఈ గ్రామంలో బోర్డు ఎలిమెంటరీస్కూలు పెట్టి ఓ సంవత్సరంకూడా కాలేదు. అంతకుపూర్వం ఓ వైదికాయన వీధిబడి పెట్టుకొని పదిమంది పిల్లకాయలకి చదువు చెప్పుకొంటూ ఉండేవాడు. నిరుడుసంవత్సరం జిల్లాబోర్డు ఎన్నికలలో గరటయ్య అని ఆ పక్కవూరురైతు ఒకాయన గెలిచి, ప్రెసిడెంటు అయ్యాడు. ఆయనగారికి రెడ్డిపాలెం అంటే ఎంతో మోజు. ఆ రెడ్డిపాలెంలో పదియిళ్ళవాళ్ళు కాపులు బలవంతులున్నారు. తెల్లవారి లేస్తే వాళ్ళదగ్గర ఇంత తెచ్చుకోవడం, ఇవ్వడం—వాళ్ళకీ వాళ్ళకీ తొంభయి లావాదేవీలు. అందువల్ల తన ప్రెసిడెంటుగిరీలో ఆ గ్రామానికి కొన్ని శాశ్వతమయిన ఉపకారాలు చేయాలని, మీటింగులో బోర్డుస్కూలు మంజూరు చేయించి, పది హేనువందల రూపాయలతో బిల్డింగు కట్టించి, వీధిబడిలో చదువుకొనే పిల్లకాయలనందరినీ బోర్డుస్కూలులో చేర్పించాడు ప్రెసిడెంటు.

ఇద్దరు టీచర్లకు చాలినంతమంది పిల్లలు లేనందువల్ల పెంటలమీద తిరిగే చాకలి, మంగలి, కుమ్మరి, వొడ్డె, సాలె, గొల్ల, యానాది వగైరా ప్రతి పిల్లకాయనీ తీసుకువచ్చి ఓ అరవయిమందిని పోగుచేసి ఆ స్కూలులో చేర్పించాడు ఆ ప్రెసిడెంటు.

## సన్నజీవాలు

ఈ సంవత్సరమే కొత్తగా పెట్టిన స్కూలయినందువల్ల ఈ యేడు ఈ స్కూలులోకూడా ఆరోగ్యవారం జరిపి, పిల్ల కాయలచేత ఆటలాడించి, బహుమతు లివ్వవలసిందని ప్రెసిడెంటుగారి దగ్గరనుండి హెడ్మాస్టరుకు తాఖీదు వచ్చింది. అయితే, దీని కయ్యే ఖర్చులు జిల్లాబోర్డు భరించుకొనే స్థితిలో లేనందువల్ల గ్రామంలోని రైతులవల్లా, గ్రామస్థుల వల్లా తలాకొంచెంగా చందాలు వేయించి, ఆ పైకంతోనే ఆరోగ్య వారం జరపవలసిందనికూడా ఆ తాఖీదులోనే వ్రాశారు ప్రెసిడెంటుగారు.

ఆ హెడ్మాస్టరు క్రైస్తవుడు. పేరు జకరయ్య. పాపం, బీదవాడూ, భయస్థుడూను. ప్రెసిడెంటుగారి ఉత్తరువు తీసుకొనివెళ్లి గ్రామంలో పదిమంది పెద్దలకూ చూపి, తలా కొంచెం చందా వేసి సహాయం చేయవలసిందని కోరాడు జకరయ్య. ఈ ఆరోగ్యవారాలూ, వేడుకలూ, వీటి ఉప యోగాలూ వాళ్ళ కంతగా అర్థమైనా కాకపోయినా, ఏమో పిల్లకాయలచేత ఆటలాడించి బహుమతులిస్తానని అంటున్నాడు అయ్యవారు అని, పదిమంది కాపులూ, బ్రాహ్మలూ, గ్రామాధికార్లూ కలిసి చందాలు వేసి, ఓ యిరవైరూపాయలు జమచేసి, అతనిచేతిలో పెట్టారు.

స్కూళ్ళ డిప్టీ ఇన్స్పెక్టరును పిలుచుకొనివచ్చి, ఆయన సమక్షంలోనే పిల్లకాయలచేత అరమైలు పరుగు, నూరుగజాల నడక, ఎక్కువఎత్తు ఎగరడం, ఎక్కువ పొడుగు

దూకడం, బల్లలకింద కాళ్ళకు గోతాలు కట్టుకొని నడవడం, కింద చల్లిన పువ్వులేరి కుప్పగా పెట్టడం-ఒక రకమేమిటి, పట్నవాసపు బడులలో ఆడించే ఆటలన్నీ పిల్లకాయలచేత ఆడించి, ఆటల్లో గెలుపొందిన పిల్లకాయలకు ఒకరికి సూటు కేసు, ఇంకొకరికి టార్చిలైటు, మరొకరికి పెద్దసైజు జపాను అద్దం, ఇంకొకరికి ఫౌన్టెన్ పేనా, వేరొకరికి సబ్బు పెట్టె, ఇంకొకరికి గొడుగు-ఇట్లాగే తలా ఒక వస్తువు బహుమతీలు యిచ్చాడు.

కాని ఆ రాత్రికే గ్రామంలో అల్లకల్లోలం బయలు దేరింది.

ఆటల్లో గెలిచి బహుమతులు తీసుకొన్న పిల్లకాయ లందరూ—ఒకడు చాకలివాడు, ఇంకొకడు మంగలివాడు, మరొకడు వొడ్డెవాడు, యానాదివాడు, సాలివాళ్ళపిల్ల, కుమ్మరివాళ్ళ పిల్ల—ఈరకంగా అందరూ బీదవాళ్ళ పిల్ల కాయలే. గ్రామంలో డబ్బుగలవాళ్ళూ, గొప్పవాళ్ళూ, పలుకుబడిగలవాళ్ళూ యిచ్చిన డబ్బుతో వస్తువులు కొన డమూ, ఆ వస్తువులు చివరకు వాళ్ళ చేతికింద నీళ్లుతాగే నౌకర్ల పిల్లకాయ లెత్తుకొనిపోవడమూ జరిగింది.

గ్రామస్థులు కుతకుత ఉడికిపోతున్నారు. తమ పిల్ల కాయలకు వస్తాయనుకొన్న వస్తువులన్నీ కూటికీ గుడ్డకూ మొగంవాచిన దరిద్రజీవుల సంతానం ఎత్తుకొనిపోయారు. అందులో తమ స్వగ్రామంలో, తమ కళ్ళయెదుట తెల్లవారి

లేస్తే తమ చెప్పుచేతల్లో ఉండి, తమకింద తాబేదారీ పని చేసే నౌకర్ల బిడ్డలకు బహుమతులూ, తమ బిడ్డలకు వొట్టి చేతలూను! పెద్దరెడ్డిగారి అబ్బాయి ఒకటే గోల! కరణం గారి అబ్బాయి ఇంట్లోవాళ్ళని నిలవనివ్వడంలేదు. సాలె వాళ్ళ కిచ్చిన అద్దం తెచ్చి నా కిస్తావా, చస్తావా అని కాశయ్య కూతురు ఒకటే ఏడుపు! ఇంతెందుకు, చాకలివాళ్ళూ, మంగలివాళ్ళూ, కుమ్మరివాళ్ళూ అందరూ సంతోషంతో పొంగిపోతూ పండగ చేసుకొంటూ ఉంటే పెద్దగ్రామస్థుల ఇళ్ళల్లో ఆరోజు రోజంతా ఎండగలూ, ఉపవాసాలూను!

హెడ్డుమాస్టరు జకరయ్య కావలెనని వాళ్ళందరికీ ఈ అవమానం చేశాడని వాళ్ళ నమ్మకం. ఊళ్ళో పెద్దలనుకొనే పదిమందీ చేరి కూడబలుక్కున్నారు. ఆ మర్నాడు ఉదయాన్నే మీటింగు పెట్టి జకరయ్యను పిలిపించి, “మా దగ్గర డబ్బులు దండి, ఊళ్లోవాళ్లకి పంజారం చేస్తావా? ఇంత తలపొగరా నీకు? మా డబ్బుతో కొన్న వస్తువులు మళ్ళీ వాపసు తీసుకొనివచ్చి, మా పిల్లకాయలకు పంచిపెడుతావా, లేక నిన్ను పట్టుకొని మెత్తగా తన్నమంటావా” అని పదిమందీ కస్తీ చేశారు.

జకరయ్య గడగడలాడిపోయాడు. ఒంటరిగాడు. అది గ్రామంలో పెద్దపులు లనుకొనేవాళ్ళందరూ చేరి చేసిన పంచాయతీ. అదిగాక, పబ్లికు మీటింగులో డిప్టీ యిన్స్పెక్టరు గారి సమక్షంలో పంచిపెట్టిన బహుమతీ వస్తువులు—వాటిని

మళ్ళీ తాను ప్రైవేటుగా ఊడబెరుక్కోవచ్చునా? ఈ సంగతి జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారికి తెలిస్తే తన నౌకరీకి మోసం కదూ, మరి తీసుకురాకపోతే గ్రామస్థులు బ్రతకనిస్తారా?

గండకత్తెర చుట్టుకొన్నట్టున్నది అతగాడికి.

జకరయ్య అట్టే ఆలోచించి, "స్వామీ! మీకు దణ్ణం పెట్టుతా. ఈ బహుమతు లిచ్చిన వస్తువులు వాపసు తీసుకొని వచ్చేపని నా నెత్తిన పెట్టకండి. మీరందరూ చేరి నా మీద నేరం పెట్టారు కాబట్టి, నా స్వంతడబ్బుతో ఆ వస్తువులు మళ్ళా కొత్తవి కొని మీకు ఇచ్చుకొంటాను. అంత మాత్రం దయపెట్టండి" అని వాళ్ళకాళ్ళు పట్టుకొన్నాడు.

కాని, వారంతా పెద్దమనుష్యులు—ఒప్పుకొంటారా వారు? జకరయ్య ఎంత చెప్పినా, ఎన్నివిధాల ప్రార్థించినా, "ఆ వస్తువులు ఆ పిల్లకాయలదగ్గర ఉండడానికిమాత్రం వీలు లేదు. పోయి నీవు వాపసు తీసుకొని వస్తావా రావా?" అని వాళ్లు నిక్కచ్చి చేశారు.

జకరయ్యకు దిక్కుతోచక, ఆ వెళ్ళడం వెళ్ళడం ఎకాయెకిని జిల్లాబోర్డు ప్రెసిడెంటుదగ్గరకి వెళ్ళి, జరిగిన విషయమంతా ఆయనతో మనవిచేసుకొని, రక్షించండని ఆయన కాళ్ళమీద పడ్డాడు.

ఆ ప్రెసిడెంటు అసాధ్యుడు; రాజకీయవేత్త; దూరాలోచనపరుడు; ముందు సంవత్సరం రాబోయే ఎన్నికల్లో శాసనసభకికూడా నిలబడాలని చూస్తున్నాడు. జకరయ్య

చెప్పుకొన్నదంతా విని "నేను రేపు మీ గ్రామానికివచ్చి, గ్రామస్థులతో స్వయంగా మాటాడి వ్యవహారం పరిష్కారం చేస్తా. నీకేం భయంలేదు, పో" మ్మన్నాడు.

జకరయ్య ప్రెసిడెంటుదగ్గరకు పోయిన సంగతి గ్రామస్థులకు తెలిసి, వాళ్లు వెంటనే బహుమతులు తీసుకొన్న పిల్లకాయల తల్లిదండ్రులను రచ్చకు పిలిపించి, బెదరించి, వాళ్ళ దగ్గరి వస్తువులన్నీ వాఘసు తీసుకొని, పెద్దరెడ్డి స్వాధీనంలో పెట్టుకొన్నారు.

భయపడి అందరూ వస్తువులు వాఘసు యిచ్చారు. కాని, టార్చిలైటు తీసుకొన్న చాకలివాళ్ల పిల్లవాడుమాత్రం వాఘసు ఇవ్వలేదు. వాడి తండ్రి రంగం, మోల్మేను వగైరా పట్నాలు తిరిగివచ్చినవాడు. మనిషి—ఎర్రగా నేత్రాలూ వాడూ-ఆజానుబాహువు : ఏడడుగుల ఎత్తుంటాడు. చేతులకు మురుగులు, దండకడియం, అయిదు వేళ్ళకీ ఉంగరాలు, మొలకు బిళ్ళల మొలతాడు, చెవులకు తమ్మెట్లు—చూడ్డానికి మహా జబర్దస్తీగా ఉంటాడు. గ్రామస్థులెంత బెదిరించినా వాడు టార్చిలైటు వాఘసు ఇవ్వకుండా మొండొడ్డుకొని కూర్చున్నాడు. పైగా, ఇచ్చినవాళ్ళనికూడా చీవాట్లు పెట్టి పురెక్కించాడు.

మరునాడు ఉదయం జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు గ్రామానికి వచ్చేవరకు వస్తువులు చేజారి వాఘసు యిచ్చిన వాళ్లూ, వాళ్ల బంధువులూ, చాకలివాళ్ళూ మొదలైన

అలగాజనం అందరూ యేభయిమంది తోడయి, పెద్దరెడ్డి యింటిమీాద పడి, "చాకలివాడు వస్తువు ఇవ్వనిదీ మేము మాత్రం వాఫసు ఇస్తామా? మా వస్తువులు మాకిచ్చివేయవలసిం"దని కర్రలూ కత్తులూ పట్టుకు తయారయారు.

ఇంతలో జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారు రాగానే వారిని పెద్దరెడ్డియింటికి పిలుచుకొనిపోయి బసచేయించారు.

పదిగంటలదాకా ఎవరెవరు ఏమేమి మాటాడుకొన్నారో అంతా గోప్యంగా జరిగిపోయింది. పదకొండు గంటలకు కారెక్కి హెడ్ క్వార్టర్సుకు చక్కా వెళ్ళిపోయాడు ప్రెసిడెంటు.

రంగంచాకలివాడి హుషారీ చూచుకొని అలగాజనమంతా ఏకమై నడుములు బిగిస్తున్నారు. పెద్దరెడ్డి వీధిలోకి రావడం మానేసి రహస్యంగా మాలవాళ్ళకు చెప్పి పంపి, కల్లుపోయిస్తాననీ, డబ్బులిస్తాననీ బేరాలు చేస్తున్నాడు.

వ్యవహారం ముదిరి కొట్టుకోవడందాకా వచ్చేవరకు, మునసబు కరణాలు చల్లగా తప్పుకొని, గ్రామపరిస్థితులు పోలీసువారికీ, మేజస్ట్రేటుకీ రిపోర్టు పంపించారు.

గ్రామంలోఅయితే జకరయ్య ప్రస్తావన మళ్ళా ఏమీా లేదుకాని, గ్రామస్థులతో మాటాడి ప్రెసిడెంటుగారు వెళ్ళిపోయిన తరువాత ఒకనాటి ఉదయం జకరయ్యకు పోస్టులో ఓ కవరు వచ్చింది. అది చింపిచూస్తే ఇట్లా ఉంది :

టార్చిలైటు

"జిల్లాబోర్డు ఆఫీసు, తే 16-11-38.

## ఉత్తర్వు

ఇటీవల మీ గ్రామంలో జరిగిన ఆరోగ్య శిశువార వేడుకల సందర్భంలో మీరు అజాగ్రత్తగా ప్రవర్తించి, గ్రామంలో అనవసరమైన కలతలూ, పార్టీలూ పెంచి, పాఠశాల పురోభివృద్ధికేగాక, గ్రామ పురోభివృద్ధికికూడా భంగకరంగా నడచుకొన్నందువల్ల మీరు స్కూలు టీచరుగా ఉండడానికి అనర్హులని తీర్మానించి, మీ సంజాయిషీతో నిమిత్తం లేకుండానే మిమ్మల్ని ఈ తేదీ లగాయతు నౌకరీ నుండి మర్తరబు చేయడమైనది.

(సం) గరటయ్య,
ప్రెసిడెంటు".

# రిక్షావాలా

ఆదినం పెద్దపండగ. కలిమిగలిగిన మహారాజుల యిళ్లన్నీ కలకలలాడుతున్నవి. పచ్చతోరణాలు, వింత ముగ్గులు, కొత్తగుడ్డలు, పిండివంటలు, మృష్టాన్నభోజనాలు- ఓ! సృష్టి యావత్తూ శోభాయమానంగా వెలిగిపోతోంది.

ఏయింటబట్టినా పండగశోభ అనేకరూపాలతో అవతరించి నృత్యంచేస్తోంది. ఇంట్లోని ఆడా మొగా, పిన్నా పెద్దా కోడికూతవేళలగాయతు క్షణం తీరికలేక అదొక నూతనచైతన్యంతో తిరుగాడుతున్నారు. ఆరోజు చేసుకోవలసిన పిండివంటలు, వంటకాల విషయంలో గతరాత్రినుండీ బయల్దేరిన తర్కాలూ, చర్చలూ అనుకొన్నంత సూక్ష్మంగా తీర్మానాలు కావడంలేదు. ఒకరికి లడ్డూ లిష్టమైతే, మరొకరికి మైసూరుపాకుమీద మనస్సు మళ్లుతోంది. ఒకరికి పెరుగువడ లిష్టమైతే, మరొకరికి మెదువడలు రుచి. ఒకరు పులిహోర ప్రతిపాదిస్తే, మరొకరు దధ్యోదనం ఉపపాదిస్తున్నారు. పెద్దఅల్లుడికి బొబ్బట్లమీద భ్రాంతిఅయితే చిన్నఅల్లుడికి అతిరసాలమీద ఆశ. ఇంత పండగ జరుగుతూంటే ఒక్క పప్పు ఉండక తప్పదుగదా? కనీసం రెండుకూరలు, ఒక వేపుడు, మూడు పచ్చళ్లు, ధప్పళం, కట్టుచారు, పిండివడియాలు, అప్పడాలు, పెరుగు—ఇంతమాత్రమైనా ఉండక

పోతే ఎట్లా? ఇక క్షీరాన్నం లేనిది పండగగడియలు గడిచి బయటపడటం ఎట్లా?

తెల్లవారేసరికి విరగబడిపోతున్నారు జనం—సంచీలు పట్టుకొని మార్కెట్టుమీదికి. తెల్లవారకుండానే పొరుగూళ్ల నుండి పాలు, పెరుగు తెచ్చే అమ్మలక్కల కాళ్ల కడ్డంతగిలి దారిలోనే, బేరమయినా చేయకుండా, ఎగనెత్తుకొనిపో తున్నారు దధిక్షీరాలు. ఆరోజు సర్కారు ఆఫీసులకు, కచ్చేరీలకు, కోర్టులకు శలవు. కాలేజీలకు, పాఠశాలలకు శలవు.

ప్రపంచం యావత్తూ ఇంతటి శోభతో వెలిగిపో తూంటే, ఆ రిక్షావాలా చేసుకొన్న పాపకర్మ మేమిటి? ఏమిటి వాడి అవతారం? ఇక వాడు తలకు నీళ్లుపోసుకొని కొత్తగుడ్డ ధరించేది ఎన్నడు? కప్పరకప్పర చీకటిలో వాడు రిక్షా లాగలేక లాగలేక ఈడ్చుకొంటూ దిక్కులుచూస్తూ వచ్చి బంగాళా-కాంపౌండుగోడమీదినుండి బయటికి వంగిన పచ్చగన్నేరు చెట్టుక్రింద వీధిలో వాలిగిపోతున్నాడు. కొత్త గుడ్డలు ధరించి, బయటతిరిగే ప్రతీసంపన్నగృహస్థుకీ లేచి నిలబడి దండాలుపెట్టుతున్నాడు. కాని, ఆనాడు వా డెవడి ముఖం చూచి బయలుదేరాడో, ఒక్కరూ చెప్పరు రిక్షా కావాలని.

సూర్యోదయం అయి ఎండెక్కుతోంది. చద్దినీళ్లు తాగే గడియలు. కాని యింటికాడ వాడిభార్య గత రెండు రోజులుగా పనిచెడి లేవడంలేదు.

# సన్నజీవాలు

కడచిన రోజుకూడా వాడికి పాపిష్ఠిరోజే. ఆరోజు పొద్దస్తమానూ వాడు రిక్షా లాగి సాయంకాలానికి సంపాదించుకొన్న ఒక్కరూపాయిడబ్బులలోనూ, తన రిక్షాకు లాంతరుదీపం లేకుండా లాగుతున్నందుకు ఛార్జీ చేస్తానని బెదిరించిన పోలీసుజవానుకు త్రాగుడుక్రింద పన్నెండు అణాలు లంచంబెట్టి, మిగిలిన నాలుగణాలూ రిక్షాఖామందుకు బాడుగ క్రింద జమకట్టి, దణ్ణం పెట్టుకొన్నాడు. ఇక ఆరాత్రి వాడికి గుడిసెలో మడతకుడుములతో కుక్షి నిండి, తెల్లవార్లూ, తనూ తనభార్యా కడుపులో కాళ్లు ముడుచుకొని కాలం గడిపేరు.

కాని, తెల్లవారినా వాడికి మంచిగడియలు వచ్చినట్లు లేదు. చద్దినీళ్లు తాగేవేళకు కడుపులో మంట లేచి నీరసించి, ఆకలి తీర్చుకోను ఇన్ని ఉప్పుశనగలు కొనుక్కోను వాని చేత దమ్మిడీ కనిపించని దుర్దినమయిపోయింది, ఆ మాయదారి పండగదినం. కాయకష్టం చేసి జీవనం గడపుకొనే అతగాడికి 'దేహి' అని చెయ్యిచాపి కానీడబ్బు ముషి అడుగుకోను నోరు రావడం లేదు. బొడ్డున ఉన్న పొగాకుకాడ ఒకటి తుంచి, నోట పెట్టుకొని దాని రసంతో తన నీరసం పోగొట్టుకోవడానికి ఉవ్విళ్లూరుతున్నాడు రిక్షావాలా!

ఎండబడి పదిగంటల పొద్దెక్కింది. పదకొండు అయింది. పన్నెండుకూడా అయింది. వొట్టుపెట్టినట్టు ఆరోజు రిక్షావాలాకు బాడుగ దొరికితే వొట్టు! ఎండ ముదిరి చిటచిటలాడుతోంది. మండే శరీరాన్ని గన్నేరుచెట్టునీడకు

జేరేసి సేదతీర్చుకొంటున్నాడు. వచ్చేపోయే సంపన్నులను 'రిక్షా సామీ' అని అడిగి అడిగి వాడికి ప్రాణం విసిగి పోయింది. ప్రాణం శోషిల్లి రిక్షాలోనే వొరిగి కళ్లు మూసుకొన్నాడు రిక్షావాలా.

ఎంతకాల మావిధంగా పడిఉండినాడో, కాంపౌండు గోడమీదుగా విసరిన పుల్లాకుల విస్తళ్ల దొంతర దభీమని తన రిక్షాసమీపాన్నే కింద సైడుకాలవలో పడేవరకు వానికి మెలకువ వచ్చి కళ్లు తెరచి చూచేసరికి—ఎక్కడ కని పెట్టుకొని ఉండినవో నూరు కాకులు వచ్చినట్లు వచ్చి ఆ పుల్లాకుల్ని ముక్కులతో, కాళ్లతో ఈడ్చి చింపి లాగేస్తున్నవి. కాకులను తరుముతూ నాలుగు పందులు ఆకుల్లో మూతులు పెట్టి గతకడం మొదలుపెట్టినవి. రెండు కుక్కలు వాయు వేగంతో వచ్చి పందులపై బడి పుల్లాకు లన్నింటినీ బీభత్సం చేసి పారేసినవి.

ఆ పుల్లాకుల్లోనుండి కొట్టిన కమ్మని వంటకాల వాసనకు రిక్షావాలా నోరు ఊటలూరి, కడుపులో ప్రేగులు గుర్రుమని కొట్టుకోసాగినవి. అది వాని కొక అననుభూతమైన అనుభవం. ఏనాడూ ఎరగని వాని ఆభిజాత్యం అడ్డు తగిలి సైడుకాలవల్లో పడిన పుల్లాకులమీద రోతనే పుట్టించింది. అందులోనూ పందులు మూతిబెట్టిన వస్తువు తాను తాకడం ఎట్లా!

# సన్నజీవాలు

మటమటమంటూ సూర్యరశ్మి వేడెక్కినకొద్దీ వాని శరీరం భుగభుగమని మండిపోతోంది. శోషవల్ల రెండు చెవుల లోనూ హోరుమని శబ్దం బయలుదేరింది. ఆనాడుకూడా సాయంత్రంవరకూ వాడికి చిన్నడబ్బు సంపాదన లేకపోయి నట్టయితే యిక బ్రతకడం ఎట్లా? అతని కేమీ పాలుపో లేదు. తోడి రిక్షావాణ్ణి ఒక్కపావులాడబ్బులు అప్పు అడి గాడు. 'పండగపూట. బదులేమి' టని ఈసడించి ఊరు కున్నా డతగాడు.

ఇంతలో కాంపౌండు గేటు తెరచుకొని ఒక పెద్దమనిషి బయటకు వచ్చి 'రిక్షా' అని పలకరించాడు.

ముఖమంతా కండ్లు చేసుకొని, కొండంత ఆశతో 'సామీ' అని రిక్షావాలా లేచి నిలబడి దణ్ణం పెట్టాడు.

"టౌన్‌లోకి ఏమి తీసుకొంటావు?"

"నీ దయవచ్చినంత ఇవ్వు సామీ!"

"తర్వాత తగువులాడితే నేను ఒప్పుకోను. మూడ ణాలకంటే ఎక్కువ నే నెన్నడూ ఇవ్వలేదు."

"సిచి త్తం" అని అంటూ, మూసిన గూడు ముందుకు విప్పి, తన వాహనం రోడ్డుమీదికి లాగి, దిండుమీది ధూళి దులిపి—"రా, సామీ" అన్నాడు రిక్షావాలా.

చేతిలోని తమలపాకులకు సున్నం రాచి పంటిసందున కొరికి, "గోవింద, గోవింద" అంటూ రిక్షా అధిరోహించాడు ఆ పెద్దమనిషి.

ఆయ నొక స్థూలకాయుడు; నడిమివయస్సువాడు. ముఖాన ఉన్న గంధం, అక్షతలూ అతను బ్రాహ్మణుడనే తెలియజేస్తున్నవి. కాని కట్టిన దోవతివల్లా, వేసుకొన్న కోటువల్లా అత డొక ప్లీడరో, సర్కారు ఉద్యోగో అని కూడా అనుకోవలసి ఉంటోంది. అతని బరువుకు రిక్షా రవంత జవజవలాడిపోయింది గాని కింది కమానులుమాత్రం విరగ లేదు.

రిక్షాకు దణ్ణం పెట్టి కళ్ల కద్దుకొని, 'పరమాత్ముడా' అంటూ కాడి పైకెత్తుకొన్నాడు రిక్షావాలా. ఆ ఊపునకు బ్రాహ్మడి కడుపులోని నీళ్లు కొబ్బరిబొండంలోలా గళగళ కొట్టుకున్నవి.

పాడురోడ్లు! మునిసిపల్ పరిపాలనంతటి అధ్వాన్నపు ప్రభుత్వం మరొకటి ఉండబోదు. అడుగడుక్కీ రోడ్డు చెడి పోయి గుంతలుపడి ఎగుడూ దిగుడూను! ఎన్నెన్ని వేలు వసూలయినా ఈ మాయదారి మునిసిపల్ బడ్జెటులో బొక్క పడడమూ, చివరికి రోడ్డు మరమ్మత్తుకి డబ్బు కొరతబడిపోవడ మూను! ఆ పాపిష్ఠిరోడ్డుమీద పోతుంటే—పాపం, భుక్తా యాసమయినా తీరకుండా బయలుదేరాడేమో—ఆ బ్రాహ్మ డికి ప్రాణాంతకంగా ఉన్నది ఆ కుదుపు. రోడ్డుకి తగినట్టుగానే ఉన్నది రిక్షాకూడా. అదొక పాతబొచ్చె. కమానులన్నీ కదిలి పోయి లొటలొటలాడుతూ రవంత వల్లదప్పితే విరుచుకొని కింద పడిపోయేటట్టు ఉన్నది ఆయనఘటం. కింద దిండుని

నల్లులే ఉన్నాయోఏమో, పుటుకు పుటుకుమంటూ మనిషికి స్థిమితం లేకుండాపోతోంది. మట్టమధ్యాహ్నపు ఎండేమో, బ్రాహ్మడికి ముఖంమీదా, మెడకిందా చిరుచెమటపోసి శరీరం పేలినట్టు చిటచిటలాడిపోతోంది. "ఎందు కెక్కితినా ఈ రిక్షా" అని ఆయన దిగులుపడుతూనే ఉన్నాడుగాని, "రిక్షా నిలుపు" అనిమాత్రం ఆయన నోటివెంట రావడం లేదు.

రిక్షావాడిబాధ ఆపరమాత్ముడికే తెలియాలి. లోపలి మనిషి.భారం తనకి మించిన భారంలా బరువెక్కిపోయింది. ఆ పాడురోడ్డుమీద ఆ రిక్షా లాగాలంటే అతగాడికి తల ప్రాణం తోకకి వస్తోంది. అందులో రెండు పూటలుగా అన్నరసం లోపలికి పోనటువంటి గడియలేమో, వాడికి అడుగడుక్కీ ఒకగండమైపోయింది. ఎంతెంత దమ్ముపట్టి హుంకరించినా గుండె దడా, ఆయాసమూ, నో రెండిపోవడమూమాత్రమే కాని రవంతకూడా రిక్షా కదులుతున్నట్లు అతగాడికి కనిపించడం లేదు. "రిక్షా లాగలేను సామీ" అని వదలుకొంటే ఆరోజు కా మూడణాలుకూడా దక్కకుండా పోతవేమోనని అతగాడి దిగులు. ఆ మూడణాలూ మూడువందల రూపాయలుగా అతని హృదయంలో వెలిగిపోతున్నవి. అది ఆరణాలు తీసుకోవలసిన ప్రయాణమైనా తాను నోరు విప్పి బేరంచేస్తే అసలుకు మోసం రాగల

దేమో అనే భయంచేత బ్రాహ్మడు మూడణాలంటే తానున్నా 'మాబా' గన్నాడు.

ప్రయాణం కుదుపునకు బ్రాహ్మడి నిండుకడుపు బరువెక్కి డొక్కలో సన్నని నొప్పికూడా బయలుదేరుతోంది. పండగభోజనంలో ఏయే పదార్థాలూ, పిండివంటలూ పడ్డాయో ఆయనకుక్షిలో—ఆ ఎండలో, ఆ రిక్షామీద, ఆ రోడ్డుమీద—బ్రాహ్మడికి ఆయాసం, వగర్పూకూడా పుట్టుకొనివచ్చినవి. భోజనానంతరం సేవించిన తాంబూలంవల్ల భుక్తాయాసం రవంత సర్దుకోవలసిందే నిజానికి; కాని ఆ దిక్కుమాలిన ప్రయాణంలో తాంబూలసేవనంకూడా ఆయనకు వెగటుపుట్టి, వికారంవల్ల 'థూ' అని ఉమ్మివేసి ఊరుకున్నాడు. ఆ బాధ పడలేక రిక్షా దిగి యింటికి పోవాలనుకొన్నాడు బ్రాహ్మడు. కాని సగం దూరం వచ్చిన తర్వాత దిగిపోతే పూర్తిగా మూడణాలూ తీసుకోకుండా విడిచిపెట్టుతాడా రిక్షావాడు? ఆరణాలు ఇచ్చుకోవలసిన ప్రయాణం తనకి మూడణాలకే దొరికింది. ఎట్లా పోగొట్టుకోవడం? పోగొట్టుకొని దిగితే, తిరిగి యింటికి పోవడం ఎట్లా? తాను నడిచివెళ్ళే స్థితిలో లేడే! మరణవేదనలో ఇస్సురని నిట్టూర్చి, "గోవింద, గోవింద" అని భగవన్నామం స్మరించాడు బ్రాహ్మడు.

"నారాయణమూర్తీ!" అని ఉస్సురంటున్నాడు రిక్షావాలా. 'కరువులో అధికమాసం' అన్నట్టు అక్కడ

ఎత్తయిన బ్రిడ్జి ఒకటి దాపురమైంది. రిక్షావాడు హుం అని హుంకరించి బ్రిడ్జిమీదికి లాగుతూంటే శరీరం యావత్తూ ముచ్చెమటలుపోసి, గొంతులో వేడినిట్టూర్పువల్ల తడి ఎండి పోయి, ఒక్కొక్కతడవ తను ముందుకు లాగే రిక్షా అంత బరువుతోనూ తటాలున వెనక్కికూడా జరిగిపోతోంది. రిక్షా చెయ్యిజారితే ఏం ప్రమాదం సంభవిస్తుందోనని బ్రాహ్మడు భగవంతుడిమీద భారంవేసి, "భద్రం, భద్రం" అని పైనుండి కిందివాడికి హెచ్చరిక చేస్తున్నాడు.

బ్రిడ్జి ఎక్కేసరికి తిరపతికొండ ఎక్కినంతపనిఅయి రిక్షావాడు తలకిందులైపోతున్నాడు. కాని, బ్రాహ్మడు మాత్రం బ్రదుకు జీవుడా అని ఒక్కనిట్టూర్పు విడిచాడు.

కాని, కష్టసుఖాలు కావడికుండలు. బ్రిడ్జి ఎక్కి దిగుడులో కిందికి తిరిగేవరకు కొండమీదినుండి దొర్లించిన పుచ్చకాయలా జర్రున జారిపోతోంది రిక్షా. ఈసారి రిక్షా బలవంతాన లాగవలసిన ప్రమేయం వాడికి లేకపోయినప్పటికీ ఆ దూకుడులో రిక్షాతో సమానంగా పరుగుపెట్టవలసి వచ్చింది రిక్షావాడికి. రిక్షాదూకుడుకు ఆ గులకరాతిరోడ్డు మీద బ్రాహ్మడిశరీరం హూనంఅయిపోయినట్టయి, కడుపులో వెర్రిబాధ బయల్దేరి, రిక్షా పూర్తిగా కిందికి దిగే పర్యంతమయినా ఆబాధకి తట్టుకోలేక—

"ఇస్సు, అబ్బా! నిలపరా నీయమ్మకడుపుకాలా!" అని బ్రాహ్మడు వెర్రికేక పెట్టాడు.

ఆ కేకతో బేజారెత్తి బలవంతాన రిక్షా రోడ్డుపక్కకి లాగి నెమ్మదిగా కిందికి దింపేడు రిక్షావాలా.

ఆ బ్రాహ్మడికి అదేమి బాధో పాపం, రిక్షాలోనుండి కిందికి దిగడానికయినా సందులేకుండా రిక్షాలో కూర్చునే బయట రోడ్డుమీదికి ఓక్కు ఓక్కుమని డోక్కుంటుంటే, కడుపులోని హోళిగ ముక్కలు, ఆవడలు, క్షీరాన్నం, కూరముక్కలు, సాఫు సీదా కడిగివేసినట్టు బొళబొళమంటూ బయటపడిపోయి ఆ బ్రాహ్మడికి ప్రాణం కడంటిపోయింది.

ఆ ప్రయాణపు దెబ్బకి మలమలమాడే రిక్షావాలాకి కడుపులో చెయ్యిపెట్టి కలచినట్టయి వికారంపుట్టి, వొళ్లు తిరిగి పక్కనే రోడ్డుమీద కూర్చుని కక్కుకుంటూంటే—

దోవన బోయే ఒక మోటారు అక్కడ నిలిచి—"అయ్యో, పెద్దమనిషి కెంత ఆపదవచ్చిం"దంటూ బ్రాహ్మణ్ణి ఎక్కించుకొని యింటిదగ్గర దిగబెట్టింది.



# “512”

‘హాల్ట్! హు కమ్స్ దేర్?’

(‘ఎవరావచ్చేది! నిలు’ అని అర్థము.)

సర్కారు ఖజానాలోని గడియారం టంగుటంగున పదిసార్లు బదులుపలికింది.

వాట్టి భ్రమేనా ???

ఒకవిధమైన రిచ్చపాటులో పడ్డాడు—512.

ఆ స్టేషనుకు కొత్తగా ట్రాన్సుఫరయి వచ్చిన పోలీసు జవాను అతడు. అసలు పోలీసు నౌకరీకే కొత్త అని చెప్ప వచ్చు. అతనికి హితవు లేకపోయినా వచ్చిపడిం దీ ట్రాన్సు ఫరు.

ఇక్కడకు వచ్చిన ఈ నెల్లాళ్ళుగా ఆ సబినస్పెక్టరు ముండావాడు అతనికి తరచు పల్లెలమీాదనే కాగితాలడ్యూటీ వేసి ఇంటిపట్టున ఉండనీకుండా చేస్తున్నాడు. కొత్తగా కాపరానికి వచ్చిన భార్య. కొత్త ఊళ్ళల్లో తనతో ఒంట రిగా తిరిగి కాపురంచేయడానికి భయమాతోందని జంకిన ఆ అబలకొరకు ఎంత త్యాగమైనా చేసి ఆమెశీలం కాపాడి రక్షిస్తానని అభయహస్తమిచ్చిన శూరుడు—512. కాని ఈ స్టేషనుకు వచ్చినదిలగాయతు సబినస్పెక్టరువైఖరే అతనికి కంటకంగా ఉంటోంది.

# సన్నజీవాలు

చలికాలం. చీకటిరాత్రి. రూపసియగు భార్యను ఇంటి దగ్గర ఒంటరిగా విడిచి తాను డ్యూటీచేయడానికి వచ్చే శాడు. సబినస్పెక్టరు ప్రవర్తన మంచిది గాదని లైనులో చెప్పుకొంటున్నారు. ఈవిధంగా తనను ఒంటరిగా విడిచి ఉద్యోగాలు చేసినట్టయితే, తా నక్కడ ఉండలేననీ, పుట్టింటికి వెళ్లిపోతాననీ గోలచేయడం మొదలుపెట్టింది భార్య. కొంతకాలంవరకూ తనకు రాత్రిపూట డ్యూటీ తప్పించవలసిందని లోపాయికారీగా ఎంత ప్రార్థించుకొన్నా వినిపించుకొన్నాడు కాడు సబినస్పెక్టరు.

రాత్రి పదిగంటల కారంభమైన ఖజానాడ్యూటీ ఒంటిగంటకుగాని పూర్తికాదు. ఇంటికిపోవడం ఎప్పు డబ్బా!

చికాకో, పరాకో, ఉండి ఉండి—

"హాల్ట్! హు కమ్స్ దేర్!"

అని మళ్లా కాషన్ ఇచ్చాడు.

పంచభూతాత్మకమైన శరీరం జెయిలుడ్యూటీలో బందీకృతమైపోయిందిగాని, అతని పంచప్రాణాలూ ఇంటి దగ్గర ఇల్లాలిచుట్టూ ఫారాతిరుగుతూనే ఉన్నవి.

"ఛీ! ఆడజాతి! పిరికిజాతి! పరాధీనమైన బ్రతుకు! తన శీలం తాను కాపాడుకోలేని ఆడదాని బ్రతుకు బ్రతుకేనా! మొగవాడయినవాడు ఆడదాన్ని ఎంతదూరమని కాపాడి రక్షించగలడు? పోలీసుజవానుల్లాగా ప్రతీఆడదానికీ

ఒక తుపాకీ సప్లయిచేసి ఆత్మరక్షణకోసరం తుపాకీగుండు గురిచేసి పేల్చడం సర్కారువారు నేర్పిస్తే బాగుండును.

దుర్మార్గు లెవరూ రాత్రిపూట ఒంటరిగా ఉండే సమయం కనిపెట్టి తన ఇంటిపైకి రావడం లేదుగదా! ఆ దుర్మార్గుల దౌర్జన్యానికి లోబడి తన ధర్మపత్ని గడగడ వణికిపోవడం లేదుగదా! ఎదిరించడానికి ఆపెదగ్గర తుపాకీ కూడా లేకపోయెనే!''

తల పగిలిపోతోంది 512 కి.

దట్టంగా పెరిగిన చీకటిలో గాలికి కదిలే నల్లని చెట్లనుకూడా నమ్మలేక,

''హాల్ట్! హు కమ్స్ దేర్?''

అని వెర్రికేక పెట్టాడు 512.

తన కాషన్ భార్య కాపురంచేసే ఇంటిదాకా వ్యాపిస్తుందా!

సబ్ జెయిలు ఇనపకమ్ములసందున కూనిదీర్ఘాలుతీసే పాట నిలిపి, హా, హా, హా అని వికటహాస్యం చేశాడు ఒక ఖయిదీ.

512 కి ఒళ్లు చుర్రుమనింది.

''నువ్వు ఏడనో కొత్త బిచ్చగాడివిలా ఉండావే'' అన్నాడు ఖయిదీ.

ఉన్నమాట అంటే ఉలుకు ఎక్కువ. తను కొత్త పోలీసు జవాను నన్న సంగతి ఎట్లా తెలుసుకోగలిగాడు —

ఖయిదీ! తన అంతర మేమిటి? వాడి అంతర మేమిటి? నోటి కెంత వస్తే అంతేనా! కొత్త బిచ్చగాడని తనని ఎగ తాళి చేస్తాడా!

"నోరు మూసుకో" అని ఖయిదీని గద్దించి—

"హాల్ట్, హు కమ్స్ దేర్?"

అని మళ్లా అరిచాడు 512.

"అబ్బో!" అని సాగతీసి, పకపక నవ్వేడు ఖయిదీ!

చలికి ముడిచిపెట్టుకొని లాంతరుక్రీనీడని పడుకున్న వార్డరు లేచి చుట్ట ముట్టించాడు.

ఖాకీయూనిఫారం, నెత్తిన 512 నెంబరు ఎర్రటోపీ, నడుముకు సరికొత్త తోలుబెల్టూ, బెల్టుకు తగిలించిన మూడు జానల పొడుగు లాఠీ, కుడిభుజంమీద బాయ్నట్టు తగిలించి లోడ్డుచేసిన వొంటి నల్లి కేపు తుపాకీ! రైట్, లెఫ్ట్! రైట్, లెఫ్ట్! అడుగులు కొలుచుకొంటూ, మిసమిసలాడే త్రాచు పాముచురుకుదనంతో సబ్ జెయిలుకూ, సర్కారుఖజానాకూ పారాయిస్తున్నాడు 512.

హాలులో వేలాడగట్టిన హరికేన్ లాంతరుదీపం కాంతిలో తన రెండు భుజాలకూ తగిలించిన ఇత్తడిబిళ్ల ఇంగ్లీషు అక్షరాలు తళతళ మెరిసిపోతున్నవి. పిక్కలకు చుట్టిన ఖాకీసాక్సు, కాళ్లకు తగిలించిన క్రోముతెదరు తెల్ల చెప్పులూ బిగుతగిలి, అంత చికాకులోనూ అతని శరీరాని కొకవిధమైన ఉత్సాహాన్ని చేకూరుస్తున్నవి.

రెండు లక్షల రూపాయల సర్కారునగదు గల ఖజానా. దొంగతనం, బందిపోటు, ఖూనీ వగైరా నేరాలు చేసిన ఖయిదీలు, జెయిలు బిల్డింగూ, ప్రపంచా న్నంతనీ చుట్టబెట్టిన బ్రహ్మాండమైన అంధకారమూ - ఇప్పుడు తన ఏలుబడికి లోబడి ఉన్నట్లేకదూ! అబ్బ! ఒక్క పోలీసు జవానుకు ఎంత నిరంకుశమైన అధికారం! "హాల్ట్" అని తాను సాదరుచేసే ఒక్క మూజువాణీ ఉత్తర్వు నతిక్రమించి తనను సమీపించడానికి ఆ చీకటికూడా గడగడలాడవలసి నదే. లేకపోతే తనహస్తగ్రస్తమైన తుపాకీ ప్రయోజన మేమిటి?

నూనూగు మీసంమీద చేయి వేసుకొని సవరించు కొన్నాడు 512. మెత్తని నున్నని గడ్డం నిమురుకొన్నాడు. ఉబికి పైకి పొంగే ఛాతీ విరుచుకొని, ఊపిరి లోపలికి ఎగపీల్చు కొన్నాడు. జెయిల్లో ఖయిదీలు దగ్గినా, సకిలించినాకూడా బడిపంతులు పిల్లకాయల్ని అదిలించినట్లు అదిలిస్తున్నాడు.

కాని, వీ డెవడు? ఇనపకమ్మీల సందున ఇరుక్కొని కూడా తన అధికారానికి లోబడి ఉండేటట్లు లేడే!

దూరాన్న చెట్లగుబురులో సవ్వడి విని,

"హాల్ట్! హు కమ్స్ దేర్?"

అని వెర్రికేక పెట్టాడు 512.

"నీకు అస్తావిస్తమా ఏందయ్యా?" అని ప్రశ్నిం చాడు ఖయిదీ.

చీకటిలోకి గురిచేసిన తుపాకీ దింపి ఇనపకమ్ములవైపు తిరిగి గుడ్లెర్రచేశాడు - 512.

తోక లొటలొటలాడించుకొంటూ ఊరకుక్క ఒకటి లాంతరుకాంతిలో మెరిసింది.

"కాల్చక ఇంకా చూస్తావేందయ్యా" అని కడుపు పిసుక్కొంటూ నవ్వేడు ఖయిదీ.

"కిషన్"అని పలకరించాడు వార్డరు.

"నేను జెయిల్లోపడ్డ ఈ రెండునెలలుగా నువ్వు నాకు అగపడలేను - నువ్వేమయినా కొత్తగా చేరినావా ఏందయ్యా ఈ పోలీసుల్లో? నువ్వీనౌకరీకి లాయఖు కావే?" అని రిమార్కు చేశాడు ఖయిదీ.

కిషన్‌సింగు రసపుత్రరక్తం సలసలలాడింది. తా నింకా సార్జంటుగానూ, సబినస్పెక్టరుగానూ ప్రమోషన్ అయి పైకి పోవాలనుకొంటుంటే, కానిస్టేబిలు నౌకరీకికూడా లాయఖు కాదంటాడా ఈ ఖయిదీ! వీణ్ణి ఈపాటున కాల్చి పారేసినా దోషమున్నదా?

"తేపతేపకూ తుపాకీ గురిచేస్తావు. ఎంతమందిని కాలుస్తా వేందయ్యా?"అని ఇంకా ఎగతాళిగానే మాట్లాడుతున్నాడు ఖయిదీ.

"అధనప్రసంగం చేస్తివా - ముందు నిన్ను కాలుస్తా చూడు" అన్నాడు 512.

"నిదానించు, నిదానించవయ్యా మొనగాడా" అన్నాడు ఖయిదీ.

"ఎంత మొండి ముండాకొడుకువురా" అని నోట్లో చుట్ట తీసి కొడి దులిపాడు వార్డరు.

"ఎవ రీ ఖయిదీ? పేరు చెప్పు వార్డర్" అన్నాడు 512.

"నాపేరు యానాది ఆదిగాడు. రాసుకో" అన్నాడు ఖయిదీ.

"వీడు చేసిన నేర మేమిటి వార్డర్?" అన్నాడు 512.

"నే చేసిన నేరం చెప్పితే పోతుంది గాని నువ్వు పసివాడివిలాగా ఉంటావే, నీకు పెళ్లి అయిందటయ్యా పోలీసాయనా" అని అడిగాడు ఖయిదీ.

అదుగో! తన పెళ్లిసంగతి ఈ కుంక కెందుకూ!

"అయిందిరా" అని వార్డరే జవాబు చెప్పాడు.

"భార్య సంసారానికి రాలేదా?" అని క్రాస్ చేశాడు ఖయిదీ.

"వచ్చిం" దన్నాడు వార్డరు.

512 ఒంటిమీద తేళ్లూ, జెర్రెలూ పాకి పోతున్నవి.

"అయితే, అప రేత్రి కాడ ఆపిల్లని ఇంటికాడ ఇడిపించి నువ్వీడ ఉద్దోగంచేయడానికి తయా రయినావంటయ్యా మొనగాడా" అన్నాడు ఖయిదీ.

తన తుపాకీగుండుకు ఆరాత్రి ఆదిగాడి ఆయువు మూడిందనుకొన్నాడు 512.

"ఆదిగా" అని పలకరించాడు వార్డరు.

"అదే యానాదివాడయి, యానాదికులంలో పుట్టిన మొనగాడయితే, ఉద్యోగాలు కాదు, ఊళ్లేలటాలు కాదు; మిన్ను విరిగి మీదపడ్డా కట్టుకొన్న ఆడదాన్ని ఇడిపించి ఉండగలడయ్యా వార్డరయ్యా" అన్నాడు ఆదిగాడు.

"ఆమాటమాత్రం నిజం" అన్నాడు వార్డరు.

"ఒరే! యానాదీ! ఇది సర్కారు జెయిలు. నీవు ఖయిదీవి. అర్ధరాత్రిపొద్దు. గలభా చేస్తున్నావు. నాచేతిలో తుపాకీ గమనించావా? భద్రం." అని ఆక్రోశం పట్టలేక మీదికి రాబోయాడు 512.

"రావోయ రావోయరా – చందురూడా
రావోయ రావోయరా – చందమామా."

అని చీకటి చించుకొని ఒకమధురగానం గాలిపాటుకు జెయిలుమీదికి దూకింది.

"హాల్ట్! హు కమ్స్ దేర్!"

అని కాషన్ ఇవ్వాలని 512 ప్రయత్నించాడు కాని చీకట్లో తిరిగే తియ్యని పాట అతని కర్ణపుటాలలో పడేవరకు ఉక్కిరి బిక్కిరయి అతని గొంతుకు పెగలలేదు.

అరమోడ్పు కన్దోయితో వార్డరు చుట్టపొగ దీర్ఘంగా పీల్చి నిదానంగా విడిచాడు.

చీకటి గుబురులో విహరించే తీయని పాటకు చప్ప

ట్లతో తాళంవేస్తూ ఇనపకమ్ములలోని కాహ్వాన మిస్తు న్నాడు ఆదిగాడు.

"రావోయ రావోయ
రాహు పొంచున్నాడు త్రోవలోన
ఆకొక్క పైనాను అల్లాడ వున్నాది
మబ్బుల్లపై నేమొ మాయ గప్పేసింది.
రావోయరా—"

అని చీకటి ఇంకా పాడుతూనే ఉన్నది.

512 కి అర్థం కావడం లేదు. "హాల్ట్! హు కమ్స్ దేర్!" అని కాషన్ ఇవ్వడమా, మానడమా!

"అందుకోరా ఆదిగా" అన్నాడు వార్డరు.

"తెల్లన్ని నీకాంతి నల్లనయ్యేనురా
చల్లన్ని నీమోము సన్నగిల్లేనురా
రావోయరా—"

అని ఆదిగాడు అందుకొని పాటలో పాట కలిపేడు.

"పరమరాకాసిరా" అని చీకట్లో పలికే పలుకే, "పరమ రాకాసిరా" అని జయిలు కమ్ముల్లో ప్రతి ధ్వనిస్తున్నది.

"మితిలా నినుబట్టి మింగబొయ్యేనురా
రావోయరా, రావోయరా, రావోయరా."

అని ఏకంతం ఎక్కడనుండి పలుకుతున్నదో భేదం తెలియకుండా బయట చీకట్లోనూ, లోపల జయిల్లోనూ ఒకేపాట బయద్దేరి ఆకాశమంతా ఆవరించింది.

అంతా అయోమయంగా ఉంది 512 కి.

"పోలీసాయనా" అని పలకరించాడు ఆదిగాడు.

ఆదిగాడు అంతటి పాటకుడా! మరి ఆ చీకట్లో పాడే మనిషి ఎవరు? ఎవరో స్త్రీకంఠంలా ఉన్నదే!

అర్ధరాత్రిసమయంలో ఆడమనిషి ఒంటరిగా జయిలు దగ్గర కెందుకు వస్తున్నట్లు? సరిగా ఆ మనిషి పాడినపాటే ఇక్కడ వీడుకూడా పాడుతున్నాడే.

512 కి ఆశ్చర్యమైపోతోంది.

"తీసుకో, తుపాకీ తీసుకో" అన్నాడు ఆదిగాడు.

512 కి ఆదిగాడంటే అయిదు నిమిషాలకు పూర్వం ఉండిన అభిప్రాయం ఇప్పు డెక్కడికో పారిపోయిన ట్టనిపించింది. కాని తుపాకీ తీసుకోమంటా డేమిటి?

చెట్లసందున మెదిలే మనిషి సవ్వడి గమనింపనేలేక పోతున్నాడు 512.

"అల్లు – ఊ – కంచుదే –" అని పకపక నవ్వేడు ఆదిగాడు.

మళ్లా కుక్క ఏదయినా తిరుగుతున్నదా అని కలయ చూచాడు 512.

"చూస్తా వేందయ్యా పోలీసాయనా! దగ్గరకి వచ్చేసింది రాకాసి......

"పరమరాకాసిరా పరమరాకాసిరా__"

అని పాడుతూ "ఊ! కొట్టు, కొట్టు"అని గలభా చేస్తున్నాడు ఆదిగాడు.

చుట్ట పారేసి, మంచినీళ్లు పుక్కిలించాడు వార్డరు.

"వచ్చె వచ్చె, మీదబడి
మిత్తిలా నినుబట్టి మింగబొయ్యేనురా.
కాల్చేయవయ్యా, తుపాకీ పేల్చేయవయ్యా."

అని అదిలిస్తున్నాడు ఆదిగాడు.

ఏమి టీ యూనాదివాడి ఆగడం? ఊరుకున్నకొద్దీ మితిమీరుతున్న దే వీడి వ్యవహారం!

512 చూపు చీకట్లోనే చిందులాడింది. చీకటికంటె నల్లనిచీర, చీరకంటె చిక్కని శరీరకాంతి, శరీరకాంతిని తల దన్నే శిరోజపుంజం, శిరోజపుంజాన్ని వెలిగించే శిరీష కుసుమాలు - ఆ మనిషి సెంట్రీని సమీపించినకొద్దీ,

"హాల్ట్" అని కాషన్ ఇవ్వాలనిగాని, తుపాకీ తీసుకోవాలనిగాని ఈసారి 512 మరిచిపోయాడు.

"వార్డర్! ఎవ రీమనిషి?" అని అడిగాడు 512.

వార్డరు జవాబు చెప్పేలోపలనే,

"నా అగచాట్ల కన్నిటికీ ఈ రాకాసిముండే కారణం. ముందు దీన్ని కాల్చి పారెయ్యి." అన్నాడు ఆదిగాడు.

"ఈ మనిషి నీ కేం గావాలిరా" అని అడిగాడు 512.

"చస్తే బూడిద కావా" లన్నాడు ఆదిగాడు.

"కిషన్! ఈ మనిషి ఆదిగాడి భార్య. ప్రతిపూటా ఇక్కడకు వచ్చి పెనిమిటిని చూచి పోతూఉంటుంది" అన్నాడు వార్డరు.

"నా పలుకు వినవైతివోయీ రాకుమారా,
నీ ఉసురు నేతీతునోయీ, రాకుమారా..."

అని పాడి నాట్యంచేసింది ఆడమనిషి. దానికి మతి భ్రమిం చింది గాబోలు ననుకొన్నాడు 512.

"దీనికి ఉన్మాదమయ్యా పోలీసాయనా!" అన్నాడు ఆదిగాడు.

"ఛీ! నోరుమూయ్" అన్నాడు వార్డరు.

"మామా......" అని పిలిచింది, ఆడమనిషి.

"ఏమే—"

"ఈపొద్దు మాఅమ్మగారు ఇంటికాడ పండగచేసు కొని అప్పచ్చులు పెట్టిందే. నీకోసరం మూటకట్టుకొని తెచ్చా" అని ఆదిగాణ్ణి సమీపించింది వాడిభార్య.

"ఆ! ఆ! నిలబడు" అని ఖంగారుపడుతూ అటకా యించింది 512 అధికారం.

"ఆ పోలీసాయనక్కూడా రెండు అప్పచ్చులు లంచం పెట్టవే పిల్లా" అన్నాడు ఆదిగాడు.

"వార్డర్, ఖయిదీల కిట్లా పెట్టవచ్చునా" అని అడి గాడు 512.

"వార్డరయ్యా! ఈ పోలీసాయన ఇప్పుడే వోడ దిగి వచ్చినట్టుండాడే" అన్నాడు ఆదిగాడు.

"జెయిలుసూపరెంటుగారు వీడి విషయమై చూసీ చూడనట్టు ఉండుమన్నారు. ఆ మనిషి వీడి భార్య. వీణ్ణి

అరెస్టుచేసినప్పటినుండీ ఆమనిషి సూపరెంటుగారి ఇంటికాడనే పనిచేసుకొంటూ పెనిమిటిని విడిచిపెట్టి పోలేక ఇక్కడనే పడిఉన్నది. పోనియ్యి'' అన్నాడు వార్డరు.

''అసలు వీణ్ణెందుకు అరెస్టుచేశారు?'' అని అడిగాడు 512.

''నీలాంటి ఒక పోలీసు కానిస్టేబులును తుపాకితో కాల్చి చంపేసినందుకు'' అన్నాడు ఖయిదీ.

''ఆఁ—'' అని ఉలిక్కిపడ్డాడు 512.

తనవంటి పోలీసు కానిస్టేబి లంటాడు. ఏమి వీడి పొగ రనుకొన్నాడు 512.

''కానిస్టేబిలు వెంకటసామి వీడిభార్య ఈ లక్ష్మిని బలవంతంగా పట్టుకోబోయేవరకు వీడు తుపాకితో కాల్చి చంపేశాడు'' అన్నాడు వార్డరు.

ఠంగుమని సెంట్రీగడియారం కొట్టింది.

''సత్యం! సత్యం! నా ఏలినవాడా!'' అన్నది లక్ష్మి.

''వీళ్లది యానాదికులమైనా, మొదటినుండీ వీళ్లు వీధినాటకాలూ, భాగోతాలూ, పాటలూ నేర్చుకొని, ఊరూరా నాటకా లాడి జీవనం చేసుకొనేవాళ్లు'' అన్నాడు వార్డరు.

''లక్ష్మికంఠం కోకిలకంఠం'' అన్నాడు 512.

''దాని ఆటా, దాని పాటా ఇవే దానికి వండ తెచ్చి పెట్టినవి. వెంకటసామి రాడీముండాకొడుకు. దాని వెంట బడ్డాడు.''

"..................."

"ఒకరోజు సంజచీకటికాడ వీళ్ళిద్దరూ పొరుగూరు నుంచి యానాదిపాలేనికి పోతుంటే ఒంటరిగా చిక్కేవరకు తన పోలీసుఅధికారం చూపి ఆదిగాణ్ణి చెట్టుమొదట్లో విరిచి కట్టి, లక్ష్మిని పట్టుకోబోయాడు వెంకటసామి—" అన్నాడు వార్డరు.

"మామా, నాకు భయమౌతున్నదే" అన్నది లక్ష్మి.

"గమ్మున ఉండు. ఆ పెద్దమనిషిని చెప్పనియ్యి—" అన్నాడు ఆదిగాడు.

"వార్డర్" అన్నాడు 512.

"లక్ష్మి తిరగబడి వెంకటసామిమీద రాళ్లు రువ్విందట. వెంకటసామికి ఒళ్ళు మండి దాన్ని జుట్టుపట్టుకొని బరబర లాక్కొని వచ్చాడట. ఇంతలో కట్టినకట్లు ఎట్లా విప్పుకొన్నాడో ఆదిగాడు, విప్పుకొని కిందపెట్టిన వెంకటసామి తుపాకి తీసుకొని అతన్ని డొక్కలో ఒకగుండు పేల్చి భార్యని తీసుకొనిపోయాడట" అన్నాడు వార్డరు.

"విన్నావా పోలీసాయనా—హుం" అని మీసం దువ్వేడు ఆదిగాడు.

"అట్లయితే వీడిమీద కేసెందుకు?" అని సందేహం కలిగి అడిగాడు 512.

''మనం చేసినపని చట్టం ఒప్పుకోదంట'' అన్నాడు ఆదిగాడు.

''కేసు విచారణ పూర్తి అయింది. ఉరిశిక్ష చెప్పారు. రేపో ఎల్లుండో హైకోర్టునుండి ఉత్తర్వులు రావాలి'' అన్నాడు వార్డరు.

512 కి గుండె పగిలింది.

''నే చస్తే చచ్చానుగాని పోలీసాయనా - నువ్వే చెప్పు న్యాయం. ఇందులో నే చేసిన నేర మేమిటో. అదే నీ పెళ్లాం అయిందనుకో, ఏం చేస్తావయ్యా-'' అని అడిగాడు ఆదిగాడు.

జెయిలుకమ్మీల చాటున ఉండిపోయాడుగాని, లేకుంటే ఆప్రశ్నకు ఆదిగాణ్ణి పొడిచిపారేద్దా మన్నంత రోషం వచ్చింది 512 కి.

''ఛీ! నోరుమూయ్'' అనిమాత్రం కసురుకొని ఊరుకొన్నాడు 512.

''మామా! నీకో మంచిమాట చెప్తాను, ఏమిస్తా'' వన్నది లక్ష్మి.

''మంచిమాటే అయితే కమ్మటి ముద్దిస్తా'' నన్నాడు ఆదిగాడు.

''మామా! మా అమ్మగారు రహస్యంగా చెప్పినారు. ఎక్కడా అనవద్దన్నారు. పైకోర్టునుండి ఈసందె కాడ ఉత్తర్వులు వచ్చినవట. కేసు కొట్టివేశారట. నిన్ను తెల్ల

వారి ఇడిపిస్తారంట. ఇవిగో! అప్పచ్చులు-" అని మెల్లంగా చెప్పింది లక్ష్మి.

"ఆ! నిజమేనా..." అని గంతువేశాడు ఆదిగాడు.

"నిజమే మామా. పైకోర్టువారు పోలీసువారి సాక్ష్యం నమ్మలేదట. మన సాక్ష్యమే నమ్మినారంట-" అన్నది లక్ష్మి.

"అదీ రంగా! దేవు డెక్కడున్నాడురా, రంగా" అన్నాడు ఆదిగాడు.

"అరవబోక" అన్నది లక్ష్మి.

"ఆదిగా" అన్నాడు 512.

"మామా, ని న్నిడిపించినారంటే రేపే—

"ఆడనీ సుక్కాని
ఈడనే గడయేసి
పడవెక్కి భద్రాద్రి కడదామా,
భద్రాద్రి రామణ్ణి గొలుతామా."

అని పాట ఆరంభించి మళ్లీ నాట్యంచేసింది లక్ష్మి.

512 గడియారంగంటలు, నిమిషాలు, సెకండ్లు లెక్క పెట్టుకొంటున్నాడు.

ఇల్లూ, ఇంటిదగ్గర భార్యా, సబినస్పెక్టరూ, తన డ్యూటీ మళ్ళా సింహావలోకనంలోనికి వచ్చినవి.

గడియారం టంగున ఒంటిగంట కొట్టి 512 కి డ్యూటీ మార్చింది. ఇక జెయిలుదగ్గర క్షణం నిలవలేక పోయాడు 512. ఆదిగాడు తన దృష్టిలో ఒక మహాయోధుడులాగా

ప్రకాశించి పోతున్నాడు. వాడు చేసిన సాహసకార్యం తన పాలిటి కొక తారకమంత్రంలా తోచింది.

భుజంమీద తుపాకీ పెట్టుకొని ఎట్లా వెళ్ళేడో - తన శరీరం తనకు తెలియనిస్థితిలో ఇంటికి వెళ్ళేడు.

సబిన్‌స్పెక్టరు కాదు - బ్రహ్మదేవుడయినా తను లేని సమయంలో తన ఇంటివాకిట మెదిలినట్టయితే కాల్చిపారేస్తా నంటూ అంగలువేస్తున్నాడు 512.

వీధి వాకిటికి పోయి తలెత్తి చూచేవరకు తన వరాండాలో ఒక మనిషి నిలబడి, 512 కి కనిపించాడు. 'ఎవరువా' రని కేక పెట్టాడు 512.

ఢాం ఢాం అని రెండు తుపాకిగుళ్లు ఏకకాలంలో పేలినవి.

లైనులో నిద్రించే జనం లేచి గుమిగూడి చీకట్లో లాంతరు దీపంలో వెతికారు. కాలిమీద తగిలిన గుండు దెబ్బకు నెత్తురు వరదలై, వాకిట్లోనే పడిపోయి ఉన్నాడు 512 ఒక్కడూను.

ఇంట్లోకి పోయి చూడగా, తలుపులు తెరచి ఎవ్వరూ లేక ఇల్లంతా బావురుమన్నది.



# పశువులకొట్టం

"మామా! వాకిలి తియ్యి; మామా! వాకిలి, వాకిలి!"

పెట్టకూత వినబడ్డ పుంజులాగ, చెవులు బారెడు చేసుకొని ఆప్యాయంగా ఆలకించాడు ఆ పిలుపు – సాలలో గుర్రానికి మాలీసు చేస్తున్న రొబ్బయ్య; వడివడిగా పోయి వాకిలిచిలుకు తీసి తలుపు తెరిచాడు, గడపలో నిలబడ్డ పెంచెల్ని ఆహ్వానంచేస్తూను.

"వాకిలి బిగించుకొన్నావేందయ్యా, సంజ కాడ! లోగా చిళ్ళాటలాడుతుండావా ఏంది?" అని కిసుక్కున నవ్వింది పెంచెలి.

"ఆడుతూనే వుండా" అన్నాడు బింకంగా రొబ్బయ్య.

"దేనితో?........."అని తెల్లమొగం వేసింది పెంచెలి.

"నీతోనే..........."అని సరాగంగా అన్నాడు రొబ్బడు.

"ఊఁ!........."అని దీర్ఘంతీస్తూ నెత్తిమీద గడ్డి గంప పట్టుకొని ఒక మెట్టెక్కింది పెంచెలి. గిల్లితే పాలు గారే దాని బుగ్గమీద చిటికెతో కొట్టి గడ్డిగంప తన రెండు చేతుల్లోకీ తీసుకొన్నాడు రొబ్బడు.

వాకిట్లో రొబ్బడి దర్శనంతోనే శరీరం తేలిక అయి పోయిన పెంచెలికి నెత్తిమీది గంపకూడా తొలగేవరకు పిట్టలాగ ఎగిరి రొబ్బడితో కూడా గుర్రపు సాలలోకి దూకిందది.

"మామా! గుర్రానికి గడ్డి మట్టసంచేసి తెస్తుండా వని, దినమ్మా నీ పోడు పడలేక, ఈ పొద్దు చేతులు బొబ్బ లెక్కేటట్టు దోకి దోకి, తెచ్చాను చూడు! అరిచేతు లెట్లా పుళ్లుపడ్డాయో ?" అని రెండు చేతులూ రొబ్బడికి చూపించింది. తన రెండు చేతులతోనూ పెంచెలి పాణిగ్రహణం చేసి ఆమెను చూస్తున్నాడు రొబ్బడు.

"ఎండలు ముదిరినై మామా! పచ్చని గరిక పోచ సిక్కడంలేదు. నేల తడి ఆరి గట్టిపడి రాయిలాగ పొద్దు గూకలూ ఎంత దోకినా - దోకుడుపార అరిగి మొద్దుబారడం, చేతులు పుళ్లెక్కడం తప్ప - గంప మట్టానికికూడా రావడం లేదు గడ్డి. ఇక తేకుంటే మామ కోపంచేస్తాడు గాబోసని మోసుకొని తెచ్చా" అని తల పైకెత్తి మామకళ్ళల్లోకి చూచింది పెంచెలి.

"కష్టంచేయకుంటే కడుపులోకి బువ్వ ఏడనుంచి వస్తుందనుకొన్నావు ?" అంటూ బొబ్బలెక్కిన పెంచెలి చేతులు తన కళ్ళల్లో పెట్టుకొని ఆమెను దగ్గరగా లాక్కొన్నాడు రొబ్బడు. పెంచెలి బాహువల్లరులు రొబ్బడి కంఠ సీమను చుట్టవేసుకొన్నవి. నుదుటిమీది నీటిచుక్కలు

చేత్తో తుడిచి, ఆమెను సందిట్లోకి లాక్కొని ఫాలభాగం మీద తన పెదిమెలు మెదిపాడు రొబ్బడు. పెంచెలికి ఆదినం చేసిన కాయకష్టం అంతా హరించిపోయి ఆనందం పొంగింది.

"వొద్దులు మామా! వొద్దులు: ఎవరన్నా సూస్తే సిగ్గుబోయేను" అని విడిపించుకోబోయింది పెంచెలి.

పైట జారగా రవికెలో బిర్రెక్కిన చిన్నిరొమ్ము ఒక్కసారిగా కంపించి చలించినట్లు తోచింది రొబ్బడి దృష్టికి. ఆ చలనంలోనే అతనికి హస్త చిత్త చాంచల్యాలు ఒక్కసారిగా అలుముకొన్నాయి.

"ఇహిహిహిహీ" అని గుర్రం సకిలించింది.

పరధ్యానంలో ఉలిక్కిపడి...

"అమ్మో! ఎవరో వస్తుండా"రని పట్టు విడిపించుకొని పైట సవరించుకొంది పెంచెలి.

"ఎంత పిరికిపిల్లవే!" అంటూ గుర్రంవైపు మళ్ళీ మాలీసు ఆరంభించాడు రొబ్బడు.

చీరకొంగున కట్టిన మూట విప్పి వక్కముక్క పంటి సందున కటిక్కుమని కొరికి, సగంముక్క మూటలోనే వేసుకొని, ఆకుచుట్టి నోట్లో పెట్టుకొంటూ, గోడ కానుకొని కూర్చుంది పెంచెలి.

రొబ్బడు గుర్రానికి మాలీసు చేస్తున్నాడు; తొడలు దిగని లంగోటీ, కండలు తిరిగిన దేహం, నిశుదైన వక్షస్థలం-

## సన్నజీవాలు

పిక్కలమీంది కండలు చెండుల్లాగ ఉబికేటట్టు, నేలకు కాళ్లు బిగదన్ని, గుర్రం డొక్కలికి తల మోటించి, ఊపిరి బిగబట్టి రెండు చేతులతోనూ తన శక్తికొద్దీ గుర్రానికి మాలీసు చేస్తున్నాడు రొబ్బడు. మోటురాళ్లను పిడిగుద్దులచే ముక్కలుచేయగల బలం; లేవదాటి ఒంకకట్టిన యౌవనం; తన బలమేమో, ఎదురుగా నిలబడ్డ గుర్రం బలమేమోకూడా భేదం తెలుసుకోలేని నిర్లక్ష్యం- చేతులు మంటలెత్తేటట్లు గుర్రాన్ని రుద్దుతున్నాడు రొబ్బడు. గుర్రంకూడా పొట్ట కిందా, మెడకిందా, నడుములమీందా నొప్పులు తీరేటట్టు మర్దనా చేయించుకొంటూ, తన్నా స్థలంలోనుంచి అడుగుదీసి అడుగు పెట్టేటట్టు కదిలించు చూతామంటూ, వెనకకాళ్లు వెనక్కీ, ముందుకాళ్లు ముందుకీ తన్నిపట్టి నిలబడే ఉంది. గుర్రమూ, రొబ్బడూ పంతాలు వేసుకొని కలియబడ్డారు. కాని ప్రపంచంలోగల జవంఅంతా బ్రహ్మదేవుడు తన నాలుగు కాళ్లలోనే పెట్టినసంగతి ఆ గుర్రం మరిచింది. కాళ్లు నేలకి తన్నిపట్టి తల గుర్రాని కానించి, "హుమ్మ"ని హుంకరిస్తూ మర్దించేవరకు, ఏనుగవంటి ఆ గుర్రం నడుము ఉండీలబద్దలాగ జవజవలాడుతూ వంగి, వెనకకాళ్లు కలగ దొక్కుకొని ఆ పక్కకి కింద పడబోయింది.

"ఆఁ! భద్రం! మోటుతనం చేయవోక!" అని గోడ కానుకొన్న పెంచెలి రొబ్బణ్ణి హెచ్చరించింది.

కిచకిచలు పెట్టిన పిల్లలు నవ్వినట్లుగా "ఇహింహింహీం" అంటూ గుర్రం మళ్లా సకిలించింది.

రొాబ్బడు ఎడంగా వచ్చి చేతులు దులుపుకొాన్నాడు.

"ఏందీ, ఒళ్ళంతా ఆ చెమటలు! అయ్యో! నీళ్ళలో మునిగి లేచినట్టుండావే! మరీ అంత మోటుతనమా? ఇట్రా రా! ఒళ్ళోపాలి తుడుస్తాను. రవ్వంత తాళి మళ్లా పట్రొాచ్చు తే!" అని మామను పిలిచింది పెంచెలి.

"ఉస్సు"మంటూ పెంచెలి కెదురుగ్గా మోకాళ్ల మీాద మోచేతులు పెట్టుకొాని కూర్చున్నాడు రొాబ్బడు. చీరకొాంగు తీసి అతని వక్షస్థలం, వీపూ, చేతులూ, ముఖం తుడిచింది పెంచెలి.

రొాబ్బడికి అలుపు తీరింది. చెదిరిపోయిన అతని క్రాపింగులోని వెంట్రుకలు చేత్తో సవరిస్తోంది పెంచెలి.

"పిల్లా! బిడ్డల్నికనే ఈడు వచ్చీకూడా మనిద్దరికీ ఎన్నాళ్లీ దొాంగచేష్టలు?"

"అయితే నాకు పెళ్లిచేయుమని మా అయ్యనీ, అమ్మనీ నా నోటితో ఎట్లా అడిగేదీ, నువ్వే చెప్పూ?"

"ఏమి, అడిగితే ఎగ్గా?"

"ఎంత బాగుండాదీ యిద్దూరం! అంత ఉ..లాటంగా ఉన్నవాడివైతే, నువ్వే వచ్చి మా అయ్య నడగ్గూడదూ?"

"మొగజన్మ ఎత్తి మూతిమీద మీసంగలవాడు, ఓ పరాయిమొగాణ్ణి పిల్ల నివ్వమని నాలిక తెగ్గోసినా అడ గ్గలడా!"

"నీ కెంత రోషం ఉండాదో, ఆడదాన్ని నాకూ అంతే ఉండాది."

"అయితే పెళ్లి చేసుకోకుండా ఈ మోయిన కూకుంటావా?"

"మొగోడివి నీకు లేని తొందర నా కేమొచ్చె?"

అని, రొబ్బడి వెనక చేరి వీపుమీది మట్టి నలుస్తూ కూర్చుంది పెంచెలి.

రవ్వంత నిదానించాడు రొబ్బడు.

"ఇంక గడువుపెట్టి క్రియలేదు. ఎప్పుడు నీమెళ్లో బొట్టు కట్టేనా, గుర్రంమీద నిన్నెక్కించుకొని ఎప్పుడు ఉత్సవం చేసుకొనేనా, ఎప్పుడు నీబుగ్గలు పులిమేనా - అని ఉబలాటంగానే ఉండాది. మా సూపరెంటుదొరనికూడా అడి గాను. ఓ! అబ్బెంతరం లేకుండా తీసుకొని పొమ్మన్నాడు, గుర్రాన్ని. పిల్లా! పసుపుబట్టలు కట్టుకొని, ఈ చింతపువ్వు వన్నె గుర్రంమీద నిన్ను కూకోబెట్టుకొని, గాజుదీపా లేసు కొని, ఔట్లు పేల్చుకొంటూ, ఉత్సవం చేసుకొంటే, నేను రాజులాగా ఉండనంటే!" అని మెడ వెనక్కు వాలేసి పెంచెలిబడిలోకి ఒరిగాడు రొబ్బడు.

"నువ్వు రాజులా గుంటే నేనుమాత్రం రాణిలాగ ఉండనంటయ్యా?" అని అతని చెక్కిళ్లమీద రెండు చిట్టి దెబ్బలు కొట్టింది పెంచెలి. "ఏదీ ఒక్కముద్దియ్యవే పిల్లా!" అంటూ ఆపెముఖం తనముఖంలోకి లాక్కొన్నాడు రొబ్బడు.

"నిజంగా మీదొర గుర్రాన్ని ఇస్తానన్నాడా మామా?" అని ఆత్రంతో అడిగింది పెంచెలి.

"నిజంగానే! నే నంటే మా దొరకి గుండెలో గుండె కాయ. అయిమువందలు కరుకులుపోసి మోజుపడి కొను క్కొన్న జీవం. దాన్ని డబ్బిచ్చి ఆయన కొనుక్కోవడ మేందో, నా చేతిలో పెట్టడం ఏందో - అంతే! ఇంక దొర మళ్లా గుర్రంమాట మరిచిపోయేటట్లు చేశానుగాని ఏమరి ఉండా ననుకొన్నావా? రేపటేళ అనకుండా, మాపటేళ అనకుండా బిడ్డని సాకినట్టు సాకుతుండాను గనక నే తలవెంటికి వాసికూడా తగ్గిపోకుండా ఏనుగలాగ ఎట్లా ఉండదో సూడు. వేడుకగా పెళ్లి చేసుకొంటానంటే ఉత్సవానికి ఒక్కపూట గుర్రమే ఇవ్వ ననడానికి ఆయనకి నోరు వస్తదా మొదలు?"

"మామా! నాకు గుర్రంమీద కూకోవాలంటే భయమే!"

"నే నుండానుగా! వెనకతట్టు కూచోని పట్టు కోనూ?"

"అబ్బో! ఆమాట తలుసుకొంటూంటే ఒళ్లు జలదరిస్తోందయ్యా! మరి గుర్రం ఉంచి ఉండి ఒక్కసారి పేరంతీస్తేనో?"

"తీస్తదా? మనం నిలుచోమంటే నిలుచోవాలె! కదం తొక్కమంటే తొక్కాలె! తరటు పొమ్మంటే పోవాలె! గాలప్ తీయమంటే తీయాలె! అంతేగాని దానిష్టప్రకారం పోడానికి గుండె లుండాయా?"

గుర్రం మళ్లా సకిలించింది.

"మామా! ఆగుర్ర మెక్కి మావూరు వూరంతా వూరేగాలె. ఈజన్మ ఇక ఈడేరినట్లే అవుతది నాకు."

"మీ వూరే అన్నమా ఏంటే పిల్లా! ఈ నగరం అంతా తిప్పనంటే! గుర్రాన్ని లొంగగొట్టడంలో రొబ్బడంతటి సైసు ఉండాడా అనిపించుకొన్నా! ఓ! నీ సరదా తీరేటట్లు దేశం అంతా తిప్పుతా గుర్రం దిగకుండా."

"అట్టయితే నే నీరాత్రికే మా అమ్మదగ్గర అంటానుండు పెళ్లిసంగతి. మామా! నువ్వన్నట్లు మన కీ దొంగ చెల్లాటాలు బాగులేదే! ఏం దీకర్మ! మనిద్దరం ఇష్టపడ్డాక ఇంక నలుగు డేమొచ్చె!"

రొబ్బడు సరేనని లేచి నిలబడి చెడ్డీ కంటుకొన్న మట్టి దులుపుకొన్నాడు.

తనకు కాబొయ్యే మగడూ, అతని ఎత్తునే నిలబడ్డ ఉన్నతమైన గుర్రమూ, రెండు పురుషసింహాల్లాగా గోచ

రించారు పెంచెలికళ్ళకు. ఆ ఇద్దరినీ అట్టే చూచుకొొని మనస్సులోనే పొంగిపోయింది పెంచెలి.

"సీకటి పడింది. పరుగుదూరం పోవాలె, మామా! రేపు మళ్లా వస్తా..." నని గడ్డిగంప చంకన బెట్టుకొొంది. జారిపోయిన కొొప్పుముడి సవరించుకొొంటూ, కట్టుకొొన్న కుచ్చిళ్లు చక్కజేసుకొొంటూ, పైటకొొంగు నడుంచుట్టూ తిప్పుకొొంటూ జరజర, జరజర నడచిపోయింది పెంచెలి.

పోతూఉండే పెంచెల్ని అట్టే పరకాయించి చూచి చూచి, గడప దిగి వీధిలోకి పోంగనే,

"సేసుకొొంటే ఇట్లాంటి పిల్లనే సేసుకోవాలె; సుకపడాలె" నని అనుకొొంటూ, గుర్రానికి దాణాపెట్టడానికి ఉలవలసంచీ మూతి విప్పాడు రొొబ్బడు.

## 2

పెంచెలి కాపురం ఉండే వూరు ఆ నగరానికి పరుగుదూరంలో వుంది. చీకటి దట్టంగాకముందే ఇల్లు చేరుకోవాలని పరుగులుతీస్తూ ఇంటిదారిపట్టి పోతోంది పెంచెలి. మంచి యౌవనంలో ఉన్న రొొబ్బడూ, తనూ కలిసి కూచొొని ఊరంతా ఊరేగగల చేయెత్తు గుర్రమూ, తన మాలవాడలో ఏ వధూవరులకీ లభ్యపడని అపూర్వమైన అశ్వారోహణ భాగ్యమూ—ఈ తలపులన్నీ పెంచెలి మనస్సును వికసింప

జేయగా, శరీరం పులకరించి, ఆమె ఒకవిధమైన ఉత్సాహం తోనూ, ఉద్రేకంతోనూ తొందరగా పోతోంది.

తనవూరు ఇక అరమైలుదూరం ఉంది. కనిచీకటి పడుతూ పడుతూ ఉంది. డబడబమని ఆకాశంలో పెద్ద ఉరుము ఉరిమి, పెంచెలి హృదయాన్ని చెదరగొట్టింది. 'అమ్మో! ఎక్కడనో పిడుగు పడిందే' అని తటాలున వెనక్కి తిరిగి ఆకాశంలోకి చూచింది. సూర్యభగవాను డేలోకం లోకి జారిపోయాడో కాని నల్లని కాటుకకొండలు రెక్కలు కట్టుకొని ఆకాశంలోకి ఎగిరి పెంచెల్ని తరుముకొని వస్తున్నాయి. పెద్ద గాలీ వానా వచ్చి తాను తడిసిపోతా నన్న భయంచేత పెంచెలి కాలివేగం వృద్ధిచేసింది. కాని అంతా కనురెప్పపాటు దృశ్యం. కళ్లు చీకట్లుకమ్మే మెరుపులు మెరవడ మేమిటో, మేఘాలు పరస్పరమూ ఒరుసుకొని గర్జించడ మేమిటో, తూర్పుసముద్రంమీదుగా ఎగిరివచ్చే గాడ్పులు పశ్చిమగోళంవరకూ వ్యాపించడ మేమిటో—అంతా అయిదు నిమిషాలలోనే. నల్లని ఆకాశం కరిగి నీరయిపోయింది. వడగళ్ల రాళ్లవాన దౌష్ట్యానికి పెంచెలి ఓర్చుకో లేకపోయింది. వడగళ్ళ తాకుడు—ఎవరో దుండగీంద్రుడు ఆమెను రాళ్ళతో విసరి కొట్టుతున్నట్లుగా వుంది. రొబ్బణ్ణి ఎంత స్మరించుకొన్నా తన నాదుకోను రాలేకపోతున్నాడు. రాళ్ళదెబ్బలు తప్పించుకొనే ఉపాయం ఊహించుకొనేలోపలనే, ఆమె ఆపాదమస్తకమూ తడిసి ముద్దయిపోయింది. తలమీద వడగళ్ళ

దెబ్బ తగలకుండా చంకనవున్న ఖాళీ గడ్డిగంప నెత్తిని బోర్లించుకొంది. అప్పటికప్పుడే కారుమబ్బులు దశదిక్కులా ఆక్రమించుకొన్నవి. పొద్దెంత పోయిందో కాని, కటికచీకటి కుంభవృష్టితో పాటు లోకాన్ని ముంచెత్తివేస్తోంది. నెత్తి మీది గంప తన దృష్టికి కొంత అడ్డుతగిలేవరకు, దారి వెతుక్కొంటూ అడుగులో అడుగు పెట్టుకొంటూపోయే పెంచెల్ని, ఒక పెనుగాలి చేతుల్లో ఎత్తుకొని, ఇరవై గజాల దూరంలో ఒక గానుగచెట్టు మొదటిలోకి తీసుకొనిపోయి దింపింది.

నెత్తిమీది గంప పైకెత్తి పక్కగా చూచేసరికి, సమీపంలోనే వున్న దొడ్డి పశువులకొట్టం. తల దాచు కోను రక్ష దొరికినందుకు సంతోషిస్తూ ఆ పశువుల పాకలోకి దుడుంగున దూరింది పెంచెలి; వానజల్లు తగలకుండా ఆ పాకలో ఒకమూల ఒదిగి, చలికి గడగడ వణికే దేహాన్ని కాపాడుకొంటోంది; బయట వానదేవుడూ, వాయుదేవుడూ పంతాలు వేసుకొని ప్రాణికోటులకు తగిలేదీ, తప్పేదీ తెలి యక విచ్చలవిడిగా విహరిస్తున్నారు. తళుక్కుమని మెరు పులు మెరిసినప్పుడల్లా ఆ కొట్టంలో రెండు వరసలుగా కట్టి వేసి, గాటిలో గడ్డి మేస్తూవుండిన ఆబోతులలాంటి పడమ టెద్దులూ, వాటి తెల్లని మూపురాలూ, అందమైన కొమ్ములూ, గాంభీర్యమైన నేత్రాలూ—అన్నీ ఒక్కసారిగా పెంచెలికళ్ళకు గోచరిస్తున్నాయి. ఆ ఆపత్సమయంలో



4

ఆప్రదేశం అంతా నిర్జనప్రదేశంగా ఆమెకు పొడగట్టి నప్పటికీ, రొంబ్బడిలాగ, రొంబ్బడి చేతుల్లో పెరిగే గుర్రం లాగ, బలిష్ఠమై దేహసౌష్ఠవంగల అన్ని వృషభరాజములు ఆమె దండనుండగా చూచుకొనేవరకు, తన ప్రాణానికేమీ భయంలేదని ఆ అబల కొకవిధమైన ధైర్యం కలిగింది. గాలీ, వానా రవంత తెరిపియిస్తే, ఎంతలో పోవాలి ఇంటికి!

తడిసిపోయిన రవికె శరీరాని కంటుకొనిపోయింది. నీళ్లు కారే పైటకొంగు తీసి పిండుకోవడానికి ఒకటి రెండు సార్లు ప్రయత్నించిందిగాని అన్ని ఎద్దుల సమక్షంలో పైట తొలగించుకోనిచ్చింది కాదు ఆమెశీలం.

గాటిలోని ఎండుగడ్డి విదిలించి, వామిలోనుంచి తెచ్చిన జొన్న చొప్ప కట్టల్ని విరిచి ఎద్దులముందు వేసు కొంటూ ఆ చివరనుండి ఈ చివరికి వస్తున్నాడు రాయుడి సేద్యగాడు ముతరాచు సుబ్బడు. ఆ పాకలో మనిషి సంచారం సవ్వడి తెలుసుకొనేవరకు కుదుటబడవలసిన పెంచెలిమనస్సు భీతిచెందింది - ఎందువల్ల? ముతరాచు సుబ్బడివి వేటకుక్క ముక్కులా ఏమిటి? లేకుంటే ఆ గాఢాంధకారంలో పెంచెలి సవ్వడి అతడెట్లా పసికట్టగలిగాడు!

"ఎవరామనిషి?" అని ప్రశ్నించాడు సుబ్బడు. బదులులేదు.

"ఎవరంటే మాట్లాడవేం?" అని సమీపించాడు సుబ్బడు.

“నేను చిన్నాయనా! పెంచెల్ని.”

“ఏ పెంచెలివే?”

“నేనయ్యా, వెంకటిగాడి కూతుర్నయ్యా! గడ్డి అమ్ముకొని వస్తుంటే వానకు తడిసి ఇట్టా వచ్చా” అన్నది పెంచెలి.

“ఎవర్రా ఆ మనిషీ” అని పాక చివరినుండి ఆ చీకట్లో ఇంకో ప్రశ్న బయల్దేరింది.

జవాబు లేదు.

“ఒరే సుబ్బా! ఎవర్రా ఆ మనిషి?” అని మళ్లా వచ్చింది ప్రశ్న.

జవాబు చెప్పకుండానే సుబ్బడు పెంచెల్ని విడిచి ఎద్దుల్లో జొరబడి ఆ చివరికి వెళ్లిపోయాడు.

“ఎవరితోరా నువ్వు మాటాడుతుండేదీ!”

“అదే...”

“అదే అంటే?...”

“అదే నువ్వు కోరుకున్న మనిషే! వెంకటిగాడి కూతురు.”

“పెంచెలే! ఈడ కెందు కొచ్చిందీ?”

“గడ్డి అమ్ముకొని ఇంటికి పోతుండదట! వాన వచ్చే వరకు పాకలోకి దూరింది.”

"ఒరేయ్! సుబ్బా! ఇదేరా సమయం. చిక్కిందిలే! ఇక పోలేములే..."

"........."

"నేను ఈడుండానని దానితో చెప్పకుండా చెయ్యి పట్టుకొని దాన్నిట్లా లాక్కురా!"

"తలా, ఒళ్ళూ, గుడ్డా తడిసి ముద్దయిపోయిందే! అబ్బే! ఈతడవ పోనీ. ఇంకోపాలి పిలుచుకొని వస్తాలే."

"అట్టా కాదురా. చెయ్యిజారితే మనకు చిక్కదురా–నీకు తెలియదు. దానికోసరం ఇప్పటికి ముగ్గురిచేత కబురు చేశాను. అది రానని చెప్పింది. ఈ సమయం పోగొట్టుకొని ఉపయోగం లేదు."

"..........."

"నీకెందుకు, నువ్వు పోయి దాన్నిట్లా లాక్కొని వద్దూ. తరువాత సంగతి నేను సరిపెట్టుకుంటాను."

ఫెళఫెళమని పెద్ద ఉరుము ఉరిమింది. పరధ్యానంలో ఉండిన పెంచెలి జడుసుకొని, మెరుపుతీగలాగే దానిశరీరం కంపించి వంకలు తీసింది. నోటిలోకి తీసుకొన్నగడ్డి నోటిలోనే పెట్టుకొని, నమలడం చాలించి, మెడలెత్తి నిర్ఘాంతపోయి చూస్తున్నాయి ఆ వృషభరాజములు. గాలీ వానా వాటి ఇష్టంవచ్చినట్లు చెలగాటా లాడుతున్నాయి.

"టర్రు"మని ఎద్దుల్ని అదిలించుకొంటూ, దారి తొలిగించుకొని పెంచెలిదగ్గరికి వచ్చాడు సుబ్బడు. ఏదో

సమాధిలో తదేకధ్యానంలో కదలకుండా మెదలకుండా నిలబడే ఉంది పెంచెలి.

"ఏమే" అని పలకరించాడు సుబ్బడు.

"అమ్మో! ఎంత వానో! ఎంత గాలో! ఇదేం ఖర్మ మయ్యా, ఇంటికి పోనిచ్చేటట్టు లేదే, ఈ మాయదారి వాన!" అన్నది పెంచెలి.

"ఇంటికి పోవచ్చుగాని, రాయుడు చెప్పిపంపితే రా నన్నావట! నీ కేమంత పొగరే!" అన్నాడు సుబ్బడు.

జల్లుమని కంపించింది పెంచెలిదేహం! అప్పటికి స్ఫుర ణకు వచ్చింది, తాను దూరిన కొంపం రాయుడిదని. కాని, రాయుడు అప్పుడు అక్కడనే ఉన్నాడని ఆమె కింకా తెలియదు.

"నిన్నే! అడుగుతూంటే పలకవేమే? నీ బతుక్కు అట్టాంటి మారాజు వెయ్యిజన్మా లెత్తినా చిక్కుతాడా? లచ్చనంగా ఇంత బంగారు పెడతాడు. డబ్బా, దస్కమూ ఇస్తాడు! నీ కేమంత గాడా! ఆయన రమ్మంటే రానన్నావుట- ఎందువల్ల?"

"ఊరుకోవయ్యా! సుబ్బయ్యా! ఇట్టాంటి ముచ్చట్లు నాకాడ ఎత్తకయ్యోవు, బాగుండదు!"

"బాగుండక చేదా ఏందే! రాయుడు మోజుపడి, కులమయినా పాటించకుండా అడుగుతుంటే ఎన్నాళ్ళని ఇట్టా

ఎగర్తించి పోగలవే! పిచ్చిపిచ్చి చేష్టాలు చేయవోక. నే తీసుకొనిపోతా రా!''

ఆకాశంలో మేఘాలు ఒరుసుకొన్నట్లే పెంచెలి గుండెలు రాపిళ్లు పడుతున్నాయి. పెంచెలి నోరు విప్పలేదు.

''రా. రాయుడు ఈడనే వుండాడు. రా! ఆయన్ని ఎగర్తించి పోబోక! చెడిపోగలవు'' అన్నాడు సుబ్బడు.

ఆ సమయంలో రాయుడు ఆ కొట్టంలోనే ఉన్నాడన్న సంగతి వినేవరకు పెంచెలికి దడపుట్టింది.

''అమ్మయ్యో! ఈడ కెందు కొస్తినే! పెద్దపులినోట చిక్కితినే దేవుడా'' అని భయపడింది.

''ఇట్టా రా!'' అని దాని చెయ్యి పట్టుకోబోయాడు సుబ్బడు.

గల్లుగల్లుమని దాని బిళ్ళోరి గాజులు పెద్దశబ్దం చేశాయి. అంబా అని ఒక ముసలిఎద్దు అరిచింది.

''సుబ్బా! లాక్కొని రారా, దాని సొయ్య మణచాలి'' అని ఆచివరినుండి గర్జిస్తూనే ఉంది రాయుడుసింహం.

''బాబో, వీళ్లు నన్ను బతకనివ్వ''రని అంటూ కింద పెట్టిన గడ్డిగంప చేతికి తీసుకొని వాకిట్లోకి దూకింది పెంచెలి.

''ఏడకి పోతావే!'' అని మీదికి దూకి గంప పట్టుకొన్నాడు సుబ్బడు.

''పోనియ్యబోకురా'' అని అరుస్తూనే ఉన్నాడు రాయుడు.

"నీ తల బద్దలుకానూ, నీ కేమంత పొయ్యేకాల మయ్యా! సుబ్బయ్యా!" అని పెద్ద అరుపు అరిచి సుబ్బడి చేతిలో గడ్డిగంప విడిచిపెట్టి చీకట్లోకి పారిపోయింది పెంచెలి. దాన్ని వెన్నంటి తరుమబోయిన సుబ్బడు కాలుజారి కింద పడిపోయి, లేచేలోపల పెంచెలిజాడ అయోమయమై పోయింది సుబ్బడికి.

"పోనిచ్చా వేమిరా పెద్దమ్మా?" అన్నాడు రాయుడు.

"దాని కిష్టం లేనిది మనం ఎంత చేస్తేమట్టుకు చిక్కు తుందా ఆడది?"

"ఏడవకపోయినావు! పెద్దమ్మా! – కాదురా; చేతికి చిక్కిన ఆడదాన్ని పట్టుకొని రాలేకపోయినావే – ఏడవనా నువ్వుండి!"

"నన్నేం చెయ్యమన్నావయ్యా; అది తప్పించుకొని పారిపోతేను!"

"అఘోరించావులే. ఇంతట పోగొట్టితే పోగొట్టావు కాని రేపు తెల్లవారి దాన్ని నువ్వు ఖండితంగా అడిగి తెలుసుకో."

"సరే: అట్టనే అడుగుతా లే."

"చూడు: పదిసవరలు బంగారు ఇస్తానని చెప్పు. మంచి పగడాలదండ ఇస్తానని చెప్పు. ఒప్పుకొంటుంది లే; ఇంకా పసిదికాబట్టి జంకుతున్నది."

"అట్టనే" అన్నాడు సుబ్బయ్య.

వాన రవ్వంత తెరపి ఇచ్చినతర్వాత ఇద్దరూ ఇళ్ళకి పోయారు.

పెంచెలి ఎట్లా ఇంటికి ఘటం చేర వేసిందో - తన దేహం తనకి స్మృతి తెలియలేదు. పొద్దుపోయి, గాలీవానాలో పిల్ల ఇంకా ఇంటికి రాలేదని దిగులుపడి ఎదురుచూచే తల్లి దండ్రుల మనస్సుకి ఆమె ఆగమనం స్తిమితం చేకూర్చింది. కాని పెంచెలి మనస్సుకు స్తిమితం చేకూరేది ఎన్నటికి ?

ఇంటికి పోంగనే తడిగుడ్డలు విడిచి, పొడిగుడ్డలు కట్టుకొని, తడిసినతల తుడుచుకొని, తనకు ఆకలి లేదంటూ ఆరాత్రి ఉపవాసంచేసి పండుకొంది పెంచెలి.

పెంచెలి కారాత్రి కంటికి నిద్ర రాలేదు. రాయుడు తన గుండెల్లో పెట్టిన అగ్నికణాన్ని రగుల్కొల్పి పెద్దది చేస్తున్నాడు. చిన్నతనం చపలత్వంచేత తనకు చెప్పి పంపించాడని ఆరంభంలో ఆమె లక్ష్యపెట్టకుండా తోసేసుకొంటూవచ్చింది. కాని చూడగా అతడు పెద్ద ఆలోచన మీదనే ఉన్నట్టుగా ఉన్నాడు. వీలయితే తనను దౌర్జన్యం మీదనైనా లోబరుచుకోవలెననే ప్రయత్నంమీద ఉన్నాడు. లక్షాధికారి! బలవంతుడు! ఆయన అంతరం ఎంత, తన అంతరం ఎంత? ఆ దొరకు తనమీాద ఎందుకీ భ్రమ? ఆనాటిరాత్రి తనరోజు బాగుండి తప్పించుకొని పారిపోగలిగింది కాని, ఆ పెద్దపులిని తప్పించుకొని ఎన్నాళ్లని తా నాగడ్డ మీద తిరగగలదు? ఈ సంగతి రొబ్బడితో చెప్పి, తొంద

రగా పెళ్లిచేసి తీసుకొనిపొమ్మంటేనో! అమ్మో, ఈ విషయం అతని చెవికిపోతే తననుగురించి అత డేమి సందేహిస్తాడో! అసలు తాను నోరు విడిచి ఇట్లా ఇట్లా జరిగిందని అతనితో చెప్పడం ఎట్లా?

పోనీ, తల్లితోగాని, తండ్రితోగాని తన బాధ చెప్పుకొంటే? – చెప్పి ఉపయోగం ఏముందీ, వాళ్లిద్దరి మనస్సుకూ దిగులూ, విచారమూ కొనితెచ్చిపెట్టడంతప్ప? వాళ్ల బ్రతుక్కి వాండ్లు పోయి రాయుడితో తగవులాడగలరా?— ఆమెకు గత్యంతరం తోచలేదు. తా నీవిషయమై నోరు విప్పినట్టయితే నలుగురినోటా పెళ్లికానిపిల్ల తనే రచ్చా రావిడీ అల్లరీ పడేటట్టుగా కనిపించిందికాని ఆస్థితిలో సంభవించిన విపత్తు నెదుర్కొని నిగ్రహించడానికి ఆమెకు గుండెనిబ్బరం చాలలేదు. కడుపులో పెద్ద భయమూ దుఃఖమూ పుట్టుకొని వచ్చినవి. తండ్రికీ తల్లికీ తెలియకుండా ఆరాత్రి తెల్లవార్లూ ఏడుస్తూనే పండుకొన్నది పెంచెలి.

రాయుడికిమాత్రం ఆరాత్రి కంటికి కునుకు ఎట్లా వస్తుందీ? రాత్రి భోజనంచేసుకొని, మిద్దెమీద రెండో అంతస్తుగదిలో పందిరిపట్టెమంచంమీద శయనించినప్పటికీ మాలవాడలో తాటాకుగుడిసెలో నులకకుక్కిమీద పడి పొర్లుతూఉండే పెంచెలిస్థితికంటె హీనంగా ఉన్నది, అతగాడి స్థితి. కళ్లెం తెగిన గుర్రంలాగ, విచ్చలవిడిగా సంచరిస్తోంది అతనిమనస్సు. ఆరునెలలకిందట తన చేలో వరినాటువేతలకి

చూచినపుడు తన హృదయఫలకంమీద హత్తిపోయిన పెంచెలి ముఖబింబం అతన్ని పిశాచంలా పట్టుకొని పీక్కుతింటోంది. మనోగతమైన ఆ బింబాన్ని సాకారంగా హస్తగతం చేసితీరుతానని అతని ధనలక్ష్మి అత డాశ వదలుకొన్నకొద్దీ అభయహస్త మిస్తూనేవుంది అతనికి. తాను కామించింది ఆ స్త్రీ అవయవసౌభాగ్యసంపత్తి కాని, ఆ మాలదాని కులం కాదుగా! తనవల్ల నిత్యమూ ఎన్నో సహాయాలు పొందే ఒక బీద మాలకుటుంబంలో పుట్టిన పిల్ల తనయెడల అంతమాత్రం కృతజ్ఞత చూపలేదూ!

పెంచెల్ని సాధించడం ఎట్లా???

తల పగిలిపోతోంది రాయుడికి.

ఆరాత్రి మాలవాడలోని పెంచెలికీ, మేడమీది రాయుడికీ కాళరాత్రే! గుర్రపు సాలలో చింకిరిచాపమీద శయనించిన రొబ్బడుమాత్రం ఒళ్లెరగడు.

## 3

కాలవైపరీత్యం — బళ్ళు ఓడలూ, ఓడలు బళ్ళూ అవుతూ ఉంటవి! రాయుడి తాత ఉప్పుకావిళ్లు మోసుకొని జీవించేవాడట! అయితేనేం? అది ఎప్పటి సంగతో — పురాతనకాలంనాటి సంగతి. రాయుడి కుటుంబానికి, అతని తండ్రి హయాంలోనే అందుకొన్నది శుక్రమహాదశ! ఆరంభంలో అతగాడు అయిదువందల రూపాయలు అప్పుచేసి,

పూనా, బొంబాయి ప్రాంతాల్లో ఆరంభించిన ముత్యం, పగడాల వ్యాపారం, పాటిగడ్డమీది తోటకూర కాడలాగ రెపరెపలాడుతూ ఎక్కివచ్చి, ప్రాణం హరీ అనేవరకు అతడు లక్షరూపాయల ఆస్తిని గడించి, కొడుకు రాయుడిచేతిలో పెట్టి మరీ చచ్చిపోయాడు. ఇంతకీ అదృష్టమంటే రాయుడిది గాని, నిజంలో అతని తండ్రిది కానే కాదు. తండ్రి సంపాదించి యిచ్చిపోయిన నూరుఎకరాలమీదా ఏటా పండే నూరుపుట్ల ధాన్యమూ, ఇంటిచుట్టూ కూట్లు కట్టించి నిలవచేసుకొని, కోస్తాలో ధాన్యానికి ధర ఎప్పుడు ఉబుకుతుందా అని తపస్సు చేయవలసిన బదనాయంతప్ప, ఇక ఇతరవిధమైన బాధ్యతగాని, చీకుగాని, చింతగాని ఎరగడు ఆ మానవుడు! పుట్టుభోగి; ముప్ఫయ్యేళ్లు నిండని నిండుజవ్వనం! ఏడుకావిళ్ల రూపాయల సంచులతో కాపరానికి వచ్చిన భార్య — పెంచెలికంటెకూడా తనకి పచ్చిపచ్చిగా, వగరువగరుగా ఉంది ఇంకా! అందీ అందనట్లు ఉవ్విళ్లూరించే దోరకాయ— ఆ పెంచెలి తన మనస్సులో విషం కలిపి, ఊఁ, కలచివేస్తోంది.

పెంచెలి తన చెయ్యి జారిపోయిన రాత్రికి అనంతరం వారంరోజుల కొకనాడు సాయంత్రం రాయుడు మిద్దెమీద వసారాలో గచ్చు అరుగుమీద రెడ్డికంవేసుకొని చుట్ట కాల్చుకొంటూ పండుకొన్నాడు. ఆనాటి రాత్రి పశువుల కొఠంలో వ్యవహారం అంతా చెడగొట్టిన చవటపెద్దమ్మ, ముతరాచు సుబ్బడు మిద్దెక్కి,

"దాని కప్పుడే పెళ్ళిమనువుకూడా ఖాయం అయిం దట" అని అన్నాడు.

రాయుడు ఉలిక్కిపడ్డాడు.

"దేనికిరా ?"

"పెంచలికే!"

"ఏ వూళ్ళో ?"

"వాడి స్వంతవూరు పడమట – బద్వేలి! మా ఆడ దాని వూరే వాడిదికూడా. నేను వాణ్ణి బాగా ఎరుగుదును. నేను నగరం సంతకి పోయినప్పుడల్లా వాడు నా కగపడు తూనే వుంటాడు. తమ రెన్నడూ వాణ్ణి చూడలేదూ?"

"ఎవడురా వాడూ ?"

"అదేందిసామీ! పోలీసుసూపరెంటుగుర్రంకాడ ఉంటున్నాడు, నల్లంగా పొడుగ్గా—భారీమనిషి! తమరుకూడా చూసేవుంటారు, గుర్తులేదేమో ?"

"సూపరెంటుగుర్రంకాడ ఉంటాడా? వాడి పేరు ?"

"రొబ్బడు. నెలకి పదిహేనో ఇరవయ్యోకాబోలు వాడికి జీతం! ఇప్పటి కప్పుడే ఏ డెనిమిది నెల్లనుంచీ, వా ళ్ళిద్దరూ పెళ్లిచేసుకోవాలని తీర్మానం చేసుకొన్నారంట! వా డెన్నడూ నాతో అననేలే దీసంగతి; నిన్న తెలిసింది నాకు మాలవాడలో!"

"అట్లానా ?"

"ఈ పిల్ల దినమ్మూ గడ్డిఎత్తుకొని వాడిదగ్గరికి పోయి వస్తూనే ఉంటదంట! వాడేమో సూపరెంటు ఆసరా చూసుకొని, పెళ్లికి గుఱ్ఱమెక్కి ఊళ్ళో ఊరేగాలనికూడా పట్టు పట్టాడనీ, అందుకు మాలవాళ్లుకూడా సరేనన్నారనీ మాలవాడంతా గోలగోలగా ఉండది."

"మనవూళ్ళో మాలవాళ్లు గుఱ్ఱమెక్కి ఉత్సవం చేసుకొనే ఆచారం లేదుకాబోలు కదరా?"

"లేదు-సరే. వాడికి తేరగా గుఱ్ఱం చేతిలో ఉండె. పైగా పోలీసు సూపరెంటు ఆసరా ఒకటి ఉండె. పెద్ద మాలవాడు అంకడూ, పెంచెలిఅబ్బ వెంకటిగాడూ-పెద్ద తలకాయలు, గుఱ్ఱమెక్కి ఊళ్ళోకి వస్తే, తమబోటి గొప్పోళ్లంతా ఏం చేస్తారో అని అజ్జాయిస్తూ ఉన్నారంట! కాని - ఇప్పుడిప్పుడు బయల్దేరుతూ ఉండారే, ముందరిజుట్లు పెట్టుకొనే కుఱ్ఱకారు-వాళ్లుమాత్రం సంబరం చేసుకోవలసిందే అని హఠంపట్టి ఉండారంట."

"అబ్బో! శానాకథ పెరిగిందే!..."

"పాపం! మన సేద్యగాడు రోశిగాడు, ఒకటే గోల, ఈ పెళ్లి ఖాయమైనప్పటినుంచీని..."

"ఎందుకూ?"

"వాడు తల్లీతండ్రీ లేని దిక్కులేని పచ్చి! 'నీకు పిల్లనిచ్చి పెళ్లిచేస్తా'ననీ, 'ఇల్లరికం పెట్టుకొంటా'ననీ చిన్నప్పటి నుంచీ వాడి మేనమామ వెంకటిగాడు ఆశపెట్టి, వాడికి

తమరు ఏటా యిచ్చే జీతంవడ్లు పుట్టీ ఏదుంగింజలూ వెంకటి గాడే కాజేస్తూ, తీరా ఇప్పుడు ఆ పిల్లకి పెళ్లి ఈడు వచ్చే వరకు దాన్ని పరాయిచోట యిచ్చి చేస్తున్నాడని రోశి గాడు ఒకటే గోల... పాపం!''

''అయితే మన రోశిగాడికి, వెంకటిగాడు సయానా మేనమామా?''

''ఓ వేలువిడిచిన మేనమామ కాబోలు! అయితే మట్టుకు, ఇన్నేళ్లుగా ఆశపెట్టి, వాడిచేత అన్నిపనులూ చేయించుకొని, చూడండి, ఇప్పు డెట్లా ఎదురుతిరిగారో వా ళ్లందరూకూడా...''

''అసలు పిల్ల! ఏమంటుంది?''

''అదో మిడిమేలపుపిల్ల! దానికి ఆ పడవటాడిమీదనే మరులు! ఆ గుర్రం, ఆ సంబరం, ఆ ఊరేగడం... ఆ దరువు మీదనే ఉండాదది. ఇట్టాంటి చవటల్ని దగ్గరకి రానిస్తుందా మొదలు?''

''అట్లానా?...''

''ఆ రోశిగాడు - ఒకటే గోల! అందులో ఆ పిల్ల ఎర్రగా పుల్లగా కాస్త కంటికి నదరుగా అగపడే చట్టమైన పిల్లేమో-దాన్ని విడిచిపెట్టుకోవాలంటే, వాడు దిగులుపడి చస్తుండాడు.''

''ఆ వెధవ సంగతి కేంగాని, నువ్వు మళ్లా దాన్ని అడగలేదటరా?''

"అడగకేం! ఈ వారంరోజులుగా అడిగి, అడిగి, ప్రాణం చాలొచ్చింది నాకు. మనం ఒక్కమాట మాట్లాడితే, అది పదిమాటలు చెపుతుంది. అది మనకి అలివిఅయ్యే మనిషి కాదు—"

"............"

"మా దొర నిన్నేం చేయడులేవే! ఒక్కపాలి ఆయన కాడికి వచ్చి, ఒక్కమాట మాటాడిపోదువుగాని రమ్మంటే, రాను పొమ్మని దాని దొకటే పాట! ఇక దాన్నడగడమే నాకు చిన్నతనంగా ఉండాదిసామీ!"

"సరే!" ఇక నువ్వు దానితో ఈ ప్రస్తావన ఏమీ చేయనేవద్దు. పలక్కుండా ఊరుకో!......"

"చిత్తం!......కాని దొరలు ఎట్లనయినా, ఈ పెళ్లి నిలుపుదల అయ్యేటట్టు చేయిస్తిరా, దాని రోగం కుదురుతుంది ; అటుతర్వాత మన చెప్పుకింద తేలయి పడిఉంటది-" అంటూ మిద్దె దిగి వెళ్లిపోయాడు సుబ్బడు.

రాయుడికి మనస్సు స్తిమితం చెడింది : పరిపరివిధాల పోతోంది అతని మనస్సు : అతని నోటిలోని చుట్టచివరి ఎర్రడాలు ప్రస్ఫుటంగా గోచరిస్తోంది. పెంచిలి చెయ్యి జారి పోతోందని అతనికి ఒక విధమైన ఖంగారు పుట్టింది. పోతేపోయింది; తనయెడల అది చూపిన అవిధేయతకు తగిన శాస్తి చేసి విడిచిపెట్టితేనేగాని వీల్లేదని అతనికి క్రోధం ఉద్రేకించింది. తన గ్రామం అంత నిర్భయంగా ప్రవేశించి,

తాను కాంక్షించిన వస్తువును తీసుకొని పోదలచిన ఆ మొనగాడెవరా అని అతనికి ఆలోచన కలిగింది! అతనికి చికాకనిపించి పండుకొన్న మనిషి లేచి వసారాలో ఇటూ అటూ పచారు లారంభించాడు.

రాయుడిది పిన్నవయస్సయినా, పట్టుదలమనిషీ, హంరవాదీని. తనను ఎదిరించిన మనిషిని సాధించి, రాచి రంపాన పెట్టేవరకూ అతగాడికి నిద్రపట్టదు. అతగాడికి ఆ గ్రామంలో ఎదురులేదు. తనంతటి మనిషికి ఒక మాలదానివల్ల పరాభవం కలిగిందే అని అతనికి అరికాలిమంట నెత్తి కెక్కింది. "ఛా! నోరువిడిచి ఎందుకు అడిగాను దాన్ని" అని జుగుప్సపడతాడు......కానీ......చూతాం ......అనుకొన్నాడు. ఈ విషయం మళ్ళా రెండో చెవికి రానేకూడ దనుకొన్నాడు. ఆ రాత్రి తెల్లవార్లూ, తన బుద్ధికి పదును పెట్టి ఆలోచన సాగించాడు. మెదడు వేడెక్కుతోంది. కాని, పద్మవ్యూహానికి పదకం కుదరడం లేదు.

తెల్లవారుజామున కోడికూతవేళకు అతని కొకపదకం కుదిరింది. అప్పటి పరిస్థితుల్లో పనిచేయదగ్గది అదొక్కటే మందు: ఆ గరళం పనిచేస్తే చేసినట్టూ, లేకుంటే లేనట్టూను అనుకొన్నాడు.

ఉదయం నిద్ర లేచీలేవడంతోనే ముతరాచు సుబ్బడికి కబురుచేశాడు. వాడితో ఏదేదో మాటాడి, చివరకు

ఈ విషయంలో తనపేరు బయటికి వస్తే గొంతుకు పిసుకుతా నని చెప్పి వాణ్ణి పంపివేశాడు.

"చిత్తం. ఆపని అంతా నేను చక్కబెట్టుకొని వస్తానుగా – తమరి కాసందేహం ఏమీ పని లేదు." అంటూ వెళ్ళిపోయాడు సుబ్బడు.

తెల్లవారి, ఉదయం నాలుగు ఘడియల పొద్దెక్కిన తర్వాత గ్రామంలో ఇతర పెద్దతలకాయలను — చలమా నాయుణ్ణీ, సభాపతినీ, శింగరశెట్టినీ పిలిపించాడు రాయుడు; వాండ్లతో రహస్యంగా మంతనాలుచేసి గ్రామంలో మాల వాళ్లు కొత్తగా గుర్రాలెక్కి ఉత్సవం చేసుకొంటూఉంటే పెద్దతలకాయలు నలుగురూ ఊరుకొంటారా, మీకు పౌరుషం లేదా, మీకు పరువులేదా అని వాండ్లను చివాట్లు పెట్టి శివమెత్తించాడు. మాలవాళ్లు గనుక గుర్రం ఎక్కి వీధిలోకి వచ్చినట్టయితే, గ్రామంలోని రైతు లందరూ చేరి, తలకాయలు పగలగొట్టడానికి తయారుగా ఉన్నారు కాబట్టి జాగ్రత్త అని మాలవాండ్లకు తెలిసేలాగున ఊళ్ళో పుకారు లేవదీశాడు — తాను తెరచాటునే నిలబడ్డాడు.

## 4

పెంచెలి ఏముహూర్తాన తన వివాహవిషయమై తల పెట్టిందో కాని ఆక్షణంలగాయతు ఆమె కన్నీ కడగళ్లుగానే కన్పట్టుతున్నవి. ఆమెమనస్సు శాంతీ, సంతోషమూ ఎట్లాం

టివో ఎరగదు. గ్రామమూ, మాలవాడాకూడా అట్టుడికి నట్లు ఉడికిపోతున్నది. మాలవాడు గుర్రమెక్కి ఊళ్లో అడుగు పెట్టినట్లయితే ముక్కలు ముక్కలుగా చెండాడుతామని ఊళ్లో రైతులూ, ఏమైనప్పటికీ ఈ పెళ్లికిమాత్రం వెనక్కి జంకకూడదని మాలవాళ్లూ - అప్పుడే రోషాలెక్కి వీరావేశం మీద కత్తులూ, కటార్లూ నూరుతున్నారు. మాలవాడలో పెద్ద తలకాయలు పదిమందీ కలిసి, ఇంతదూరం వ్యవహారం రాకుండానే, నెమ్మదిమీదనే చక్కపెట్టుకొందామని యోచనతో గ్రామంలో ఉత్సవం చేసుకోవడానికి ఉత్తర్వు ఇవ్వవలసిందని గ్రామపెద్దల నందరినీ ఆశ్రయించి అర్థించారు. కాని ఉపయోగం కనిపించలేదు; రాయుడిదగ్గరికి పోయి ఆయనగారి రెండుకాళ్లూ పట్టుకొన్నారు. 'గ్రామంలో ఇతర పెద్దలందరూ ఇష్టపడితే తన ఆక్షేపణ ఏమీ లే'దని మాలలతో బహిరంగంగా తియ్యని మాటలు చెప్పుతూ - గ్రామంలో మాలవాళ్లు కొత్తగా కోరేహక్కును వాళ్లకు ప్రసాదించినందుకు మాల లందరూ కలిసి, ఆ గ్రామ ఉమ్మడి ఖర్చులకుగాను పోగుచేసిన ఫండుకు రు. 300 లు నజరానా చెల్లించినట్లయితే ఈ హక్కు శాశ్వతంగా మాలవాళ్లకి విక్రయంచేయడానికి గ్రామస్థులు సిద్ధంగా ఉన్నారని లోపాయికారీగా రాయుడు మాలలకి కబురుచేయించాడు. కాని వాళ్లదగ్గర అంత శక్తి ఏదీ! మాలవాడలో ఎందరి సంసారాల్లోని కుండబొచ్చెలు పోగుచేస్తే మూడువందల

చిన్నడబ్బులు కాగలవు? ఎన్ని సంసారాలు దిబ్బచేస్తే మూడువందల అణాలు కాగలవు? బాబో! మావల్ల కాదంటే మావల్ల కాదని గుండెలు కొట్టుకొన్నారు మాలలు. అంతగా వ్యవహారం వల్లతప్పి, మెలిబడితే కొండంత ఆసరా సూప రెంటుదొర ఉండనే ఉండాడని వాళ్లు ధైర్యం తెచ్చుకొని కూర్చున్నారు. అయితే అయింది, ఎంతకయినా తెగబడు దామని మాలవాండ్లు నడుముకు ధట్టీలు బిగిస్తున్నారు.

మాలవాడలో జరిగే ఈ గలభాకి పెంచెలి తాళలేక పోయింది. తనమూలాన్ని కొంపలూ కొంపలూ అంటుకొని పోయేటట్లుగా ఆమెకు తోచింది.

"దానింట వానగురిసిన గుర్రం! సంబరంలేకుంటే మానె! ఆయనా నేనూ ఇంత పప్పూకూడూ తిని, కంక ణాలు కట్టుకొని పెళ్లి అయిందనిపించుకొంటే శాన! ఆ రాయుడు నన్నెట్టాగూ బతకనిచ్చేటట్టు లేడు. ఈ రచ్చ అంతా ఆయనగారు లేవదీసిందే! ఆవులూ ఆవులూ కుమ్ముకొని లేగల్ని తన్నినట్లు, ఈ కొట్లాటలో నాపెనిమిటి కేం కీడు చేస్తారో, ఆయనా తల్లీ తండ్రీ లేని దిక్కులేని పచ్చి! నా మీదనే కళ్లు పెట్టుకొని బతుకుతుండాడు! మా ఇద్దరి ప్రాణం సల్లగుంటే ఇంత బొద్దాకూ నీళ్లూ తాగి బతుకుతాం! ఏమైనాసరే, ఈ సంబరం ముగించుకోమని ఆయనకాళ్లు పట్టు కొంటాను. ఒప్పుకొంటాడు లే, నే చెప్పితే వింటాడులే మామ!" అని మధ్యాహ్నం పన్నెండు గంటలకు, ఎర్రటి

ఎండ అని అయినా అనుకోకుండా, బయలుదేరింది రొబ్బడి దగ్గరికి పెంచెలి.

నడినెత్తికి వచ్చి తేరి చూడడానికి వీల్లేకుండా నిప్పులు కక్కుతున్నాడు ప్రచండభాస్కరుడు. ఎండ తగలకుండా నెత్తిమీద కొంగు ముసుగుకప్పింది పెంచెలి; గుర్రాన్ని గనక ఊళ్ళోకి తీసుకొనిరాకుంటే ఇక తన పెళ్లి కేమీ కష్టాలు లేవని స్తిమితపడింది; గుర్రాన్ని తీసుకొనిరాకుండా పెళ్లికొడుకు రొబ్బణ్ణే ఒప్పించినట్లయితే తన కే బాధా ఉండదని ఆశించింది. వీధివాకిలి లోపలికి నెట్టి గుర్రపుసాలలోకి పోయింది పెంచెలి.

మంచి నడిజాము పొద్దు. ప్రజలు భోజనాలు చేసే సమయం, భోజనానంతరం విశ్రాంతి తీసుకొనే సమయమూను. రొబ్బడు ఆపూట అన్నం తిన్నాడో లేదో, గుర్రపుసాలలో చాపమీద ముసుగుతన్ని పండుకొని గాఢనిద్రలో ఉన్నాడు. గుర్రంకూడా వాడివైపు చూస్తూ ఏదో విచారాన్ని సూచిస్తూ ముడుచుకొనిపోయి నిలబడి ఉన్నది. అంత గాఢ నిద్రావస్థలో ఉండిన తన ప్రియుణ్ణి లేవగొట్టనా వద్దా అని సందేహించింది పెంచెలి; కాని ఆమె తన మనస్సులోని ఆత్రం అరికట్టలేకపోయింది. ఎర్రటి ఎండలో పేరెంమీద వచ్చిన వగర్పుతోనే—

"మామా! మామా!" అని అతని పక్కనే కూర్చొని తలమీద ముసుగుతీసి రొబ్బణ్ణి నిద్ర లేపింది. ఉలిక్కిపడి నిద్రలేచాడు రొబ్బడు. ఎర్రటి చింతనిప్పుకణాల

లాగ ముఖంలోకి ఉబికి నెత్తురు కక్కుతున్నాయి అతగాడి నేత్రాలు. పెంచెలికే ఆ ముఖతీక్షణం భయంకరమయింది. నిద్రలో లేచినందువల్ల ఆవిధంగా ఉన్నా డనుకొన్నది పెంచెలి.

"మామా! మామా! మనకు కాగుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు మామా!"

"నా కా గుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు, ఆ పెళ్లీ వద్దు" అన్నాడు రొబ్బడు.

ఉలిక్కిపడింది పెంచెలి.

"మామా! నిద్రకళ్ల నేందీ ఆ మాటలు! శుభమల్లే పె ళ్లెందుకు వద్దు?"

"సంబర మెందుకు వద్దు?"

"మాలాడు గుర్రమెక్కి వూళ్లో సంబరం చేసుకొంటే, తలకాయ పగులగొట్టుతామని ఊళ్లో పెద్ద ఆసాములందరూ కత్తికట్టి ఉండారు."

"మిండగాళ్లని మరిగిన లంజ, నన్ను మోసంమీద పెళ్లిచేసుకోవాలని వస్తే తలకాయ పగలగొట్టాలని కర్ర చేతపట్టి ఉండాడు ఈ రొబ్బడు."

"ఏంది మామా! ఈ మాటలూ?"

"ఏందే లంజా! ఈ తప్పుడు చేష్టలూ!" అని లేచి పెంచెలి కుడిప్రక్కన ఒక్క తన్ను తన్నాడు రొబ్బడు. పెంచెలి కేమీ అర్థంకాలే దీ వైఖరి. నిర్ఘాంతపోతోంది;

అతన్ని అడుగుదామని అనుకొంటుంది- కాని నోరు విడి బడడం లేదు. ఇంతలోనే రొబ్బడు దాని జుట్టు పట్టుకొని "ఊళ్ళో వాళ్ళనందరినీ మరిగి నన్ను పెళ్ళాడాలని తయా రవుతావా!" అని దానితల కిందికి వంచి, వీపుమీద పిడి గుద్దులు కురిపించాడు.

'బాబోయి, బాబోయి' అని అరవడానికికూడా నోరు రాలేదా పడుచుకి! అతని వైఖరి కాశ్చర్యపోవడంతప్ప దుఃఖించడం చేతకాలేదా అబలకి. ముఖంమీద విడిబడ్డ కురులు సవరించుకొనేలోపలనే ఎప్పుడు తెచ్చాడో పది చారల జనపనారపగ్గం ఒకటి తెచ్చి పెంచెలి రెండుచేతులూ వెనక్కి విరిచికట్టి ఆమెను బరబర లాక్కొనిపోయి గుంజకు కట్టివేశాడు రొబ్బడు. నోరు విప్పలేదు ఆ భూదేవి! కళ్ళు చారెడు చేసుకొని అతని ముఖంలోకి చూస్తూ నిలబడింది కొయ్యలాగ!

గుర్రాన్నితోలే కంచీ చేత తీసుకొని ఎదురుగా నిలబడ్డాడు ఆమె ప్రేమ చూరగొన్న ప్రియుడు.

"నిజం చెప్పుతావా చెప్పవా!"

ఆమె పెదిమెలు కంపించాయి.

"నువ్వు నీ మేనత్తకొడుకు రోశిగాణ్ణి పెట్టుకొన్నావా లేదా?"

"రామ! రామ!" అంది ఆమె హీనస్వరంతో.

"ఏడే నీ రాముడు?" అని అతడు ఉచ్చరించేలోపలనే ఆమె దేహంమీద కంచీ ఛెళ్లుమని పలికింది.

"మామా!......" అని మాత్రమే అనగలిగింది ఆ శీలవతి.

"ఆనాడు నువ్వు నాకాడనుంచి పోయినప్పొద్దు మీ వూరు కాపు రాయుడి పశువులకొఠంలో దూరావా?"

"దూరాను" అని సత్యవాణి పలికింది.

"ఎందుకు దూరావు?"

"వానజల్లుకి భయపడి."

"రంకుతనం అంటే భయంలేనిదానికి నీకు వాన జల్లంటే భయమా?" అని తీవ్రంగా హెచ్చరించింది కంచీ!

"మామా..."

"ఆ పాకలో ఏమి జరిగిందో నిజం చెప్పు"

పెంచెలి ముఖంలో మిడిగ్రుడ్లే అతనికి జవాబిచ్చాయి.

"పలకవేం?"—అని కంచీ ఆడించాడు రొబ్బడు.

ఆ కంచీ చేసే ధ్వనికి, దాని రుచి తెలిసిన ఆ గుర్రం భయపడి, బెదిరి కలగదొక్కుకొంటోంది.

పెంచెలి గొంతెండిపోయింది ; గుటక పడడంలేదు. కళ్లు చీకట్లుకమ్ముతున్నాయి ; కాని రెప్పలాడడంలేదు. నిజం చెప్పుతావా చెప్పవా అని రొబ్బడి చేతిలోని కంచీ యింకా సత్యాన్వేషణకొరకు పెంచెలి రక్తాన్నికూడా పరిశీలిస్తోంది.

''మామా—''అని నోరారా పిలవాలని ఆమె కోరిక. తన ప్రియుని కరువుతీరా కౌగిలించుకోవాలని ఆమెఉబలాటం! తనమీద ఎంత ప్రేమా, ఎంత విశ్వాసమూ లేనిదీ ఆ అమాయకుడికి, లోకం చెప్పిన చెప్పుడు మాటలమీద అంత ఆగ్రహం వస్తుందా అని ఆమెభావన. ప్రేమసూచకములా?- ఆ కంచీదెబ్బలకు ఆమె శరీరం ఉప్పొంగిపోతోంది — కాని ఆ అపూర్వమైన అనుభవంలో ఆమె బదులుచెప్పలేక నిశ్చేష్టయై తన్ను కట్టివేసిన కొయ్యగుంజలాగే కొయ్యలా నిలబడి ఉన్నది పెంచెలి.

మానం అర్ధాంగీకారసూచకమా? తన ప్రశ్నకు జవాబు చెప్పకుండా, చేసిన తప్పు ఒప్పుకొంటోంది! అనుకొన్నాడు రొబ్బడు. వాడి కసి తీరడంలేదు. తానింకా పెండ్లాడని పిల్లే, ఆ పిల్లమీద తానంత తీవ్రమైన అధికారం చెలాయించవచ్చునా అనే యోచన మనస్సుకు తట్టలేదు ఆ పెళ్ళికొడుక్కి. ఒక సంవత్సరంగా తనతో కపటస్నేహం చేసి మోసగించిందని అతనికి శరీరం భగ్గున మంటలెత్తిపోతోంది! అందులో పోలీసు సూపరెంటు దొరదగ్గర నౌకరీ చేస్తుండే మనిషి తాను. అతనికి వీరావేశం విజృంభించడానికి ఇంకా ధూపం ఎందుకూ!

పెంచెలికి కట్టిన కట్లు విప్పాడు! ఆమెదేహం అప్రయత్నంగా అతని పాదాలమీద పడిపోయింది — కాని, ఆ క్రోధమూర్తికి జాలి ఏదీ?

"చావు లంజా!" అని తన శక్తికొద్దీ దాని వీపు మీద ఒక్క పిడిగ్రుద్దు గుద్దాడు రొబ్బడు. తన కనుగ్రుడ్డు లోని ఎరుపురంగుతో దీటయిన రక్తం ఆమెనోట బళ్లున ఒక గ్రుక్కెడు కక్కుకొనేటప్పటికి అతనికి ఈప్రపంచం తెలిసింది.

"ఓసీ! ఇంత మోసమా! చెప్పకో, నీదిక్కున్న చోట చెప్పకో! నా కా పెళ్లీ వద్దు, ఆ గుర్రమూ వద్దు, ఆ సంబరమూ వద్దు. ఈ సూప రెంటుదగ్గర నా కీ నౌకరీకూడా పనిలేదు. ఇప్పుడే లేచిపోతాను మావూరికి" అని పైమీద గుడ్డవేసుకొని నోటివెంట నురుగులుకక్కుకొంటూ ఆక్షణమే లేచి చక్కాపోయాడు రొబ్బడు.

సాయంత్రం అయిదుగంట లయింది. అప్పటికి చల్ల బడింది ప్రచండసూర్యబింబం. పెంచెలికి స్పృహ కలిగింది. లేచి కూర్చుంది. నలువైపులా చూచుకొంది! తాను ఏకాకిగా ఉన్న దా ఆవరణలో. ఒడలూ, గుడ్డలూ చూచుకొంది. నెత్తురుమరకలు ఆమెగుండె చెదరగొట్టాయి. ఆమె లేచి నిలబడింది. రెండుచేతులూ ఎత్తి గుర్రానికి దణ్ణం పెట్టింది. పెద్దనవ్వు నవ్వింది...మామా...మామా...అని పిలిచింది. పెద్ద ఏడుపు ఏడిచింది. సూర్యాస్తమయం కాబోతోంది. పెంచెలి వీధిలోకి పోయింది.

విరబోసుకొన్న జుట్టు, చిరిగిపోయిన రవిక, గాట్లుపడ్డ దేహం! బూడిదలో పొర్లాడిన నెత్తురుమరకల చీర! వికృతాకారం! వికటాట్టహాసం! వెర్రిచూపులు! కారణంలేని

ఏడుపు - ఆహా! ఇక మూడురోజులకు మెడలో మంగళ సూత్రధారణ చేయించుకోవలసిన పెండ్లికూతురా ఆ అవతారం!

వీధిలో తిరిగే కుక్కలు మొర్రో అని ఆమె వెంట బడ్డాయి. తనని కరవమని వాటి నోటికి తన చేతు లందిస్తుంది - పెంచెలి. వీధుల్లో ఆడుకొనేపిల్లలు చిన్న చిన్న రాళ్లు తీసి ఆమెమీద రువ్వుతూ దూరంగా పోయి కేకలు పెట్టు తున్నారు. తన తల పగలగొట్టుమని పెద్ద పెద్ద బండలు తీసి ఆ పిల్లల కివ్వబోతుంది; వచ్చే పోయే మోటారుకార్ల కిందా, బండ్ల క్రిందా పడిపోవాలని రోడ్డులో వంకర వంకరగా నడు స్తుంది. కాని అవి అన్నీ ఆమెను తప్పించుకొని పోతున్నాయి.

సంజచీకట్లు విరిశాయి. పెంచెలి వికృతాకారం మరీ భయంకరమయింది. ఆమె ఇంకా పోతూనే ఉంది. తన వూరికి పొయ్యే దారిలో రాయుడి పశువులకొట్టం దగ్గరికి వచ్చింది. పెద్ద నవ్వు నవ్వింది. పిచ్చిపాట పాడింది. ఆ కొట్టం చుట్టూ తిరిగింది. కానుగచెట్టు కిందికి పోయింది. మామా అని దాన్ని గట్టిగా కౌగిలించుకొంది. కళ్లు మూసుకొంది. పెద్దంగా ఏడిచింది. 'మామా, రా' అంటుంది. 'నేనూ వస్తా' అంటుంది. ఇటూ అటూ పరువులెత్తింది. ఇటూ అటూ రెండు మాలగద్దలు పశువులకొట్టంమీద వాలాయి. వాటిని చూసింది. పెద్ద వెకిలినవ్వు నవ్వింది; 'మామా' అంటూ కింద తూలిపడిపోయింది.

---

# కయ్యా - కాలవ

లక్ష్మమ్మ గొప్ప అదృష్టజాతకురాలు. పాకనాటి కాపుకులంలో పుట్టింది. మళ్ళా అపర మహాలక్ష్మి. పూర్వ జన్మంలో ఇంత పెట్టిపుట్టిందేమో, ఈ జన్మంలో భోగం అనుభవిస్తోంది.

లక్ష్మమ్మ పుట్టింటివారిది చాలా గట్టిసంసారం. మొగ పిల్లకాయలు లేనందువల్ల లక్ష్మమ్మకూ, ఆవిడ అక్కకూ ఒకవూళ్ళోనే మనువులు కుదిర్చి తండ్రి ఇద్దరికీ చెరి ముప్ఫయి వేల రూపాయల ఆస్తి ఇచ్చి మహావైభవంతో వివాహం చేసి, వాళ్ళను కాపరానికి పంపేడు. కాని కాపరానికి వెళ్ళిన మరుసటిసంవత్సరమే లక్ష్మమ్మభర్త కాలం చేసినందు వల్ల అప్పటినుంచీ ఇప్పటివరకూ ఆవిడ నిరంకుశమైన వైధ వ్యాన్ని అవిచ్ఛిన్నంగా పరిపాలిస్తోంది. ఇదొక్కటే ఆవిడకు కొఱత పెట్టాడు భగవంతుడు. ఇదిమినహా ఆవిడ సంసారానికి ఏమీ కొఱత లేదు.

అటు పుట్టింటివారివల్ల దఖలుపడ్డ ముప్ఫయివేల రూపాయల ఆస్తీ, యిటు అత్తింటివారివల్ల లభ్యపడ్డ ఏభై వేలరూపాయల ఆస్తీ కలిసి, భర్త చనిపోయేటప్పటికి ఓ 80, 90 వేల రూపాయల ఆస్తికి లక్ష్మమ్మ హక్కుదా రయింది. చనిపోయేముందు మంచంమీద ఇంకా తెలి వుండగానే భర్త సిస్సలైన వీలునామా వ్రాసి ఏభై ఎకరాల

మాగాణీ, డెభ్భై ఎకరాల మెట్టా, మామిడితోటా, నాలు గెకరాల పాటిమట్టిదొడ్డీ, పశువులబీళ్ళూ, పదిఅంకణాల మిద్దీ, ఇన్ని పాడిపశువులూ, నాలుగువందల సన్నజీవాలూ ఒకటేమిటి, ఒకరిదగ్గరకు పోనక్కరలేకుండా అమర్చిపెట్టి నట్టు ఇనప్పెట్టి బీగాలతోసహా చేతిలోపెట్టి, "నేను లేనన్న కొరతతప్ప యిక నీ కేమీ లోపంలేదు. ఇంట్లోతల అట్లా వీధిలో పెట్టుకోకుండా ఈ యావదాస్తీ నువ్వు అనుభవించు కొని జీవించు" అని అంత్యకాలాన ఆశీర్వదిస్తూ ఆవిడభర్త అదృశ్యమైనాడు.

లక్ష్మమ్మది మొదటినుంచీ గట్టిపిడికిలి. పొలంలో పండిన అరవైపుట్ల ధాన్యంలగాయతు దొడ్లో పశువులువేసే పేడవరకూ సమస్తమూ ఆమె రొఖురూపంగా మార్చి వృద్ధి చేసిన సంసారం అది. రాగులు, సజ్జలు, జొన్నలు, మిరప కాయలు, చింతపండు, మామిడికాయలు, టెంకాయలు, టెంకాయపీచు, తాటికాయలు, తాటాకు, తాటిబుర్రలు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి-ఒకటేమిటి, పాటిమట్టి, ఎరువుమట్టి, దూడాదుడుకూ సమస్తమూ రొఖంగా మార్చి చేతపట్టుకొనే అలవాటు లక్ష్మమ్మకు. అందువల్ల భూములు, దొడ్లు, బంగారునగలు, వెండిసామానులు వగైరాల అడు మానంమీద ఇచ్చిన అప్పు పత్రాలమీదా, ప్రోనోట్లు మీదా సాలీనా వచ్చే నాలుగువేల రూపాయల నికరంవడ్డీకి తోడు, ఈవిధంగాకూడా ఎట్లా లేదన్నా సంవత్సరానికి ఇంకా

5, 6 వేల రూపాయల ఖుట్టి ఆదాయం చేరుస్తూ ఆమె ఈ ముప్ఫై ఏళ్ళుగా తన ఆస్తిని రెండులక్షలకుపైగా పెంచింది.

లక్ష్మమ్మ తోడపుట్టినపడుచు కాపరం అంత నాదారు స్థితి కాదుకాని లక్ష్మమ్మస్థితితో పోల్చుకుంటే వాళ్ళస్థితి ధూపానికి ఆగదు. అయినప్పటికీ ఆవిడఅక్కకి ఒక కొడుకూ, ఒక కూతురూ కలిగి యింత సిరీసంపదతోనే కాలక్షేపం చేస్తున్నారు వాళ్ళు. లక్ష్మమ్మ అక్క-కొడుకు రామిరెడ్డికి ఇప్పుడు ముప్ఫయిసంవత్సరాల వయస్సు వచ్చి పెళ్లి చేసుకుని తన ఇల్లు తాను చక్కపెట్టుకొంటున్నాడు. లక్ష్మమ్మకు 'నా' అన్నవాళ్లు ఎవరూ లేనందున, తన సేద్యం మంచి సెబ్బరలు విచారించడానికీ, ఇంట్లో తన కింత లెఖ్ఖాడొక్కా వ్రాయడానికీ రామిరెడ్డి కాస్త చేతి కందివచ్చినప్పటినుంచీ లక్ష్మమ్మ అతగాడినే రప్పించుకొని తన పనులు నెరవేర్చుకొంటూ వుంది. మొగదిక్కులేని సంసారం అయినందువల్లా, ఈ తనువులు శాశ్వతం గానందువల్లా, తలలో నాలుకలా నమ్మకంతో అంటిపెట్టుకొనివుంటే లక్ష్మమ్మ ఎప్పటికైనా తన యావదాస్తినీ అక్కచెల్లెం డ్రిద్దరి సంసారాలకీ ఒక్కడే మొగపురుగు అయిన తనకు సంక్రమింపజేయకపోతుందా అని రామిరెడ్డి కొండంత ఆశ పెట్టుకొనిఉన్నాడు. అందువల్ల లక్ష్మమ్మకు చీమకాటంత బాధ కలిగిందంటే తనకు లోకమే మునిగిపోయినట్లుగా భావించుకొని, గుండెలు గవ్వుకొంటూ

పరుగెత్తి ముందు తన పినతల్లికి సేవచేసి ఆవిడ మెప్పు పొందుతూ వస్తున్నాడు రామిరెడ్డి.

లక్ష్మమ్మకు ఇప్పుడు ఏభై యోపడి దాటి అరవైలో పడింది. రామిరెడ్డికి నోరు ఊటలూరుతోంది; లొట్టలు వేస్తున్నాడు; సమయంకొరకు కాచుకొని బక ధ్యానం చేస్తూ ఉన్నాడు రామిరెడ్డి.

## 2

కొండడు మాలవాడు. అనగా పంచముడు. పోనీ, హరిజనుడనే అందాం. గోచీపెట్టుకొనే ఈడులో కొండడు లక్ష్మమ్మకాడనే బర్రెగొడ్లు కాస్తూవచ్చినప్పటికీ వాడికి ఈడు వచ్చి పెళ్లిచేసుకొని, భార్య కాపరానికి వచ్చినతర్వాత, వాడు లక్ష్మమ్మను వదలి యిప్పటికి పదేళ్ళుగా తన రెక్కల మీదనే ఆధారపడి, యింట్లో భార్యనీ, డెబ్భైఏళ్ల ముసలి తొక్కు తల్లి వెంకినీ పోషించుకొంటున్నాడు.

ఏ ఆసామినో ఆశ్రయించుకొని, ఎవరి కమతంలోనో అంటిపెట్టుకొని, సంవత్సరం జీతంమీద కాలం గడుపు కొంటూవుంటే తీరేపోను కొండడికి. కాని మున్నూట అరవై నాలుగురోజులూ రాత్రింబగళ్లు చెమట ఊడ్చి చాకరీ చేసినప్పటికీ, సంవత్సరానికి ఏ పందుం, పన్నిద్దుం గింజలోకాని,

జీతంరాలని నౌకరీ అవడంవల్ల కడుపునిండక సంసారాన్ని పోషించుకోలేక వెతలుపడుతున్నాడు కొండడు.

అదీగాక ఈ ఆసాములతో అన్నీ ఇక్కట్లే. జీతగాడు వచ్చి పనిచేసినరోజులకు రోజు ఒకటింటికి ముంతెడుగింజల చొప్పున కూలి ఇచ్చి, వాడి కెప్పుడైనా ఏ కడుపునొప్పో, కాలునొప్పో వచ్చి నౌకరీకి రాలేక నిలిచిపోయినరోజులకు రోజు ఒకటింటికి రెండుముంతలచొప్పున వాడిదగ్గర తిరిగీ ముజరాలు తీసుకొంటారు. ఇదేమి న్యాయమో! ఆసాములు జీతగాళ్లకూ, కూలివాళ్లకూ తమ గింజలు కొలిచే ముంత వేరూ, జీతగాళ్లదగ్గరనుంచి ఆసాములు ముజరా తీసుకొనేటప్పుడు కొలిచే ముంత వేరూ! మొదటిముంత చిన్నదీ, రెండో ముంత పెద్దదీని. ఇట్లాంటి దుర్భరమైన పరిస్థితుల్లో ఎన్నాళ్లు బ్రతకగలడు కొండడు?

ఈ కష్టాలు పడలేక—ఆ వూళ్లో మాలమాదిగలకు పది కుటుంబాలవాళ్లకూ సర్కారువారు ఈ సందుకట్ల కొన్ని బీడుభూములు సాగుబడి చేసుకొనేటందుకు పట్టాలకు ఇస్తున్నారంటే, కొండడుకూడా తాశీలుదారుగారిదగ్గర ఓ అర్జీ గీకించి దాఖలుచేశాడు. కొండడికిగాని, వాడి అవిభక్త కుటుంబంలో మరిమెవ్వరికిగాని, అంతకుపూర్వం ఎన్నడూ సర్కారు భూములు పట్టాకు ఇచ్చివుండకపోవడంచేత ఇతరులతోపాటు వీడికిగూడా, ఒక ఏభై సెంట్ల (అరఎకరా) భూమి ఎకరా మూడువందల రూపాయలచొప్పున ఖరీదు వేసి, అరెకర మూ

నూటయాభై రూపాయలకు సర్కారువారు కొండడికి పట్టా కిచ్చారు. ఇంతా చేస్తే చచ్చినంత మరమ్మతు చేస్తేనేగాని సాగుబడికి లాయఖుకాని భూమి అది; మనిషెత్తున తుంగ బలిసిపోయి అడవున్నట్టుంది. నీళ్ళకు మిట్టప్రదేశం. అర గజం గడ్డతీరు తీయిస్తేనేగాని కయ్యలోకి చుక్క ఎక్కదు. నీళ్లు పారించుకోనేటందుకు ఆ కయ్యకు ప్రత్యేకం కాలవ లేదు. సర్కారువారు విధించిన క్రయం నూటయేభైరూపాయలూ ఖజానాలో జమకట్టంగనే, సర్కారువారు కొండడి చేతిలో పట్టాకాగితంమాత్రం పెట్టి, నలుగురితోపాటు, వాడికిగూడా 'యిదిగో ఇదీ నీ భూమి' అని ఆ కయ్యకు హద్దులు చూపించి చక్కా పోయారు.

సెంటుకు కనీసం ఒకరూపాయిచొప్పున ఏభైసెంట్లకు ఏభై రూపాయలు ఖర్చుపెట్టితేనేగాని కయ్య మరమ్మత్తు కాదు. తుంగా దుడుసూ కొట్టించడానికే యిద్దుమో, ముత్తుమో కావలసిఉండె. ఏరోజు కారోజు రెక్కాడితేనే కాని డొక్కాడకపోయె ఇంట్లో కొండడికి! ఈ జన్మలో తన పేరిట వో యెకరాభూమి ఏర్పడితే తన జన్మ తరించి కష్టాలు గట్టెక్కుతాయనే ఆశపడ్డాడు. కాని తీరా భూమి దఖలు పడినతర్వాత ఆ కయ్యను సాగుబడి చేసుకోవాలంటే తన శక్తి కణకువైన పనిలా తోచలేదు కొండడికి. ఇప్పటికి చేసిన అప్పు తలుచుకొంటేనే వాడికి శరీరం నీరయిపోతోంది. భూమిదగ్గరకు వచ్చి చూచుకొంటే దిక్కుతోచడంలేదు.

భూమి సాగుబడి చేసుకోవడమూ, లేక అంతటితో దాన్ని విరమించుకొని మళ్లా మామూలుప్రకారం ఏ అయ్యకాడనో జీతానికి కుదరడమూ? ఈ రెంటిసందునా పడి నలిగిపోతున్నాడు కొండడు. "అయిందేదో అయిపోయింది. మన కీజన్మలో స్వంతకయ్యనీ, స్వంతసేద్యమనీ, స్వంతెద్దులనీ అనుకొనే ప్రాప్తం లేదు. ఇంతటితో ఈ కయ్యను పోకడ పెడుదా" మనుకొని నిస్పృహచెంది పట్టావచ్చిన మరుసటినెలలోనే యితరులకు అమ్మకం చూపేడు.

కొండడికి పట్టాకిచ్చిన కయ్య లక్ష్మమ్మ స్వంతపట్టా భూమి నూరెకరాల ఏకఖండంగల నట్టుకు దక్షిణపుతట్టున అనుకొని ఉన్నది. కయ్యసందునా, లక్ష్మమ్మ భూమిసందునా గనిమె తీస్తే, అలాగ్గా కయ్య ఆవిడఖండంలో కలిసిపోతుంది. ఆ కయ్యకోసరం ముప్ఫయ్యేళ్ళకు పూర్వం లక్ష్మమ్మభర్త రివిన్యూ అధికార్లకూ, డి.పి.డబ్ల్యూ. అధికార్లకూ లంచాల క్రింద ముప్ఫై నలభైరూపాయలు ఖర్చుపెట్టీకూడా ఆ భూమి పట్టా కివ్వడం ఆక్షేపణకరమని అప్పట్లో సర్కారువారు తీర్మానించడంవల్ల విఫలమనోరథు డయినాడట! అది లగాయతు భర్త చనిపోయినతర్వాతకూడా ఆశపడ్డ కయ్య చివరకు లభించకపోవడమేగాక దానికొరకు లంచాలుగా పోసిన నలభైరూపాయలూ నష్టేట కలిసిపోయెనే అని లక్ష్మమ్మ అప్పటికీ ఇప్పటికీ ఆ విషయం తల్చుకొని కుళ్లిపోతూవుంటుంది. ఎట్లాగైనా కయ్యలో కయ్యను కలుపుకో

వాలని ఆవిడకూడా ఒకటి రెండుసార్లు ప్రయత్నించిందిగాని ఆవిడప్రయత్నం కొనసాగలేదు. అందువల్ల ఆ కయ్యను లక్షాధికారైన తాను కోరినపుడు పట్టాకు ఇవ్వకుండా ఇప్పుడు ఒక మాలవాడికి పట్టా కిచ్చారనేసరికి లక్ష్మమ్మకు ఆపాదమస్తకమూ తేళ్ళూ జెర్రెలూ పాకినట్లయిపోయింది. తన కయ్యక్రింద మాలవాడు ప్రవేశించాడని విన్నప్పటినుంచీ ఆమె అన్నం తినక మంచం పట్టింది. రాత్రింబగళ్లూ వాణ్ని దుమ్మెత్తిపోస్తోంది. వాడివంశం నాశనంకావాలని శాపనార్థాలు పాడుతోంది.

కొండడికి చేతిలో దమ్మిడీలేక ఒక్క దున్నపోతు కాని, ఒక్క అరకకొయ్య కాని లేక రెండువందల రూపాయలతో తెచ్చుకొన్న కయ్యను సాగుబడిచేసుకొనే దారీ తెన్నూ కనబడక దిగులుపడి ఉక్కిరిబిక్కిరయి వాడు తన్నుకులాడుకొంటూఉంటే, తన భూమిలో కలిసే కయ్యను తాను ఇంత ప్రయత్నించినా తెచ్చుకోలేక ఆఖరుకు తన కళ్లఎదుట ఒక హీనజాతి మాలవాడు తన్నుకుపోతున్నాడే, ఎట్లాగబ్బా జీవించేదని యింట్లో లక్ష్మమ్మ మరణవేదన పడుతోంది.

అట్టి సమయంలో కొండడు ఆ భూమి అమ్మకం చూపాడని వినీవినటంతోనే లక్ష్మమ్మ ప్రాణాలు లేచివచ్చినట్లుగా సంతోషించి రామిరెడ్డిచేత మాలవాడికి కబురు చేసింది, బేరమాడింది. తాను ఖర్చుపెట్టిన రూపాయలు తన కిచ్చివేస్తే ఆ క్షణంలో భూమిని వదులుకొంటానని

కొండడు జవాబుచెప్పేడు. వాడా మాటలు అనేసరికి లక్ష్మమ్మ గుండెలుబాదుకొని—

అమ్మయ్యో! నీ కెంత దురాశ పుట్టిందిరా మాల ముండాకొడకా! బ్రతకడానికా నాశనం కావడానికా ఇట్లాంటి దుర్బుద్ధులు నీకు? ఈ కయ్యకుగాను నా మగడు ముప్ఫైఏళ్లనాడు దూటబిళ్లల్లాగ, నలభైరూపాయలు ఆ సర్కారువారి మొదాన్ని కొట్టినాడు. ఈ ముప్ఫైఏళ్లుగా నలభైరూపాయలకూ వడ్డీ కట్టుకొంటే నూరు రూపాయ లయింది. ఈ నష్టం నీ తాత ఇస్తాడనుకొన్నావా? నీ ముత్తాత ఇస్తాడనుకొన్నావా? దురాశలకు పోబోకు, దుఃఖానికి చేటు. ఎట్లాగా ఆ కయ్య నీవు మరమ్మతు చేసుకోలేవు. మర మ్మతుకుగాను నే నింకా ఏభై రూపాయలు ఖర్చు చెయ్యాలి సుంది. అప్పటికి నాకు నూటయేభయిరూపాయ లవుతుంది. తెలిసిందా? నీవు ఈ సందునా ఆ సందునా కచ్చేరిచుట్టు తిరిగి డబ్బు ఖర్చుపెట్టావు కాబట్టి అందుకు భత్యాఖర్చులక్రింద పదిరూపాయ లిస్తాను. ఆ కయ్య నాపేర విక్రయించి పారెయ్యి'' అన్నది.

''అమ్మయ్యో! నీ కెంత దురాశ పుట్టిందమ్మా'' అని కొండడుకూడా గుండెలు బాదుకొంటూ వెళ్లిపోయాడు.

## 3

తాను రెండువందలు పెట్టి కొన్నకయ్యను పది రూపాయల కిమ్మని లక్ష్మమ్మచేసిన బేరాన్ని తలుచుకొనే

వరకు కొండడికి అదివరకున్న నిరాశా, నిస్పృహా వదిలి ఎట్లాగైనా సాధించి కయ్యను నిలబెట్టుకొని సాగుబడి చేసుకోవాలన్న పౌరుషం పుట్టుకొనివచ్చింది. దేవుడిమీాదే భారంవేసి కొండడు ఊళ్లోకి చక్కా వెళ్లాడు; మొదటి మా రాజునే మళ్ళా బ్రతిమలాడుకొని, ఇంకో యాభై రూపాయలకు ప్రోనోటు వ్రాశాడు. ఆపైకంతో భూమి మరమ్మత్తు చేసి ఆ సంవత్సరం శ్రావణమాసం రాగానే వరినాటు వేశాడు. ఇరవై ముప్ఫైయేళ్లుగా బీడుగా ఉన్న భూమేమో-ఆ సంవత్సరం కాలం సక్రమంగా రావడంచేత నారు గుచ్చి గుచ్చంగనే, కర్రలు నలుపుతిరిగి గంటలు కట్టి పైరు నవనవలాడుతూ ఎక్కివచ్చి, అరెకరా కయ్యా ఒక పుట్టెడు గింజల దాకా చితకపండింది. కొండడికి కొంత ధైర్యం చిక్కింది. దేవుడికృప చల్లంగుంటే, నాలుగేళ్ళలో అప్పు తీర్చేసి బయట పడతామనుకొని, సాయంకాలం ఇంటికి పోయి, ఉడుకునీళ్లు పోసుకొని, ఆర బయట నులకమంచమీాద పండుకొన్నప్పుడల్లా ఏవేవో వూహాలతో మేడలు కడుతూవున్నాడు కొండడు.

కొండడితో బేరం చెడ్డప్పటినుంచీ లక్ష్మమ్మకు దిగులుగానే వుంది. తన కయ్యలో కలిసే కయ్యను చూచి చూచి వదులుకోడానికి ఆవిడ కిష్టంలేదు; పోనీ ఎంతయినా సరే, డబ్బిచ్చి తీసుకొందా మనుకొంటే చేతులారా అన్ని రూపాయలు మాలవాడిచేతిలో పోయడానికి మనసొప్పలేదు.

రోజులు గడచినకొద్దీ ఆవిడకు కడుపులో ఈ బాధ జాస్తీ అవుతూవచ్చింది. దానికితోడు ఆయేడు తన నూరెకరాల నట్టువా సగటున ఎకరానికి ఓ పుట్టెడు గింజలు పండి తన ఇంట్లో నూరుపుట్లూ వేసుకోనీకూడా తన నట్టువలో కలిసే కయ్యే అరెకరమే మాలవాడికి పుట్టెడు గింజలు పండిందని తెలుచుకొని ఆవిడ కడుపు దహించుకొనిపోతోంది.

ఒకటి రెండుసార్లు రామిరెడ్డిని పిలిపించి "అబ్బాయీ! ఏమిగతిరా, మాలవాడు బంగారంవంటి అరెకరా కయ్యా అధ్వాన్నంచేసి తన పొట్ట పెట్టుకొన్నాడు. నేను ఏ బావో ఏగొయ్యో చూసుకోవలసిందేగాని గతిలే దిక. తలకింద కొరివిలా ఈ మాలమాదిగ కొడుకుని నాకయ్యలక్రింద పెట్టుకొని నేను నలుగురిలోనూ తలయెత్తి ఈగడ్డమీద కాపురం చెయ్యలేను. అన్నిటికీ నువ్వే వున్నావు. ఏం చేస్తావో చెయ్యి" అని సొద పెట్టింది. "కానీలే అమ్మా! తొందర పడబోకు. వాణ్ని అక్కడనుండి లేవగొట్టే ఉపాయం ఆలోచిద్దాంలే. కాస్త నిదానించు" అని రామిరెడ్డి ఆమె నూరడించాడు. కాని లక్ష్మమ్మ మనస్సు కుదుటపడలేదు.

జ్యేష్ఠమాసం వచ్చింది. తొలకరించింది. రైతులు నార్లు వేసుకొంటున్నారు. పొలాల్లోకి ఎరువు బూడిద తోలు కొంటున్నారు. తొలకరికి భూమి కాస్త మెత్తపడడంచేత కొంతమంది ఆ తడిమీదే అరకలు కట్టి ఒకటి రెండు చాళ్లు వెలిదుక్కులు చేస్తున్నారు. కొండడుకూడా తనకయ్యలోకి

ఎరువుతోలడానికి ఎవరినో ఎరవడిగి ఒకకాడి దున్నపోతులు తెచ్చుకొని బండికట్టాడు. తనూ, తనభార్యా ఇద్దరూ చెరొకగంప తీసుకుని వో యిరవై గంపలు జల్లిలో పోశారు. ఇక బరువు లాగలేవు దున్న లనుకొని కొండడు బండి యెక్కాడు; కొరడా ఆడించాడు; సగందూరం బండి తోలుకు వచ్చాడు.

కొండడికయ్యకు తూర్పునా, ఉత్తరాన్నా, పడమరా కూడా లక్ష్మమ్మ పొలం కమ్ముకువుంది. దక్షిణపుతట్టు మాత్రం సర్కారు అసలు మినహా చెరువుతొట్టె పోరంబోకు భూము లున్నవి. తన కయ్యకి పోవడానికి కొండడు లక్ష్మమ్మ భూములగుండా పోయితీరాలి. మరో మార్గం లేదు. పడమరగా ముప్పాతికమైలు పోతే చెరువులోకి పోయేడొంక వుందికాని అది చాలా చుట్టు. సుమారు రెండు మూడు వందల ఎకరాల భూమి చుట్టుకొస్తేనేగాని కొండడు దారి గుండా తన కయ్యలోకి రాలేడు. ఎరువుబండి తోలుకొని కొండడు తన కయ్యల్లోనుంచి పోతున్నాడని లక్ష్మమ్మకు తెలిసింది. వెంటనే యిద్దరు సేద్యగాళ్ళను పంపి బండిని మళ్ళగొట్టించింది.

కొండడి కేమీ పాలుపోలేదు. బండిని ప్రదక్షిణం చేయించి తీసుకుపోదా మనుకొంటే రెండు సబుర్లు తోలే వరకే పొద్దు గుంకుతుంది. ఊరికీ, తన కయ్యకీ ఓమైలుంది. అసలే దూరంగా ఉన్న తన అరెకరాభాగ్యానికి రెండు

మూడుమైళ్లు ప్రదక్షిణంతిరిగి సేద్యం చేసుకోవాలంటే, అల వయిన పనిగా కనపడలేదు కొండడికి. అందువల్ల బండి నక్కడే విప్పుకొని కొండ డింటికి పోయి భార్యను పిలుచు కొని, యిద్దరూ చెరొకగంపా నెత్తిన పెట్టుకొని, ఎట్లాగై తే నేం, రెండ్రోజులు సాయంత్రానికి అరెకరా కయ్యలోనూ ఓ ఆరుబళ్ల యెరువు మెడనరాలు మెలితిరిగేటట్టు మోసి మోసి కయ్యలో పోశారు.

లక్ష్మమ్మ కెదలో గాథ రాపుట్టుకొస్తోంది. ఏవిధాన్నా మాలవాడు లోబడడంలేదు. ఆమధ్య ఒకసారి కొండడి అరకదున్నిన పశువులు పగటివేళ లక్ష్మమ్మ పొలంలోవున్న మంచినీళ్ల దొరువుకాడికి నీళ్లు తాగనుపోతే, తన దొరువులో నీళ్లు తాగడానికి వీల్లేదని ఆవిడ పశువులను మళ్లగొట్టి బందెలదొడ్డిలో పెట్టించింది. 'దేవుడా' అంటూ పశువు 1 కి 12 అణాలవంతున నాలుగు పశువులకూ మూడు రూపాయలు కట్టి, కొండడు పశువులను బందెనుండి విడిపించుకొన్నాడు. లక్ష్మమ్మ ఇంకా ఏమేమో చేస్తూనే ఉంది. ఎన్ని చేసినా మరుసటి సంవత్సరంకూడా కొండడు మొండికెత్తి, నలుగు రితోపాటు తనుకూడా సకాలంలోనే తన కయ్యను సాగు బడిచేసుకొని మొలగొలుకులు నారు గుచ్చాడు. ఆయేడు కూడా కాలం సరిగ్గానే రావటంవల్ల సకాలంలో మూడు నాలుగు వర్షాలు కురిసి పైరు ఆరంభంలో బాగానే ఎక్కి వచ్చినా, వెన్నుతీసి పొట్టమీదికి వచ్చేవరకు వర్షం బిగించి

కాలం బెట్టచేసి నీళ్లకు ఎద్దడయింది. ఎంత మొద్దడయినా లక్ష్మమ్మబోటి మారాజులుమాత్రం కాలవల్లో వచ్చే నాలుగు చుక్కలూ తమ పొలాలకే పెట్టుకొని, తమ పైరు మాత్రం ఎండిపోకుండా కాపాడుకొంటూ వచ్చారు. కొండడి కయ్యకు నీరు పారుదల అయ్యేటందుకు ప్రత్యేకం కాల్వ లేదు. మడవ తీస్తే నీళ్లు లక్ష్మమ్మకయ్యలోనుంచి తన కయ్యలోకి రావాలి. నిరుడు ఆమె కయ్యమీాది మడవ గుండానే పారించుకొన్నాడు కొండడు. ఈ సంవత్సరం మాత్రం లక్ష్మమ్మ మామూలు మడవను పూడ్చివేసి, తన కయ్యలో నీళ్లు మాలవాడి కయ్యలోకి చుక్క రాకుండా, గనిమె గజం ఎత్తున మట్టి పోసి గట్టిపరచి, తన కయ్యలో అదనంగా నిలిచే పులకనీళ్లకు పడమటితట్టు చెరువులోకి పొయ్యేటట్టు ఇంకో కొత్తమడవ పెట్టించింది. ఆయేడు బీదల పొలాలకు నీరు చాలక పైర్లు ఎండిపోతూవున్నప్పటికీ అదృష్టంకొద్దీ లక్ష్మమ్మకయ్యలో మోకాలులోతు నీళ్లు నిల వడమే కాకుండా, ఇంకా పైనీళ్లన్నీ వచ్చిపడడంచేత అదనమై, కొత్తగా పెట్టించిన మడవగుండా అవన్నీ చెరువు తొట్టులోకి వృథాగా పోతున్నవి. చెర్వుతొట్టులోకి పోయిన నీళ్లు తన కయ్యలోకి కాలవ తవ్వుకొని మళ్లించుకొందా మనుకొన్నాడు కొండడు. కాని తన కయ్య చెర్వుతొట్టు కంటె మిర్రుగా వుండడంచేత నీళ్లెక్కక, ఆ ప్రయత్నం చాలించుకోవలసివచ్చింది వాడు.

## సన్నజీవాలు

ఫలితానికి వచ్చిన పైరు. ఆరు నెలలుగా చెమటోడ్చి కష్టంచేసి పెంచుకొన్న పైరు. ఇంక లెఖ్ఖకు రెండు తళ్లు తగిలితే మళ్లా ఒక పుట్టెడు గింజలు నమ్మకంగా పండే పైరు. కాని తన కయ్యిలోకి నీళ్లు వచ్చేమార్గం కనబడలేదు వాడికి. లక్ష్మమ్మ కరుణించాలె; తనకు నీళ్లు ప్రాప్తించాలె. నీళ్లులేక కయ్య ఎండిపోతోంది. తడి ఆరి అడుగు వేస్తే దిగబడడం లేదు. క్రమక్రమంగా చెమ్మ ఆరిపోయి కయ్యిలోని వరిగంటల సందుల్లో భూమి బద్దలయి బీటలు తీస్తోంది. గనిమెమీద కూర్చుని తూర్పుముఖంగా తిరిగి మోకాలిమీద తలెట్టుకుని, డొక్క ఎగరవేస్తూ, వెక్కి వెక్కి రోదనచేస్తున్నాడు కొండడు. కాని యెండిపోయి బీటలుతీసిన కయ్యను మెత్తనచేయడానికి ఆ ప్రవాహం చాలలేదు.

పొద్దు నెత్తిమీదికి వచ్చింది. నీళ్లులేక పైరు మాడిపోతున్నట్టుగానే, పొద్దుటినుండి చద్దిదాహమైనా లేక వాడి కడుపుకూడ మాడిపోతోంది. ఇంటికి పోయినాడు ; ఇంత అన్నం గతికాడు. భార్యను పిలిచాడు. ఇద్దరూ కలిసి ఒక గూడ సంపాదించారు. నేరుగా కయ్యకాడికి పోయారు. లక్ష్మమ్మ కయ్యల్లోనుండి చెరువులోనికి పోయేనీటికి అడ్డుకట్ట వేసి, ఒక సన్నని కాలవ తీసి, గూడతో పొద్దుగూకులూ నీళ్లు ఎత్తిపోశారు. కాని వెనుకవాలుగావున్న ఆప్రదేశం గుండా నీళ్లు కయ్యలో కెక్క లేదు. అయినప్పటికీ చీకటి

పడేవరకు నాలుగోవంతు కయ్య సుమారుగా తడిసింది. రాత్రి యింటికి పోయి, నీళ్లు పోసుకుని, కూడు తిని, పది గంటలకు వెన్నెట్లో మళ్లా కయ్యకాడికి పోయి తెల్లవారు జామున కోడికూసేవరకూ నడుములు పడిపోయేటట్లు భార్యాభర్త లిద్దరూ ఆ కూడతో నీళ్లు ఎత్తిపోస్తూనే ఉన్నారు. ఆ తడితో పైరు కొంచెం పాటుకు తిరుక్కున్నప్పటికీ, ముప్పై లంఘనాలు చేసి పథ్యం పుచ్చుకొన్న రోగి ఎక్కి వచ్చినట్టయి, అదును తప్పిన తడి అయినందున పుట్టెడు గింజలు కావలసిన కయ్య అర్ధపంట పండి, ఒక పందుం గింజలు రాలింది. తన కెంత ప్రాప్తమో అంతే ననుకొన్నాడు కొండడు.

పుష్యమాసం వచ్చింది. పైర్లన్నీ పంటలకు వచ్చినై. కూలివాం డ్లందరూ కోతలకు వంగారు. వారం రోజులలో తన పైరు యావత్తూ కోయించి కుప్పలు వేయించింది లక్ష్మమ్మ. కూటికి కొరతబడ్డ యానాదులు, ఎరుకలు, మాలలు, మాదిగలు పైరు కోతయిన పొలాల్లో పన అదును మిగిలిన పరిగకర్ర లొక్కొక్కటే ఏరుకొని సాయంకాలానికి ఓ సందెడుకట్ట అయ్యేటట్టుగా కట్టుకొని, ఇళ్లకు తెచ్చుకొంటున్నారు.

కొండడి తల్లి వెంకి ముసలిది అయినా పూర్వకాలపు మనిషయినందున డెబ్బయ్యోయ్యపడిలో కూడా శరీరం చేవదేరి ఇంకా దారుఢ్యంగానే ఉంది. కాయకష్టం చేసిన అలవాటు కొద్దీ, అది యిప్పుడుకూడా ఒక్కనిముషం ఇంట్లో ఊరికే

కూర్చోలేదు. పొయిలోకి ఇన్ని చితుకు లేరుకురావడమో, ఇంత పేడ పోగుచేసి పిడకలు చేసుకోవడమో, ఆసాములు కుప్పలు నూర్చి ధాన్యం బండ్లమీద తోలుకొనిపోయిన తర్వాత కళ్లంలో తడినేల కంటుకొనిపోయిన గింజలను పత్తి పుల్లల చీపురుతోనో, కందిపుల్లల చీపురుతోనో ఒక్కొక్క గింజే కళ్లంలోని మట్టిగడ్డలతోసహా గీకి గీకి, పొద్దుగూకే వరకు ఏ అర్ధశేరుగింజలో చేటలో వేసుకొని ఇంట్లోకి చేర్చడమో – ఇట్లాగే కష్టపడి సంసారానికి కాస్త సాయపడుతూనే వుంది. ఆ అలవాటుకొద్దీ, ఈ సంవత్సరం కోతలు పూర్తి అయి కుప్పలు పడడంతోనే వెంకి పదిరోజులపాటు వరి కొయ్యకాలంతా తిరిగి తిరిగి ఒక అరమోపు పరిగకయ్యాలు పోగుచేసి ఇంట్లో చేర్చింది.

కొండడుకూడా తన కయ్యలో పైరు కోశాడు. వెంటనే ఆపందుంగింజల పంటా పనమీదనే పిడివాటు కొట్టేదామనుకున్నాడు. కాని పిడివాటు కొట్టితే గింజలు కర్రకంటుకొని సరిగ్గా రాలవేమో, పంట కాస్తా పలాములయిపోతుందని భయపడి, ఒక్క వారంరోజులు వెసులుబాటు చూసుకొని నాలుగు బర్రెగొడ్డుల్ని వాటినీ మళ్ళించి తొక్కిద్దామని ఆలోచనచేసి కయ్యలోనే ఒక చిన్న కుప్ప పడవేశాడు కొండడు. లక్ష్మమ్మకూడా కొండడి కయ్యకి ఆనుకొనివున్న మూరెకరాల పంటా కోయించి, అక్కడక్కడ నాలుగు కుప్పలు వేయించింది.

# 4

కోతలు ముగిసి కుప్పలుపడేవరకు రైతాంగానికి రవంత వెసిలిక చిక్కింది. అట్టే ఆలోచించుకోగా తన కయ్యకి దిగులు లేకుండా నీళ్ళుపారే కాలవ లేకపోవడం కొండడికి చిరాకుగా తోచింది. కాలవ కావలెనంటే ఎట్లాగూ లక్ష్మమ్మ కయ్యలోనుండే తనకు రావలె, విధిలేదు కాబట్టి ముందు లక్ష్మమ్మ నడిగి ఆమెచేత కాదనిపించుకొన్నతరువాతనే పై వ్యవహారం చూచుకొందా మనుకొని ఒకరోజు కొండడు లక్ష్మమ్మ ఇంటికి పోయి "అమ్మా! నువ్వు గొప్ప మారాజువి. నామీద పగబట్టితే నే బతకలేను. నీ దయవల్ల చిన్నతనంలో నాకు గంజిపోసి బతికించావు. ఇప్పుడు పెద్దవాణ్ణయిన తర్వాతకూడా నువ్వే అన్నం పెట్టాలసిన గండం వచ్చింది. అయిందేదో అయిపోయింది. కాని అమ్మా! నీకు దణ్ణం పెట్టుతా. నీ కయ్యలోనుంచి నా కయ్యలోకి జానెడు వెడల్పు కాలవగనుక ఇస్తివా, నీపేర దీపంపెట్టుకొని మొక్కుకుంటా" అని అడిగాడు కొండడు.

"కాలవా! నీకా! ముష్టి అరెకరాకయ్య చేతిలోకి వచ్చి రెండోయేడింకా జరుగలేదు. అప్పుడే నీ కయ్యకు కాలవలూ మడవలూ కావలసివచ్చినై గా! ఔరా! అయిన నూరురూపాయల కయ్యా- మానోటికాడ అన్నం- ఎత్తుకొనిపోయి నీ యెదాన్ని పెట్టుకోవడమేకాకుండా పైగా కాలవకోసరం బేరానికి వచ్చావయ్యా! ఇస్తా! కాలవ

ఇస్తానులే! ఉండు; ఈ పొంగు బోర్లాపడడానికే వచ్చిందిలే నీకు. ఎందుకు పాపం అని అజ్జాయించి ఊరుకోనివ్వుండా. ఈపాలి నాకయ్య తొక్కిచూడు, రెండు కాళ్ళూ విరగ్గొట్టిస్తా" అంది లక్ష్మమ్మ.

"నాకు ఊరికినే పనిలేదులే అమ్మా! కాలవకుగాను నీ విచ్చే స్థలానికి క్రమమైన క్రయంగట్టి, డబ్బుతీసుకొని మరీ యిద్దువుగానిలే" అన్నాడు కొండడు.

"ఛీ! నోరు మూసుకొని బయటికి పో! శుభమల్లే మంగళవారపూట ఇంటిముంగిటికి వచ్చి కయ్యమ్మ్కో, కాలవమ్మ్కో అని వెధవకూతలు కూస్తావు! నోట్లో పాడిపిస్తా చూడు. నాకేం గ్రహచారం పట్టలేదు, నీకు నా మళ్ళూ మాన్యాలూ అమ్ముకోడానికి. ఈపాలి కాలవసంగతి ఎత్తావంటే మాటదక్కదు. పో" అని లక్ష్మమ్మ కసురుకుంది.

ఇక లాభం లేదనుకొని కొండడు ఆ వెళ్లడం వెళ్లడం తిన్నగా ఆ ఫిర్కా రివిన్యూ యినస్పెక్టరుదగ్గరకు వెళ్లాడు. అదివరలో కొండడికయ్య పట్టాకు తెప్పించినపుడు కొంత మేత మేసిన గొడ్డు కాబట్టి రెవిన్యూ యినస్పెక్టరుకు వాణ్ని చూడడంతోనే నోరు ఊటలూరింది. కొండడు చెప్పుకొన్న విన్నపం విన్నాడు. "ఇది మన చేతిలో పని. ఎంతసేపు! ఎల్లుండి మర్నాటికి కాలవకు ఉత్తరవు తెచ్చిపెడతా"నని చెప్పి అనుకొన్నదానిలో ముందుగా సగమూ, పనిపూర్తయిన తర్వాత మిగిలిన సగమూ కొండడు తనకిచ్చేటట్టు ఖరారు

చేసుకొని, మొదటిసగం అయినుసూపాయలూ ఆ క్షణంలోనే చేతిలోకి రాల్చుకున్నాడు, 'రేపు జాగ్రత్త' అనే బ్రతుకు తెరువు తెలుసుకొన్న ఆ రెవిన్యూ ఇనస్పెక్టరు. వెంటనే తహశీలుదారుకూ, డిప్టీకలెక్టరుకూ అర్జీలు వ్రాసి పోస్టులో రిజిస్టరు చేయవలసిందని కొండడితో చెప్పుతూ, "ఒరే! కొండా! ఇక్కడ ఇనస్పెక్టరుని ఎలాగో తృప్తిపరచాంగదా, ఇక పరవాలేదనుకొంటావేమో. ఇవి డెల్టాకొంపలు. ప్రతీ పనికీ డి.పి.డబ్ల్యూ. వారితోనూ, మాతోనూకూడా అవసరం ఉంటుంది. తీరా ఫలితానికి రాబొయ్యే సమయంలో ఆ వోవరుసీరు ముండావాడు ఒక్క కలంపోటు పొడిచాడంటే ఆ చిక్కులోంచి పెరుక్కోలేక చావాలి. అర్జీలు పంపడం తోనే ఆ వోవరుసీరుకాడికి పోయి, దణ్ణంపెట్టి చెప్పుకో. తెలిసిందా? తర్వాత నన్ను నిష్ఠూరమాడితే ప్రయోజనం లేదు" అన్నాడు.

"సరేలే అయ్యా! నా కళ్లాటలు నే పడతాలే. నువ్వు మట్టుకు నిండా దయవుంచాలి" అని కొండడు దణ్ణంపెట్టి వెళ్లి, రెండు అర్జీలకూ రెండు పావులాలూ ఇచ్చి వ్రాయించి, డిప్టీకలెక్టరు కొకటీ, తహశీలుదారుకొకటీ పోస్టులో వేసి ఇంటికి వచ్చాడు.

కొండడు వెళ్లినమర్నాడే రెవిన్యూ ఇనస్పెక్టరు "ఇట్లా ఇట్లా వ్యవహారం జరగబోతోంది, మీ జాగ్రత్తలో మీ రుండవలసింది." అని జవానుద్వారా లక్ష్మమ్మకు

కబురు చేశాడు. లక్ష్మమ్మ స్వయంగా వచ్చి మాట్లాడ్డానికి వీల్లేక రామిరెడ్డిని ఇనస్పెక్టరు పంతులుకాడికి పంపుతూ, కూడా పది అరటికాయలూ, పది అరటిఆకులూ ఇచ్చి పంతులికియ్యమని చెప్పింది. రామిరెడ్డి ఇనస్పెక్టరుపంతులుతో అంతా మాట్లాడి మనస్సుకు తెచ్చుకొని 'ఇంటికి పోయి మా పిన్నమ్మతో మాట్లాడివస్తా'నని కూర్చున్న మనిషి లేచాడు.

"ఇదిగో! ఊరికేనే మంత్రాలకి మామిడికాయలు రాలేకాలం కాదని మీ పిన్నమ్మతో గట్టిగా చెప్పు. మాలవాడు ఏవేవో సిఫార్సులు తీసకోనిపోయి పై ఆఫీసుల్లో గట్టి ప్రయత్నం చేస్తున్నాడు. పైగా సర్కారుకు హీనజాతులంటే తగని అభిమానం. ఈ తిరుగుళ్లన్నీ మీకు తెలియవు. చేసేప్రయత్నం ఘట్టిగా చెయ్యాలని ఆమెతో నొక్కిచెప్పు. తెలిసిందా" అని పంతులనేవరకు 'చిత్తం అట్లాగే లెండి' అని రామిరెడ్డి ఇంటికి పోయి లక్ష్మమ్మతో అన్ని సంగతులూ చెప్పాడు.

"ముందుగా చెయ్యిజారితే తంటాగాని నోరుజారితే పరవాలేదు. ఇచ్చి పుచ్చుకోవడాలు తర్వాత చూచుకో వచ్చుగాని, అసలు మనకు అనుకూలంఅయితే కార్యం అంతా అయినతర్వాత ఇనస్పెక్టరుకు ఇరవై రూపాయలిస్తామని మాటమాత్రం పడేసి చక్కారా" అని లక్ష్మమ్మ చెప్పింది. ఆమాటలే తీసుకువచ్చి రామిరెడ్డి ఇనస్పెక్టరు

కందించాడు. ఆయన పెదవి విరిచాడు; లాభం లేదను కొన్నాడు. కొండడు ఇచ్చుకొన్న అర్జీలు రిపోర్టునిమిత్తం ఇనస్పెక్టరువద్దకు రాగా ఆయన ఎటూ తేల్చకుండా, ఎవరికీ అనుకూలం లేకుండా, 'కాలవ ఇస్తే ఇవ్వవచ్చు. ఇవ్వక పోయినా కొండడికి వచ్చిన ఇబ్బంది లే'దని గోడమీది పిల్లి వాటంగా రిపోర్టు వ్రాసి అర్జీలు పైకి పంపివేశాడు. ఇక పదిహేను ఇరవై రోజుల్లో తనకు అనుకూలంగా ఉత్తరువులు వస్తవని కొండడు కొండంత ఆశతో ఎదురుతెన్నులు చూస్తున్నాడు.

# 5

కుప్పలింకా ఇప్పుడప్పుడే నూర్చరు. ఉగాదికిగాని కళ్లాలు చేయడానికి కయ్యలారవు. అందువల్ల కుప్పలన్నీ పొలాల్లోనే ఉన్నవి.

లక్ష్మమ్మ రాత్రిపూట కుప్పలవద్ద మనుష్యుల్ని కాపలా పెట్టుతూనేవుంది. రోజూ రేపటివేళనో, మాపటివేళనో ఆమె ఒకసారి కుప్పలచాయ బోయి, తన సొమ్ము భద్రంగా ఉన్నదో లేదో అని చూచుకొంటూనే వుంది. తగని అనుమానం మనిషి! ఎవరినీ నమ్మదు. తన మనస్సే తను నమ్మలేదు. పొలంలో సొమ్ము ఇంట్లోకి వచ్చేవరకూ ఆమెకు ఒకటే ఆలాపనగా వుంది.

ఒకరోజు పొద్దు పొడవకముందే ఆమె పొలంచాయ బోయి, కొండడి కయ్యకు సమీపంలోవున్న తన కుప్పలను

తణిఖీ చూచుకొంటూవుండగా, అందులో ఒక కుప్పకు నెత్తిన నడిభాగంలో ఒక మోపుపన పెరికి బయటికి తీసి నట్లు చిందరవందరగా ఆమెకళ్లకు కనిపించింది. మరి, ఎవరైనా కావాలని రాత్రిపూట చోరీగా వచ్చి ఆకుప్పలో ఒక మోపెడుపన తీసి ఎత్తుకొనే పోయ్యారో, లేక అంతకు ముందటిరోజు సాయంత్రం కొట్టిన సుడిగాలికి, కుప్ప కప్పడంలో పసిలేక పైభాగంలో ఒక సందెడుగడ్డి గాలికి ఎగిరేపోయిందో, లేక ఆమె అనుమానపు కళ్లకే ఆవిధంగా కనుపించిందో చెప్పలేంకాని మొత్తానికి ఎవరో తనను అన్యాయం చెయ్యాలని, రాత్రిపూట చోరీగా తన కుప్పలో పన పెరుక్కుపోయారని లక్ష్మమ్మకు ఘట్టి నమ్మకం తట్టింది.

ఇక నెందుకు, తన రెండులక్షల రూపాయల సంసారమూ నట్టేట కలిసిపోయినట్లు గుండెలు గుద్దుకొంటూ, ఆమె నోటికి వచ్చిన తిట్లు తిట్టుకొంటూ, వీధిన బడి గోలపెడుతూ పరుగు పరుగున ఇంటికి వచ్చీరావడంతోనే తొందరగా రమ్మని రామిరెడ్డికి కబురుచేసింది. ఏదో కొంప మునిగిందనుకొంటూ రామిరెడ్డీ, రామిరెడ్డితల్లీ, రామిరెడ్డి చెల్లెలూ పరుగెత్తుకొని వచ్చేవరకు, లక్ష్మమ్మ తల విరబోసుకుని, దక్షిణపుతట్టు వసారాలో వట్టినేలను, రోజుతూ, రొప్పుతూ "అయ్యో నా కొడకా! అయ్యో రామిరెడ్డీ! కొంప గుండం వేసుకొని పోయిందిరా, నాయనా! నా సంసారానికి నేటి కిన్ని కడగండ్లు వచ్చాయిరా తండ్రీ! అయ్యయ్యో! మేరు

పర్వతంలాంటి కుప్ప, అస్థులూ, చర్మమూ అరిగిపొయ్యే టట్లు కష్టంచేసి పండించుకొన్న కుప్ప, నా మొలగొలుకుల కుప్ప, బంగారంలాంటి కుప్ప నట్టేట కలిసిపోయిందిరా బాబూ! నేను గొంతుక్కి వురోసుకొని చావవలసిన రోజు వచ్చిందిరా కొడకా'' అని చూడవచ్చిన వాళ్ళకు అర్థం గాకుండా ఒక్కటే రోజుతూ, కంటికీ నేలకీ ఏకధారగా పెద్ద పెట్టున ఏడిచింది.

''ఏందమ్మా? అసలు సంగతేమిటో చెప్పవమ్మా! ఏం జరిగిం దేమిటి? నిన్న పగటివేళ పొలంచాయ పోయి చూచివచ్చాను. మన కుప్పలన్నీ భద్రంగానే ఉన్నవే! ఇప్పు డేం వచ్చిందీ!'' అని రామిరెడ్డి అడిగేవరకు—

''దానికి కాలం వచ్చేటప్పటికి ఎంతలో పోవాలెరా నాయనా! నిన్నరాత్రి తెల్లవార్లూ ఎంతమంది జనం మోసి నారోగాని సగం కుప్ప ఎగిరిపోయిందిరా బాబూ! వీళ్లు నాశనంగానూ! వీళ్ళ కడుపులు మండిపోనూ! వీళ్లవంశం నిర్వంశంగానూ!'' అని లక్ష్మమ్మ మళ్లా అందుకొంది.

''అయితే ఎవ రెత్తుకొపోయినా రంటావు?'' అన్నాడు రామిరెడ్డి.

''ఎవరని నన్నడుగుతా వెందుకయ్యా? అయ్యయ్యో! ఈ మాలమాదిగకొడుకు నా ఇంటికి శనిగ్రహంపట్టినట్లు పట్టినాడురా బాబూ! తలకింద కొరివిలా నా కయ్యకింద వాడు ఊరికేనే చేరినా డనుకొన్నావా? మొన్న నేను

వాడికి కాల వివ్వ లేదని వాడు న న్నప్పుడే బెదిరించి నా మీద శాబ్దీలుతీసి వెళ్లాడురా బాబూ! ఆ మాలమాదిగ కొండడుతప్ప మరొకరి పని గాదురా ఇదీ'' అని లక్ష్మమ్మ మరీ ఏడిచింది.

"అట్లాగయితే నేను విచారిస్తాగాని, నువ్వూరికే రచ్చ చేయబోకు! మాలవాడెక్కడకు పోతాడు? నిముషాల మీద నీ సొత్తంతా నీయింట్లో చేరుతుంది. ఏడవబోకులే. లేచి పళ్లుతోముకొని, ఇన్ని చద్దినీళ్లు తాగు. అయ్యయ్యో! అరచి అరచి గొంతుకు రాచుకుపోయె; ఆయాసమూ, శోషా కూడా వచ్చిందిగదమ్మా తల్లీ! లే! ఎండపడింది. లే!'' అని రామిరెడ్డి ధైర్యం చెప్పాడు.

లక్ష్మమ్మకు విడిపోయిన జుట్టు రామిరెడ్డి తల్లి ముడి వేసింది. సందటపట్టి లక్ష్మమ్మను రామిరెడ్డి పైకి లేవదీసి చీకీమీద కూర్చోపెట్టాడు. లక్ష్మమ్మ చెదిరిపోయిన పైట సర్దుకొని, జగ్రున చీది నేలనేసి కొట్టింది. వొంటి నంటు కొన్న దుమ్మూ, ధూళీ రామిరెడ్డి తుడిచాడు. రామిరెడ్డి చెల్లెలు పళ్లు తోముకోను నీళ్లు పిన్నమ్మపక్కన పెట్టింది. కళ్లు తుడుచుకొని లక్ష్మమ్మ మొగం కడుక్కొంది.

## 6

రామిరెడ్డి దూరాలోచన గల మనిషి; కానైతే జబ్బురకం మనిషి కాదు. పినతల్లి చేసిన చేష్టలన్నీ తనలో

విమర్శించుకొన్నాడు. అతని కసలు పినతల్లితత్వం మొదటి నుంచీ తెలవనే తెలుసు. ఇంటికిపోయి పైన గుడ్డవేసుకుని చెప్పులు తొడుక్కొని, కర్ర చేత పుచ్చుకొని రామిరెడ్డి తిన్నగా కరణం రామగుండం బసవయ్యగారి యింటికి వెళ్లాడు.

బసవయ్యగారు నిఖారుసైన నియోగిబిడ్డ. తండ్రి పేరూ, తాతపేరూ మాత్రమే కాకుండా, అసలు ఆ ర్వేలవారందరి పేరుప్రతిష్ఠలూకూడా ఏకటాకీని నిలబెట్టుతున్నాడాయన. అనాదిగా వారిది పెద్ద కరణాల కుటుంబం అని పేరుపడింది. ఆయన స్వతహాగా తెలివితేటలు గల ఘటం. గ్రామంలో బసవయ్యగారి బావుటా బాగా ఎగురుతోంది. ఆవ్వూరి మునసబు కమ్మనాయుడు. సంతకంమాత్రం ఎట్లాగో నేర్చుకొన్నాడు. బసవయ్యగారు నుంచోమంటే నుంచోవాలి, కూర్చోమంటే కూర్చోవాలి అతను. అందువల్ల ఆ గ్రామ సివిల్, క్రిమినల్, రెవిన్యూ వగైరా అధికారాలు బసవయ్యగారే చలాయిస్తూ రెండుచేతులా గ్రామంలో నొల్లుకొని తింటున్నాడు. కాని ఎంత సంపాదించినా ఆయనకుటుంబం పెద్దది; కూతుళ్ల పెళ్లిళ్లకీ కార్యాలకూ, వాటికీ వీటికీ చాలక, కొంతవరకు లోకులకు ఋణపడ్డాడు. అచ్చం రామిరెడ్డికే ఆయన ఆరువేలు అచ్చవలసుంది. ఆ మొగమాటంకొద్దీ తనకు గ్రామంలో ఎంతపలుకుబడివున్నా,

అప్పుడప్పుడు బసవయ్యే రామిరెడ్డికిమాత్రం రవంత పక్కలు వంచుతూ వుండవలసి వచ్చింది.

రామిరెడ్డి రావడంతోనే బసవయ్య అతణ్ని ఆహ్వానించి చావడిలో ఉత్తరపుతట్టు అరుగుమీద చిరిచాపవేసి "ఏం ఇట్లా వచ్చావు, కథ" అని ప్రశ్నించాడు. "మీతోనే పనివుండి వచ్చా. నిన్నరాత్రి మా పిన్నమ్మ దక్షిణపు నట్టులోని కుప్పలో ఎవరో దొంగతనంగా పది మోపులు పన కట్టుకొనిపోయారుట. దానికోసరం ఆమె గోలెడుతోంది" అన్నాడు రామిరెడ్డి.

"పది మోపులే?"

"ఆఁ! పదంటే పది కాదనుకో. అంతకు తక్కువే కావచ్చు. ఎంతయినప్పటికీ దొంగతనం దొంగతనమే."

"కాదుమరి! పాపం! ఆమెసొమ్ముకు కక్కుర్తిపడ్డ గాడిదకొడు కెవడయ్యా?"

"నీతో నిజం చెప్పొద్దూ: ఎత్తుకొని పోతూవుండగా ఎవరూ కళ్ళారా చూడలేదు. మా పిన్నమ్మకేమో మాల కొండడిమీద అనుమానం."

"అబ్బే! వా డట్లాంటి పనికి పోయేవాడు కాదయ్యా, పాపం! ఎందుకు మనంమాత్రం ఒకరిమీద పాపపుమాటలు అనుకోవాలి?"

"అవును మరి. వాడి సంగతి నాకూ తెలుసు. అయితే ఆమెమ్మాత్రం వాడే చేశాడు ఈపని అని ఘంటా పథంగా చెప్పుతోంది. ఆమెమతం మార్చడానికి బ్రహ్మ దేవుడి తరంగాదు."

"అయితే ఇప్పుడేం చేద్దామని నీ ఆలోచన?"

"చేయడానికేముంది! కొండణ్ని పిలిపించి ఆమె కుప్పలో పోయినకట్టలు ఆమె కిప్పించివెయ్యి."

"అంతటితో ఆమె తృప్తిపడుతుందా?"

"అదీ సందేహమే. తీరా పదికట్టలు వాడిచేత ఇప్పించినా, చోరీచేసినందుకు వాడికి జుల్మానా విధించి అది కూడా తనకే ఇప్పించవలసిందని ప్రాణాలు తీస్తుంది. ఆమెతో నక్కచావు వచ్చిపడిందయ్యా నాకు. ప్రాణాలు కొరికేస్తుంది. పాడుముండ!"

"ఎట్లాగా నీ రొట్టె విరిగి నేతిలో పడిందిలే. అసలామె సంసారాని కెక్కుపెట్టి వున్నావు. మొత్తానికి నీది ధన జాతకమే."

"ఏమో! ఆ ముండ అంతరించే దెప్పటికో, మన పాచిక పారే దెప్పటికో! మరి ముందు దీనివిషయం పరిష్కారం చేయాలె. ఈపని నీ చేతిలో వుంది."

"మరీ ఇంత అన్యాయంలోకి దిగుతున్నావేమిటయ్యా, రామిరెడ్డీ! ఎత్తుకొనిపోతూవుండగా ప్రత్యక్షంగా చూచినట్టు

సాక్ష్యమేనా వుంటే ఏదోవిధంగా యేడవ్వచ్చు. ఎవడ్నో వీధిన పొయ్యేవాణ్ని పిలిచి, నువ్వు లక్ష్మమ్మకుప్పలో చోరీ చేశావని ఎట్లాగ నిరూపించడం? నువ్వే చెప్పు.''

''సరేలే! ఈ ధర్మపన్నాలన్నీ ఏకరువుపెట్టడానికిప్పు డేమీ సందులేదు. నాకు తెలుసు. అసలు చోరీ జరిగిందో లేదోకూడా నాకూ అపనమ్మకమే. ఇంటికి వచ్చి మా పిన్నమ్మని చూడకపోతివి. పొద్దుటినుంచీ ఆమె చేసే అఘాయిత్యం చూస్తే నువ్వేమనుకొందువో! ఈ విషయంలో మట్టుకు నువ్వు పూర్తిగా నామాట దక్కించాలె. నీకు తప్పదనుకో. నా మెడకు గండకత్తెర చుట్టుకొంటే, నీకు చుట్టుకొన్నట్టు కాదూ, బసవయ్యగారూ?''

''అయితే భోజనంచేసుకొని, మధ్యాహ్నం, వాణ్ని పిలిపించి విచారించి ఏదో రకంగా తీర్మానంచేద్దాంలే. పెద్ద మనిషివి. నువ్వే స్వయంగా ఇంత నొక్కి చెప్పుతుంటే ఇక తప్పుతుందా?''

''సరే'' అంటూ రామిరెడ్డి లేచి ఇంటికి వెళ్లాడు. పదకొండు గంట లయ్యేసరికి బసవయ్యపంతులుకూడా స్నానంచేసి, ఆహ్నికం పూర్తిచేసుకొని, భోజనంచేసి, మధ్యాహ్నం మూడుగంటలకు కొండడికోసం ఇంటికి కబురుచేశాడు. బర్రెగొడ్లొకటి మేతా నీళ్లూ మేయక, పొద్దుగూకులూ అరుస్తూ పశువులమీదికి ఎగబడుతూవుంటే, దున్నపోతును దాటించడానికి దాన్ని కొండడు పక్కవూరికి తోలుకు

పోయాడని ఇంటికాడ చెప్పేవరకు పోయినమనిషి తిరిగివచ్చి ఆ సంగతులే పంతులుతో చెప్పాడు. తాను చెప్పినపని ఏమి చేశాడో కనుక్కురమ్మని రామిరెడ్డి అప్పుడే కబురుచేశాడు. ఇక ఆలస్యం చేయడానికి వీలుండేటట్టు లేదని రామిరెడ్డిని పిలిపించుకొని, అతన్నీ, ఇద్దరు వెట్టివాళ్ళనూకూడా తీసుకొని బసవయ్యపంతులు ఎకాఎకీని మాలవాడలో కొండడిఇంటికి పోయినాడు. విచారిస్తే కొండడు లేడని తెలిసింది.

కొండడిది ఒకదూలం చప్పరం. మామూలు చుట్టు గుడిసెకంటె రవంత పెద్దది. లోపల కొండడి తల్లితప్ప ఇతరు లెవ్వరూ లేరు. కొండడి భార్య కూలికిపోయి ఇంటికి రాలేదింకా. దాని చంటిబిడ్డ- పదినెల్లకూన- గుడిసెలో కింది గోతంపట్టామీద పండుకొని దొర్లుతూవుంది. ఈ పది రోజులుగా తిరిగి తిరిగి ఏరుకొని తెచ్చుకొన్న పరిగలన్నీ కలిసి ఒకటిరెండు చిన్నకట్ట లయ్యేవరకు, కొండడితల్లి ఆ రెంటినీ ఒక గుడిసెలో ఒకతట్టుగా వేసి, ఆ రాత్రి కూటికి గింజలు లేనందున, సందెకుకర్రలు ఆ కట్టల్లోనివి తీసి గుడిసెవాకిట ఎండబెట్టి, ఎండిన కర్రలు కొద్దికొద్దిగా తీసి కింద ఈతాకు చాపమీద వరివెన్నులు కుడికాలికింద వేసుకొని నలుపుతోంది. గింజలన్నీ రాలినతర్వాత గడ్డినిమాత్రం ఒక పక్కగా పెట్టుతోంది.

బసవయ్యపంతులూ, రామిరెడ్డీ, సిబ్బందీ వచ్చేవరకు దానికి గాభరాపుట్టింది. "ఇదేందబ్బా! ఎన్నడూరాని

అయ్యవారుకూడా మాలవాండ్ల గుడిసెకాడికి ఎండలోపడి వచ్చాడే'' అని దానికి అర్థంకాకుండా వుంది.

"వెంకీ! ఆఖరుకు నీ కొడుక్కి ఇల్లాంటి దొంగబుద్ధులు కూడా పట్టుబడ్డాయటే!" అన్నాడు బసవయ్య.

"ఏంది మారాజా! ఏం చేశాడయ్యా నా కొడుకు?"

"ఏం చేశాడా! నిన్నరాత్రి లక్ష్మమ్మకుప్పలో పన పెరికి చోరీగా తెచ్చి ఇంట్లో వేసుకొన్నాడటగా? ఇదిగో రామిరెడ్డికూడా వచ్చాడు."

"ఏ లక్ష్మమ్మ సామీ! – రామరామ! మే మట్లాంటి పాపాలకు పొయ్యేవాండ్లము కాదు సామీ! నా కొడుకు ధర్మరాజు సామీ."

"ఛీ! నోరుముయ్యి. ఊళ్ళో వాళ్ళసొమ్ము దోపిడీచేసి, ఇంట్లో వేసుకొని కమ్మంగా తిందామనుకొన్నావా? నీ సంగతి నే నెరగనూ? అసలు నువ్వే చెప్పిపంపించి ఉంటావు కొండణ్ణి, దోపిడీ చేయమని. జైలుకి పంపిస్తా చూడు."

"ఏందయ్యా సామీ! ఈ గొడవ ఈ రోజు? నా కొడుకు నిన్న పగటేళనంగా బర్రెను తోలుకొనిపోయాడు నాయనా! రాత్రి వాడింటికి రాలేదు. ఆ పాపం మాకు తెలియదు సామీ! ఉంటే తింటాం, లేకుంటే పస్తు పండు కొంటాంకాని, దొంగకూళ్లు మాకు పనిలేదయ్యా! నీకు దణ్ణంపెట్టి చెప్తాతా!" అని వెంకి అనేవరకు వెట్టివాళ్ళ

నిద్దరిసీ పిలిచి "ఒరే, లోపలికిపోయి సోదా వేసి చూడండిరా; ఇంట్లో పనకట్టలుంటే బయట వేయండి" అని బసవయ్య చెప్పాడు. వెట్టివాళ్ళిద్దరూ మాలవాళ్ళే. బసవయ్య ఈ మాట అనేవరకు, ఇద్దరిలో ఒకడు కాలు ముడుచుకోను పోయినట్టుగా పోయి ముఖం తప్పించాడు. రెండోవాడు సందేహిస్తూ సందేహిస్తూ, ముఖం కిందికి వంచుకొని, చేతిలో కర్ర కింద టక్కుటక్కున కొట్టుతూ, అడుగులో అడుగు వేసుకొంటూ ముందరికి పోతున్నాడు. అది చూచి బసవయ్య పంతులు, "నీకేమైనా సొయ్యమా ఏందిరా? గుడిసెలో సోదా వేయమంటే పెళ్ళినడకలు నడుస్తావేందిరా? మెడలు విరగదన్నుతా, తొందరగా వెళ్లు" అని వెట్టివాణ్ణి అదలించాడు.

వెట్టివాడు గుడిసెలో దూరాడు.

"ఇదేందిపంతులూ ఈ అన్యాయం? పిల్లోడూ, పిల్లా కూడా ఇంటికాడ లేకుండాచూచి నా గుడిసెకు నిప్పు పెట్టుతుండా వేమయ్యా" అని వెంకి గొల్లుమన్నది.

మాలవాడలోని మాల లందరూ కూలికి పోయినందున, ఎవరో అక్కడక్కడ ముసిలీ ముతకా, పిల్లా జెల్లా తప్ప ఇతరు లెవ్వరూ పెద్దతలకాయలు కనపడడం లేదు. వెంకి గుడిసెకాడ జరిగే గలభాకు ఆ వున్నవాళ్ళే - పిల్లా పీచూ, పదిమందీ పోగయ్యారు. వెట్టివాడితో కూడా వెంకి గుడిసెలో దూరింది. వాడి కాళ్లావేళ్లా చుట్టుకొంది. లోపలికి

పోయిన వెట్టివాడు అయిదు నిముషాలవరకూ బయటకు రాలేదు. వెంకి గోలపెట్టుతోంది. దాని అవస్థ చూచే వరకు వాడికి కళ్ళవెంబడి నీళ్లు గిర్రున తిరిగినవి. సోదా వేయడానికి కళ్ళచూపు ఆనలేదు వాడికి.

"లోపలదూరి ఎంతసేపటికీ బయటికి రావేందు వల్లరా? నీ కేమైనా ముసించిందా ఏమిటి? లేక ఈ దొంగ సొత్తులో నీ కేదైనా భాగం వుందా? బయటికి రావేమి!" అని బసవయ్యపంతులు బయటనుండి అరుస్తున్నాడు. వెట్టి వాడు బయటికి రాలేదు. బసవయ్యకు వొళ్లు భగ్గుమనింది. వెట్టివాడు మొగమాటంవల్లనో, కులాభిమానంవల్లనో సమయానికి జంకుతున్నాడని, తానిక చెయ్యిచేసుకొంటేనేగాని వీల్లేదనుకొని బసవయ్య దుడుంగున గుడిసెలోకి దూరాడు. వెంకి పరిగ వరి తెచ్చి పోగుపెట్టిన రెండు కట్టలూ చూశాడు.

"ఈ కట్ట లెక్కడివే వెంకీ?" అని అడిగాడు బసవయ్య.

"వరికోయ్యకాల్లో పరిగ వరి తెచ్చుకొన్నవి, సామీ! ముసిలిముండని. నడుము పడిపొయ్యేటట్టు ఒక్కొక్క కర్రే యేరి తెచ్చుకొన్నా; ఇది దొంగసొత్తు కాదు మారాజా! నీకు దణ్ణం పెట్టుతా" అన్నది.

"తప్పుడుమాటలు కూస్తావు" అంటూ ఆయనే రెండు కట్టల్నీ బరబర బయటికి లాక్కొనివచ్చాడు. వెంకి నోరూ నెత్తీ లబలబ కొట్టుకొంటూ బసవయ్యకు అడ్డుతగిలేవరకు,

మాలముండ తనను తాకుతుందేమో, ప్రాయశ్చిత్తం చేసుకోవాలెనని భయంతో, బసవయ్య తన చేతికర్ర రెండు చేతులతోనూ ఆచివరా, ఈచివరా పట్టుకొని వెంకిమెడ మీద బెట్టి ఒక్కనెట్టు నెట్టాడు. 'చచ్చాను దేవుడా!' అని వెంకి నాలుగుగజాల దూరంలో పడిపోయింది.

బయటికి లాక్కొనివచ్చిన రెండు కట్టలూ బసవయ్య చేతనే తన ఇంటికి మోయించేవాడు రామిరెడ్డి. కాని బ్రాహ్మణ్ణి కష్టపెట్టకూడ దనుకొని, తన జీతగాళ్ళలో ఒకణ్ణి పిలిపించి రెండు కట్టలూ లక్ష్మమ్మయింటికి చేర్పించాడు.

కిందపడిన వెంకి కిందనే పొర్లుతూవుండగా, తలపెట్టిన కార్యం జయప్రదంగా కొనసాగినందుకు సంతోషపడుతూ, బసవయ్య జారిపోయిన జుట్టు ముడివేసుకొని, కర్ర చేతబుచ్చుకొని, చేతులు ఊగిసలాడించుకొంటూ, రామిరెడ్డితోకూడా ఇంటికి వెళ్లాడు. వెళ్లి బావిదగ్గర ముఖాన్న ఉండిన గంధం పట్టెలూ, అక్షతలబొట్టూ పొయ్యేటట్టు పదబిందెలు నెత్తికి తోడిపోసుకొని స్నానంచేసి, చేతికర్రకూడా కడిగేసి, ఇంట్లోకి పోయి పట్టుగుడ్డ కట్టుకొని, విభూతి ధరించి మైలబడ్డ జందెం తీసివేసి కొత్తజందెం వేసుకొని నూటఎనిమిదిసార్లు గాయత్రి జపించాడు; తరువాత లేచి చలవమడతలు కట్టుకొని మంచి తీర్థం తీసుకొని వీథిలోకి పోయాడు. ఇంతలోనే లక్ష్మమ్మ పిలిపించేవరకు ఆమెయింటికి పోయి వీథిఅరుగుమీద కూర్చొని అతనూ, రామిరెడ్డీ, లక్ష్మమ్మా ఈముచ్చటే ఏమిటో

మాట్లాడుకొంటున్నారు. రెండు వరికట్టలూ ఇంటికి చేరి నప్పటికీ పోయినసొత్తు పూర్తిగా రాలేదని లక్ష్మమ్మ సణుగు తూనేవుంది, చెవులో పోటులాగ. "బయటకు పోయిన ముగాడు, కొండడు ఇంటికి వచ్చినతర్వాత కొరవకూడా ఏదో విధంగా భర్తీ చేసిపెట్టుతాం లేవమ్మా. నీ సొత్తు గడ్డిపర కంతకూడా ఎక్కడికీ పోదు." అని బసవయ్య ధైర్యం చెప్పి లక్ష్మమ్మను ఓదారుస్తున్నాడు. "ఏమో నాయనా! నా ప్రాణం హరీఅనేవరకూ ఏ కడగండ్లూ లేకుండా నా తను విట్లా తెల్లవారిపోతే, నా కంతే చాలు. లోకుల సొమ్ము నాకు ఆవగింజంతకూడా అక్కరలేదు. ధర్మాత్మురాలు లక్ష్మమ్మ అని లోకం మోగిపోతున్న రోజుల్లో, ఈనాటి కీ మాలముండాకొడుకు నన్ను నలుగురిలోకీ ఈడ్చాడు, వీణ్ణి పోలేరమ్మ బుగ్గిచేసుకుపోనూ" అంటూ సింహద్వారానికి పొదుగిట ఆనుకుని, కంట తడిపెట్టుకొని, పైటకొంగుతో తుడుచుకొంది లక్ష్మమ్మ.

## 7

కొండడు పడమట బారెడు పొద్దుందనంగా అసురుసురై బుర్రెను తోలుకొని, పొద్దుటినుంచీ కూడు లేక ఇంటి కొచ్చే వరకు, ఇల్లంతా బీభత్సంగా వుంది. వెంకి ఇంటిముంగిట దుమ్ములో పొరలాడుతూవుంది. కొండడిభార్య ఇంకా ఇంటికి రాలేదు. జరిగిన విషయం అంతా కొండడు తెలుసు

కొన్నాడు. వాడిమనస్సు చీకాకయింది. కథ పెరుగు తున్నందుకు వాడు వగచాడు. అధైర్యపడ్డాడు. కాని ఇంతలో సంబాళించుకొని 'వెధవ పరిగకర్రలు నాలుగూ తీసు కొనిపోతే పోయారు, ఇంతమాత్రానికే చెడేది లేదులే' అని వాటివిషయమై దిగులుపడలేదు కాని, తాను దొంగతనం చేసినట్లు నలుగురిలోనూ అపకీర్తిపాలు కావలసివచ్చిందే అనిమాత్రం దుఃఖించాడు. ధైర్యం తెచ్చుకొన్నాడు మళ్లాకి తల్లికి ధైర్యంచెప్పి, లేవదీసి ఓదార్చాడు. మరికొంతసేపటికి, భార్య వచ్చింది. ముగ్గురూ కాస్సేపు కళ్ళనీళ్ళు పెట్టు కొన్నారు. ''ఇక ఊరుకోండి. ఇంతటితో మనం అదృష్ట వంతులమే'' అని కొండడు వాళ్ళని ఊరడించి, లేచి నీళ్లు పోసుకొందామని, కడవదగ్గిరకు పొయ్యేవరకు—కరణమూ, రామిరెడ్డీ పిలుచుకొని రమ్మన్నారని కొండడి తావుకు ఒకమనిషి వచ్చి పిలిచాడు. నీళ్లు పోసుకొని కొండడు లక్ష్మమ్మఇంటికి పోయాడు, మళ్లా ఏం తెచ్చిపెట్టబో తున్నారో అని భయపడుతూ. బసవయ్యా, రామిరెడ్డీ, లక్ష్మమ్మా కలిసి కొండణ్ణి పదిబూతులు తిట్టి, పోలీసుకు రిపోర్టు చేస్తామని బెదిరించి, కొరతపడ్డ వరికట్టల ఖరీదుకిందా, దొంగతనం చేసినందుకు అపరాధంకిందా వాడికి పదిహేను రూపాయలు జుల్మానా విధించి, ఆపైకం అప్పుడే రొక్క రూపంగా కట్టినాసరే, లేకుంటే లక్ష్మమ్మపేర రూపాయికి నెలకు అణా వడ్డీవంతున అప్పుపత్రం వ్రాసి యిచ్చినా సరే,

ఏదో విధంగా తీర్మానం చేయాలని కస్తీచేశారు. వారు చేసిన పంచాయితీకి కొండడికి కడుపు దహించుకొనిపోయింది.

"నన్ను అడ్డంగా పండబెట్టి ముక్కలు ముక్కలుగా నరికినా సరే నేను మాత్రం ఒక దమ్మిడీకూడా అచ్చుకో లేను" అన్నాడు వాడు. అట్లా అనేవరకు,

"నీ మదం అణుస్తా నుండరా! ఊళ్ళోవాళ్ళ సొత్తు దొంగతనంచేసి, తేరగా ఇంట్లో వేసుకొని తినడమను కొన్నావా" అని బసవయ్య గ్రుడ్లు వురిమి, లక్ష్మమ్మ సేద్య గాళ్ళలో ఒక గవండ్లవాణ్ణీ, ఒక గొల్లవాణ్ణీ పిలిచి "మీరు పోయి కొండడి ఇంటికాడ బర్రెగొడ్డును కొట్టుకుని రాండి. వీడేమో వొళ్ళు తెలియకుండా మాట్లాడుతున్నాడు," అని ఉత్తర్వుచేసేవరకు, ఇద్దరు సేద్యగాళ్ళూ ఆ క్షణంలోనే పోయి, కొండడు లక్ష్మమ్మకాడ వుండంగనే బర్రెను తోలు కొనివచ్చి, లక్ష్మమ్మపశువులదొడ్లో కట్టివేశారు.

"ఏం చేసినా చెల్లుబడి అవుతుందిగదా అని మీా రందరూ కలిసి చేస్తున్నారు ఈ పనులన్నీ. ఇంతకంటె మీారు నన్ను చెడగొట్టే దేముందీ? అన్ని పాపపుణ్యాలూ ఆ భగవంతుడే కనిపెట్టాడు లెండి" అని లోపల కుతకుత లాడే హృదయాన్ని తన నిస్సహాయస్థితివల్ల జనించిన వేదాంతంతో తృప్తిపెట్టుకొంటూ కొండడు ఇంటికి వెళ్ళి పోయాడు. ఇంటిదగ్గర తల్లీ భార్యా గోలు గోలుమని ఏడుస్తున్నారు. పొద్దు గుంకి ఇంటికి చేరిన మాల అమ్మ

లక్కలుకూడా పోగయి దవడలు నొక్కుకుంటూ నిలబడ్డారు. కొండడు తల్లినీ, భార్యనూ కూకలేసి ఏడుపు మానిపించి ఆ రాత్రి గంజితాగి పండుకున్నాడు.

తెల్లవారింది. కొండడు రెండు కట్టల వరికర్రలూ పోయినందుకు దుఃఖపడలేదు గాని, ఎట్లాలేదన్నా ముప్ఫయి రూపాయలు కిమ్మతుచేసే నిక్షేపంవంటి బర్రె పోయినందుకు మాత్రం కొంత విలపించాడు. వాకిట బర్రె లేక ఇల్లంతా బావురుమన్నది. ఎట్లాగైనా పైవారికి తెలుపుకొని, పోయిన బర్రెనుమాత్రం తిరిగి తెచ్చుకొందా మనుకొని మహా ద్రోల్లాడి నాడు. కాని భత్యఖర్చుకైనా చేతిలో దమ్మిడీ లేకపోయె! ఇక వ్యవహారం ఎట్లా జరపగలడు? అదిగాక బసవయ్య రాక్షసుడు; రామిరెడ్డీ, లక్ష్మమ్మా బలవంతులు. తాను పోయి, బర్రెను తీసుకుపోయారని ఏ పోలీసువారితోనైనా చెప్పుకుంటే, బసవయ్యా, రామిరెడ్డీ కలిసి, అసలు తన మీదికి తెచ్చిపెట్టిన దొంగతనం నేరాన్ని ఏ తప్పుడు సాక్ష్యమో సృష్టించి, పెంచి పెద్దదిచేసి తుదకు తన్ను ఏ జైలులోనైనా పెట్టిస్తారేమోనని భయపడ్డాడు కొండడు, ఎప్పుడూ ఇట్లాంటి లట్టాలు పడ్డవాడు కాదు కాబట్టి. వాడికి ముందు వ్యవహారం నడపడానికి ధైర్యంచాలలేదు. తాను దొంగతనం చేసినట్టు వచ్చిన అపనిందకే సగం చచ్చి తిరుగుతున్నాడు. 'దాని తాడు తెగిరి, పోతేపోయింది బర్రె!

నే నీతంటాలు పడలే'నని నిశ్చయించుకొని వూరుకున్నాడు కొండడు.

ఇంతలోనే తన గ్రామ జమాబందీ- తాలూకా కచ్చేరికాడ డిప్టీకలెక్టరుగారు ఇక నాలుగు రోజుల్లో జరుపుతారని తెలిసింది. రైతులు తమ కష్టసుఖాలను డిప్టీకలెక్టరుదొరతో చెప్పుకోవడానికై తలా ఒక అర్జీ వ్రాసుకొని జమాబందీ రోజున దొరదగ్గరకు పోతున్నారు. కొండడు తన కయ్యకి కాలవకోసరం పెట్టుకొన్న అర్జీల మీద ఇంకా ఉత్తరువులేమీన్నీ రాలేదు. జమాబందీలో దొరగారితో కాలవ సంగతి మొరపెట్టుకొని చెప్పుకొందా మని, కొండడుకూడా ఒక అర్జీ వ్రాయించుకొని తాలూకా కచ్చేరికి పోయినాడు. దొరగారికి దణ్ణంపెట్టి తనకు కాలవ యిప్పించవలసిందని కోరగా డిప్టీకలెక్టరు పక్కనున్న తహ సీలుదారువైపు చూశాడు. "గ్రామాల్లో పార్టీలు పెంచు కొని, తగవులాడుకొని, ప్రతీవాళ్ళూ కాలవలు కావాలని కోరుతున్నారు సార్! ఈ అర్జీదారుకు అరెకరా భూమి కంటే జాస్తిలేదు. వీడికికూడా ఒక కాలవ కావలెనంటే ఎట్లా వస్తుంది? ఒకరికి గనుక ఇచ్చినామంటే, ఇక ప్రతీ రైతూ తన ప్రతికయ్యకూ కాలవ ఇప్పించమంటాడు. ఇది సాధ్యం అయ్యేపనిగాదు సార్!"అని తహసీలుదారు జవాబు చెప్పాడు.

"అవునవును, మీరు చెప్పింది నిజమే"నంటూ డిప్టీ కలెక్టరు కొండడివైపు తిరిగి, "నీకు ప్రత్యేకంగా కాలవ యివ్వడానికి వీల్లేదు. నీ అర్జీ తోసివేశాం" అని ఉత్తరువు చేశాడు.

"అయ్యా! నేను బీదవాణ్ణండి; నా కయ్యకు నీళ్లు పారించుకునే ఆధారం లేదండి" అన్నాడు కొండడు.

"గ్రామంలో వెయ్యి, రెండు వేల ఎకరాలకు నీళ్ళు పారుదల అవుతూవుంటే నీ అరెకరా కయ్యకూ నీళ్లురావడం లేదంటే ఎవరైనా నమ్ముతారా?" అన్నాడు డిప్టీకలెక్టరు.

"లేదు సామీ! లక్ష్మమ్మగారూ, కరణం బసవయ్యగారూ కలిసి నన్ను అన్యాయంచేస్తున్నారు సామీ! నామీద చోరీనేరం మోపి నా బర్రెగొడ్డును తోలుకుని పోయారు సామీ! తమరు కటాక్షించకుంటే నా కయ్యను బీడెట్టుకుని పోవలసిందే సామీ!" అని కొండడు గోల చేశాడు.

"ఒరే! ఇది కచ్చేరీగాని, మీ మాలవాడ కాదు, తెలుసునా? నీ నడవడిక మంచిదయితే గ్రామంలో ఆసాములు నీరు రానియ్యకుండా ఎందుకు చేస్తారు? అరెకరా కయ్యగలవాడివి నువ్వు లక్షాధికారులతో తగవుపెట్టుకో వచ్చురా?" అన్నాడు డిప్టీకలెక్టరు.

"వీడు గజదొంగ సార్! వీణ్ణి కె. డి. రిజిష్టరులో చేర్చడానికి పోలీసు సబినస్పెక్టరుగారు రాసుకొనిపోయారు

సార్!'' అని అక్కడనే నిలబడివున్న కరణం బసవయ్య గారు ఆ కొరవ పూరించాడు.

"గొప్పవాళ్లతో ఎన్నడూ తగవు పెట్టుకోకూడ దురా! పో! పో! ఆలక్ష్మమ్మకాళ్లూ కడుపూ పట్టుకుని నలుగురితోపాటు నువ్వుకూడా నీళ్లు పారించుకో. పో! ఆమెతో తగవులు పెట్టుకోకు'' అన్నాడు డిప్టీకలెక్టరుదొర.

"అయ్యా! నామీద అబద్ధపుకేసు పెట్టి ఈకరణం బసవయ్యగారు అన్యాయంచేస్తున్నాడండీ'' అన్నాడు కొండడు. "జమాబందీలో అవన్నీ విచారించడానికి మాకు వీల్లేదు. నీ కేదైనా అన్యాయం జరిగితే సాక్ష్యం తెచ్చుకొని మేజిస్ట్రేటులోనో, సివిల్‌లోనో దావా పెట్టుకో. మే మేమీ చెయ్యడానికి వీల్లే''దని దొర ఇంకో అర్జీదారును పిలిచాడు. నెత్తిన గుడ్డవేసుకొని కొండడు ఇంటికి పోయాడు.

# 8

జమాబందీ అయిన మర్నాడే తాలూకాలో జరిగిన సంగతంతా లక్ష్మమ్మకు తెలిసిపోయింది; మాలవాడికి బాగా జరిగిందని చంకలు తట్టుకుంది. వ్యవహారం తమకు అనుకూలమై, కాలవ ఇవ్వడానికి వీల్లేదని దొర తీర్మానంచేశాడు కాబట్టి, అనుకొన్నప్రకారం ఫయిసలు చేయించవలసిందని రెవిన్యూ ఇనస్పెక్టరు లక్ష్మమ్మకాడికి కబురుచేశాడు. ఇప్పుడు చేతిలో దమ్మిడీ లేదని జవాబుచెబుతూ, కొండడికి పట్టా

కిచ్చిన కయ్యి మార్పించి తనపేర పట్టా తెప్పించినట్టయితే దానికీ, దీనికీకూడా కలిపి అనుకొన్నది ఇస్తానుగాని ఇప్పు డేమీ ఇవ్వడానికి వీలులేదని జవానుతో చెప్పి పంపింది లక్ష్మమ్మ. ఇంతలోనే కొండడు వచ్చి ఇనస్పెక్టరుకు దణ్ణం పెట్టి —

"సామీ! నాకు కాలవ తెప్పిస్తానంటిరి. ఆఖరుకు డిప్టీకలెక్టరుదొర ఒప్పుకోకపోయె! నా అయిదు రూపా యలూ నాకు పారెయ్యండి" అని అడిగాడు.

"ఇ దేమీ వంకాయలబేరం కాదు; కోరవ అయిదు రూపాయలూ నీవు అప్పుడే ఇచ్చివుంటే, నీ కీపాటికి కాలవ వచ్చేవుండును. స్వల్పంలో అజ్జాయించినందుకు వ్యవహారం ఇట్లా అయింది. చేతికి వచ్చిన పైకాన్ని వాపసుయిచ్చే ఆచారం మనదగ్గర లేదు, పో" అన్నాడు ఇనస్పెక్టరు పంతులు. ఉసూరుమంటూ కొండడు వెళ్లిపోయాడు.

కొండడికి చెడ్డరోజులు వచ్చినవి. లక్ష్మమ్మకు తన మీద ఇంత పగ ఎందుకో వాడికి అర్థంగాలేదు. ఆమెకు తోడు ఇప్పుడు బసవయ్యగారుకూడ పగవాడయినాడు. కాలం కర్మంకూడా ఒనగూడినట్లయింది వాడికి. ఎవరితో పోయి చెప్పుకోవడానికీ దిక్కుతోచలేదు. కయ్యికోసం తెచ్చిన అప్పు పెరిగిపోతోంది. లక్ష్మమ్మతో వ్యవహారం ముదిరిపోయింది. బసవయ్యపగ తాచుపగే; ఎప్పు డేంచేస్తా

డో అని దిగులు. వెనకటి గుండెనిబ్బరం చెడింది. ధైర్యం పలచబడుతోంది కొండడికి.

ఇంట్లో కూటికి గింజలు లేక, ఆమరునాడు చీకటితో నే తన కుప్ప తొక్కించాలని ఆరోజు తనూ, తనభార్యా యిద్దరూ పొలంపోయి కళ్లం బాగుచేసి వచ్చారు. మాల వాడలో నే పది పశువులని సంపాదించుకొని తెల్లవారుజామున పోయి కుప్ప పడగొట్టా లనుకుని ఇద్దరు కూలివాళ్లను మాట్లాడుకొన్నాడు. నెల పొడవంగనే లేచిపోదా మనుకొని పెందలకడనే నడుం వాల్చాడు కొండడు.

జమాబందీలో కొండడు డిప్టీకలెక్టరుదొరతో చెప్పిన నేరాలకు బసవయ్య ఉగ్రుడై ఉన్నాడు. "దమ్మిడీకి కొరగాని పక్షి పల్లీకులో వచ్చి బ్రాహ్మణ్ణి- నామీద దొరదగ్గిర తంటాలుచెప్తాడా? హుం! నేను నియోగిబిడ్డను. వీడికి నా మజా ఇంకా తెలియదు. ఇంతవరకూ వచ్చింతర్వాత వెనక్కి తిరిగితే పంతులు ఆఖరికి మాలవాడిచేతిలో చిక్కి కొన్నా డంటారు నలుగురూను. ఇక గ్రామంలో వాడైనా కాపురం ఉండాలె, నేనైనా ఉండాలె. వీడి అంతు పట్టి చూస్తా" అని బసవయ్యపంతులు పరవళ్లుతొక్కుతున్నాడు. కొండణ్ణి పిలిపించి సమక్షంలో వాణ్ణి నాలుగు బూతులూ తిట్టి పంపడం అంటే ఆయనకు తృప్తి కాలేదు. శాశ్వతంగా

నిలిచేటట్టు వాడికి తగిన వాత వేయాలని తీర్మానం చేసుకొన్నాడాయన. తాను వేసుకొన్న ప్లానుకు ఇక కొండడితో మాట్లాడకపోవడమే మంచి దనుకొన్నాడు. తన హృదయగోళంలో ప్రజ్వలించే క్రోధాగ్ని ప్రత్యక్షంగా బయలుపడి శత్రునాశనం చేయవలసిందేగాని దాన్ని బయటపెట్టకూడ దనుకొన్నాడు బసవయ్యపంతులు.

సాయంత్ర మయింది. బీదలను హింసించే దుర్మార్గుల చర్యలను చూడలేకేమో సహస్రకరుడు ప్రాపంచికదృక్పథాన్నుండి చాటుకు పోయాడు. ఆ అసురసంధ్యవేళ బసవయ్యా రామిరెడ్డిని పిలుచుకొని లక్ష్మమ్మఇంటికి పోయాడు. బసవయ్యకూ లోకానికీకూడా అంధకారం అలుముకొంది.

"పంతులూ! ఆ కయ్య మనకు దఖలుపడేటట్టు చేస్తూ. నీ ధర్మాన కాలవ పోనేపోయింది! మాలవాణ్ణి మటుమాయం చేసి కయ్యలో కయ్య కలుపుకొనేదాకా నాకు నిద్ర పట్టదు. పంతులూ!- ఇదిగో, ఈపని నీ చేతిలోనే వుంది" అని లక్ష్మమ్మ అనేవరకు, "తొందరపడకు. వాడికి అంత్యకాలం సమీపించిందిలే; ఇప్పుడు నేను వచ్చింది అసలు ఆ పని కొరకే" అంటూ పంతులూ, రామిరెడ్డీ, లక్ష్మమ్మా మిద్దె మీదికి పోయి, ఒక అరగంటసేపు ఏమేమిటో గుసగుసలాడుకొన్నారు. సరేనంటే సరేననుకొని అందరూ మిద్దెదిగి కిందికి

వచ్చారు. ఎవరిదారిన వాళ్లు వెళ్లారు. బసవయ్య ఇంటికి పోయి ఉడుకునీళ్ళు పోసుకొని సాయంసంధ్య వార్చుకొని భోజనంచేసి పండుకొన్నాడు.

కొండడిఇంట్లో కొండడు నిద్రపోతున్నాడు. బసవయ్య ఇంట్లో బసవయ్య నిద్రపోతున్నాడు. జగత్తంతా నిద్రపోతున్నది, ఒక్క లక్ష్మమ్మతప్ప. లక్ష్మమ్మ కాదినం ఏకాదశీపర్వదినం. నిద్రపోలేదు. జాగారంచేస్తోంది. తనతో పాటు రామిరెడ్డినికూడా మేలుకోబెట్టి అతనివల్ల భాగవతం చదివించి వింటోంది. రామిరెడ్డికీ ఆత్రంగానే వుంది—పడుకొంటే బాగుండుననేమో.

నెల పొడిచి కొండణ్నీ, వాడిభార్యనూ నిద్రలేపింది. కూలివాళ్ళను కేకేసి చద్దన్నం మూటకట్టుకొని, పశువులను తోలుకొని కొండడూ, వాడిభార్యా కుప్పకాడికి బయలుదేరారు. ఒక పావుగంటసేపటికి వాళ్లు కుప్పకు కనుచూపుమేరదూరంలోనికి వచ్చారు. చూస్తాడుగదా తేరిపారి కొండడు, పొగా మంటా కనపడింది, వాడికి తన కుప్పవున్న స్థలంలో. ఇదేమా అని వాడికి గుండె బేజారయింది. నవనాళ్లూ క్రుంగిపోయాయి. ఒళ్లు తెలియలేదిక. గుండెలు కవుక్కొంటూ ఒక్కటే పేరెంతీశాడు కొండడు కుప్పకాడికి.

వచ్చాడు కొండడు. మండుతూన్న కుప్ప కెదురుగ్గా నిలబడ్డాడు. అప్పటికే కుప్ప నలువైపులా అగ్నిహోత్రుడి సందిట్లో చిక్కుకొంది. చిటపటమంటూ బ్రహ్మాండంగా మండిపోతోంది. తూర్పుగాలి అందుకొని అగ్నిహోత్రుడికి తోడయింది. ఎవరితరం ఆర్పడ మిక ? ఆకాశానికంటా ఎగసిపోయే ఆ మంటలకు కొండడివాళ్లుకూడా మంటలెక్కిపోతోంది. మొగాన నెత్తురుచుక్క లేదు. చూశాడు చూశాడు కుప్పకేసి ; నివ్వెరపోయి వెర్రిచూపులు చూశాడు. చైతన్యం స్తంభించిపోయింది. మండుతున్న కుప్పకేసి కొయ్యబారిపోయి చూస్తూ కుప్పగూలిపోయాడు కొండడు.



# బిళ్లల మొలతాడు

పల్లిపోతువారిది చాలా ప్రఖ్యాతిచెందిన కుటుంబం. రామిరెడ్డి తండ్రి పల్లిపోతు కృష్ణారెడ్డినిగురించీ, ఆతని తండ్రి వెంకురెడ్డినిగురించీ రెడ్డిగారి పల్లెలో ఇప్పటికీ కథలు చెప్పుకొన్నట్టు చెప్పుకొంటూ ఉంటారు. ధాత కరువులో వెంకురెడ్డి బీదలకుచేసిన అన్నదానం, గ్రామానికి ఆధారభూతమైన చెరువు వర్షాకాలంలో గండిపడి ప్రజలకీ పైర్లకీ అపాయం కలిగించే స్థితిలో చెరువుకట్ట కాపాడడానికి ఆరెడ్డి ఒక్కడూ చేసిన కృషీ, బాటసార్లు బసచేయడానికి కట్టించిన ధర్మసత్రాలూ - ఏమేమిటో ఆ రెడ్డినిగురించి రైతులు తలచుకోని రోజుండదు.

కృష్ణారెడ్డికూడా అరవయినాలుగేళ్లు జీవించి షష్టిపూర్తి ఉత్సవం చేసుకొని తన హయాం గౌరవంగానే గడపుకొన్నాడు. కాశీ, రామేశ్వరం వగైరా తీర్థయాత్రలు సేవించి గ్రామంలో రామలింగేశ్వర స్వామికి ఏకాదశరుద్రాభిషేకం చేయించి అష్టాదశవర్ణానికీ బ్రహ్మాండంగా భరద్వాజ విందు చేశాడని బీదలు అతన్ని అమితంగా తలుచుకొని దణ్ణం పెట్టుకొంటూ ఉంటారు.

కృష్ణారెడ్డికి నలుగు రాడసంతానం తర్వాత కలిగిన పిల్లవాడు రామిరెడ్డి. తాను జీవించి ఉండంగనే నలుగురు కూతుళ్లనీ సంపన్న గృహస్థుల యిండ్లలో ఇచ్చి వివాహాలు

చేసి, తర్వాత కొడుకు రామిరెడ్డికి కూడా ఓ అయినయింటి పిల్లని పెళ్ళిచేసి అయిదారేళ్ళ క్రిందటనే కాలంచేశాడు కృష్ణారెడ్డి. చిరకాలానికి కలిగిన మొగపురుగు కాబట్టి రామిరెడ్డి అంటే ఆ తల్లికీ ఆ తండ్రికీ అబ్బురంగా ఉండడంలో ఆశ్చర్యం లేదు. స్వార్జిత పిత్రార్జితాలు నూరెకరాలు మాగాణిభూమిగాక, రామిరెడ్డికి దౌహిత్రరీత్యా సంక్రమించిన ఏభయ్యెకరాల మాగాణీ, మెట్టలూ, పశువులబీడూ, ఆవులూ, కోడెలూ సమస్తమూ అమర్చి పెట్టినట్టు చేతిలో పెట్టి మరీ కాలంచేశాడు కృష్ణారెడ్డి. ఈ ఆస్తిగాక భేషయిన రెండుమండువాల లోగిలీ, ధాన్యపు కొట్లూ, దొడ్లో అరటి తోటా, కొబ్బరితోటా, ఆడవాళ్ళ వంటిమీద బంగారు నగలూ, వెండి సామానూ—ఒకటేమిటి, సిరి అందుకోనంత కాలమేగాని, అందుకొంటే ఆ తల్లి అనంతమైన ఆకారాలతో అవతరిస్తుంది.

రెడ్డిగారిపల్లెలో గల నూట ఏభయి లేతకాపుల కుటుంబాలలోనూ రామిరెడ్డి కుటుంబం మకుటాయమానంగా ప్రకాశించి పోతోందని ఇక వేరే చెప్పాలా? రామిరెడ్డికి ఇంటా, బయటాకూడా కావలసినంత బలం, బలగమూను. ముప్ఫయ్యేండ్లయినా నిండని వయస్సూ, తండ్రి సంపాదించి యిచ్చిపోయిన ఆస్తీ. గ్రామంలోని రైతాంగం యావత్తూ తనకి బీరకాయ పీచు చుట్టరికం. పైగా వంశపారంపర్యంగా వస్తున్న గ్రామమునసబు అధికారం—బంగారానికి వెలిగా

రం అతికినట్లు ఒకదాని కొకటి అతుక్కొని అతని జీవితాని కందమే కలుగజేస్తున్నవి.

తాతతండ్రులు సంపాదించి ఇచ్చిన ఐశ్వర్యం ఎంత ఉన్నప్పటికీ అసలు జన్మతః మనిషిలో ఒక విధమైన తెలివీ తేటా, డాబూ దర్పం ఉండకపోతే ఆ ఐశ్వర్యానికిగాని, అతగాడి జీవితానికిగాని రాణింపూ, ఎన్నికా సిద్ధించదు. భగవంతుడు రామిరెడ్డికి ఆ కొరతా తీర్చాడు. ఆ మాటకి వస్తే అతగాడి చలాకీకీ, అతని ఆలోచనలకీ, దర్జాకీ తగిన ఆస్తి కానేకాదేమో ఆ తండ్రియిచ్చిన ఐశ్వర్యం.

వాళ్లు విరుచుకొని పెద్దచదువులు చదివి ఉద్యోగాలూ ఊళ్లేలడాలూ అవసరంగల కుటుంబం కాదు కాబట్టి, ప్రస్తుత కాలమానాన్ని బట్టీ, సంప్రదాయాన్ని బట్టీ, స్కూలుఫయి నలువరకూ మాత్రమే చదివి పరీక్షకు కూర్చొని ఫేలయి ఊరుకున్నాడు రామిరెడ్డి; ఫేలయిన పరీక్ష ఎంగిలి కూడు వలెగా రోతనిపించి దానిని కాలిచెప్పును విసర్జించినట్లు విసర్జించి, తండ్రి గతించిన వెనుక సంక్రమించిన సంసార భారాన్ని భుజాన వేసుకుని ఈదులాడుతున్నాడు.

ఈదులాడడానికి - రామిరెడ్డికీ సంసారం ఒక లెఖ్ఖా, జమా, ఖర్చా? అందులో యుద్ధం వచ్చి బ్లాకు మార్కెట్టులో పుట్టి వడ్లు నూటఏభయి, రెండువందలు అమ్మే రోజులేమో—అతను పట్టినదల్లా బంగారం ముద్దయి పోతోంది. చేటలో వడ్లగింజ పడవేస్తే బంగారాన్ని బలికోరు

తోంది. ఏరువాక తిరిగి ఏరువాక అందుకొనేసరికి, కుప్పల మీదనే బేరం తెగ్గొట్టి సంవత్సరానికి హీనపక్షం ఇరవయి ముప్ఫయివేలదాకా ఇనప్పెట్టెలో విసిరిపారేస్తున్నాడు అతడు.

పేరుకు పెద్దకుటుంబం అన్న మాటే గాని, ఇంట్లో తినేవాళ్లు మాత్రం ఎవరున్నారు? తనూ, తన భార్యా, తల్లీని. ఒక కొడుకూ, ఇద్దరు కూతుళ్లూ తనకి కలిగారు గాని వాళ్లింకా కసుగాయలు. ఎటువచ్చీ ఈ రెండు వందలెకరాల కమతమూ, సేద్యం నాద్యం, గొడ్డూ గోదా, దూడా దుడికీ–వీటిమీద అజమాయిషీ చేసుకొంటూ కయ్యలో పండిన ధాన్యం గడపలో చేరేవరకే అతగాడికి తాపత్రయం. ఈ తాపత్రయం కూడా లేకుండా కరుణించి యానాది సుబ్బడిని రామిరెడ్డికి ప్రసాదించాడు భగవంతుడు. ఇంత లావు కమతంమీదా సుబ్బడు అహోరాత్రాలూ కంటిలో వత్తి వేసుకొని, గడ్డిపోచకూడా అన్యాక్రాంతం గాకుండా కాపాడుతున్నాడు. సుబ్బడు రామిరెడ్డికి గుండెకాయ అయిపోయినాడు.

## 2

సుబ్బడు మంచి యానాదివాడు. యానాదులలో మంచి యానాదులనీ, చల్లా యానాదులనీ రెండు తెగలు.

చల్లా యానాదులు ఎంగిలి విస్తరాకులలో పారేసిన కూడు తింటారు; మంచియానాదులు తినరు.

సుబ్బడి తండ్రి పాపడు కృష్ణారెడ్డి తండ్రి హయాం నుండీ ఆకుటుంబాన్నే అంటిపెట్టుకొని జీవించాడు. చిన్న తనంలో పాపడు వెంకురెడ్డి ఎక్కే తెల్ల గుర్రాన్ని మేపుతూ, మాలీసుచేస్తూ నౌకరీచేసేవాడట. వెంకురెడ్డి ఆగుర్రం ఎక్కి ఏ ముసాఫరుకు వెళ్లినా ఆగుర్రం వెంబడే పాపడు కూడా వెళ్లవలసినదేనట. గుర్రంనడకతో నడకా, తరటుతో తరటూ, గాలపుతో గాలపు—దానితోక పట్టుకొని ఎంత దూరమైనా కూడా పరుగుతో పోయేవాడట పాపడు. వెంకురెడ్డి గతించినతర్వాత కృష్ణారెడ్డి గుర్రపుస్వారీ చేసే రోజులలోకూడా పాపడు అదేప్రకారం ఖామందువెంట పోయే వాడటగాని, కొంతకాలం గడిచేసరికి పాపడికి ఈ పరుగువల్ల గుండె జబ్బు ఏర్పడి ఖాయిలాతో మంచాన బడేవరకు, కృష్ణారెడ్డికి మనస్సు కరిగి, ఇంక తాను గుర్రము ఎక్కడం లేదని ఒట్టు పెట్టుకొని ఆగుర్రాన్ని అయిన కాడికి అమ్మిపారేశాడని అనుకొంటూ రాగ్రామంలో. మొత్తానికి పాపడు జీవించినన్నాళ్లూ పల్లిపోతువారి కుటుంబాన్నంటిపెట్టుకొనే జీవించి కృష్ణారెడ్డికంటే పదేళ్లు ముందుగా చనిపోయినాడు. పాపడు జీవించి ఉండంగనే కలరా తగిలి చనిపోయింది వాడి భార్య చెంచి. చెంచి చనిపోయేవరకు సుబ్బడి కయిదో ఏడు.

## సన్నజీవాలు

పాపడికీ, చెంచికీ కలగడానికి ఓ అయిదారుగురు పిల్లలు కలిగారు గాని ఏం క్రియ? చెంచి చనిపోయేసరికి పాపడికి దక్కిన బిడ్డడు సుబ్బ డొక్కడే. తల్లి లేని ఆ అయిదేళ్ల పిల్లవాడుకూడా గతించిన సంతానం లాగునే తనకు దక్కడని పాపడు నిరాశ చేసుకొని వాడిని పెంచ డానికి చేతగాక ఒకమారూ, కష్టమనిపించి ఒకమారూ సుబ్బడివిషయమై తాను తాపత్రయపడేవాడే కాదు. రాత్రిగాని, పగలుగాని తనేదయినా పనిమీద పోవలసివుంటే, సుబ్బడిని ఏ గడ్డివామిలోనో పండబెట్టి గడ్డికప్పి వెళ్లి పోతుండే వాడు. చెంచి గతించిన తర్వాత సుబ్బడి యోగ క్షేమాలు, పాపణ్ణి కృష్ణారెడ్డిభార్య లక్ష్మమ్మ అప్పుడప్పుడు విచారిస్తూ ఉండినప్పటికీ, ఆ కుర్రకుంక గడ్డివాముల్లో పెరుగుతుండినట్టు ఆమెకు తెలియదు. తన దొడ్డిలో అరటి తోటలోని గుడిసెలో పాపడిచేతుల్లో పెరుగుతున్నాడనే ఆమె గమనం.

ఒకనాడు ఉదయం లక్ష్మమ్మ తన పశువుల దొడ్డిలో ఆవుపాలు తీయించడానికి పోగా, గుంజకు కట్టిన ఆవు మేత మేయడం చాలించి కొమ్ములతో ఆ తట్టుగా లాక్కొని బుస్సుమంటూ మీదపడుతోంది. మళ్లా అంతలోనే గడ్డి వేసిన గాటిలో దేనినో నాలుకతో నాకుతోంది. లక్ష్మమ్మకి అర్థం గాక సమీపించి చూచేసరికి, ఆ తట్టు నల్లని కృష్ణ సర్పం ఒకటి గజం ఎత్తున పడగఎత్తి చీలిన నాలుకలు

చాచి బుస్సుకొట్టుతూ తల నేలనేసి కొట్టుతోంది. ఆవు తిరిగి కొమ్ములతో కుమ్మబోయి గాటిలో నాలుకతో నాకు తోంది. పామును చూచేసరికి 'అమ్మో' అని అరిచింది లక్ష్మమ్మ. ఎత్తిన పడగ దించి పడమటగా పాకిపోయింది సర్పం. గాటిలో ఆవు నాకుతూ ఉండిన అయిదేళ్ల పిల్ల వాడు - సుబ్బడు - కళ్లు నులుముకొంటూ లేచి కూర్చు న్నాడు. ఆమె గుండెలు కొట్టుకొని వాణ్ణి ఇంట్లోకి తీసుకొని పోయి, ఆ క్షణంలగాయతు సుబ్బడు తన తండ్రితో ఉండ డానికి వీలు లేదని, వాణ్ని తన యింటిలోనే పెట్టుకొని, కొడుకు రామిరెడ్డితో సమానంగా పెంచుతూ వచ్చింది లక్ష్మమ్మ. తనకి సగంపీడ వదలిందని తల తడుముకొన్నాడు పాపడు.

సుబ్బడికి పదేళ్లు వచ్చేవరకూ బ్రదికాడు పాపడు. వాడు గతించిన తర్వాత సుబ్బడికి కృష్ణారెడ్డి తండ్రీ, లక్ష్మమ్మ తల్లీ, రామిరెడ్డి అన్నా అయిపోయినారు.

ఆ సంసారంలో తన కేమి కొరత? వేళకు పిడికెడు మెతుకులు. శాస్త్ర గ్రాహ్యం తెలిసే ఈడు వచ్చేవరకు, ఇంట్లో పాడిపశువులను బయటకు తోలుకొనిపోయి మంద బయట తిప్పుకొనివస్తుంటే ముప్పూటలా కడుపునిండా అన్నం పెట్టుతూనే ఉన్నది లక్ష్మమ్మ. రామిరెడ్డి బడికి పోతుంటే సుబ్బడు అతగాడి పుస్తకాలు బడికి తీసుకొని

పోయి, తాను బఱ్ఱెగొడ్లను బయటికి మళ్ల వేసుకొని వస్తున్నాడు.

కాలం పెరిగినకొద్దీ ఇటు రామిరెడ్డీ, అటు సుబ్బడూ కూడా పెరుగుతున్నారు. ఇద్దరి వయస్సులో నాలుగయి దేళ్లు తేడా ఉండినప్పటికీ, యుక్తవయస్సు వచ్చేసరికి పొడగట్టిన యౌవనంలో మాత్రం అట్టి తేడాలు కనిపించడం లేదు. రామిరెడ్డి కేమి-మహారాజు బిడ్డ; ఇరవయ్యేళ్లు నిండ కుండానే తండ్రి బంగారువంటి పిల్లని పెండ్లిచేసి పెద్దవాణ్ణి చేశాడు.

ఒకయేడుమీద మరొక యేడు పడేవరకు, సుబ్బడు, పద్ధెనిమిదేళ్లకే పాతికేళ్ల మనిషిలా తయారయినాడు. వీధిన బడి పోతూంటే వాణ్ణి చూస్తే దిష్టి తగులుతుందేమో నన్నంత భయం కలుగుతోంది. నల్లని జీడిగింజ రంగు శరీరం నిగనిగ మెరిసిపోతోంది. సృష్టిలోని యౌవనం కరిగించి పోసిన విగ్రహం—ఉక్కుగుండులా బిరుతేలింది ఆకారం. రెండు హస్తాలూ జోడించి పట్టినగాని అందడంలేదు కండలు తిరిగిన దండలు. ఆ యీడుకే ఆరడుగుల ఎత్తు - ఆజాను బాహువయిపోయినాడు సుబ్బడు. మూతి మీది నూనూగు మీసం, కళ్ల మీది కనుబొమలు, సన్నని నల్ల ముఖమల్ పట్టులా నిగారింపుతో మిరుమిట్లు గొల్పుతున్నవి. ఆ ముఖ వికాసంలో తెల్లని నేత్రాలు వాని ఆకారానికి ఎంతశోభ

తీసుకొనివచ్చినవి! పురుషునికి గాని, స్త్రీకి గాని నవయౌవనం కంటె మించిన ఐశ్వర్యం మరొక టేమున్నది?

తన చేతుల్లో స్వయంగా పెంచిన లక్ష్మమ్మకే గాదు, అసలు గ్రామంలో అశేషజనానికి కూడా సుబ్బడు యానాది వాడన్న సంగతి విస్మృతిలో పడి పోయింది. అటువంటి మనిషి యింట్లో తిరుగుతుంటేనే చాలునన్నంత మోహనంగా ఉన్నది వాడి మోహనాకారం. అటువంటి సుబ్బడు తనకు బానిసీడు, తనబంటు అయినాడంటే రామిరెడ్డి కెంత గర్వం!

సుబ్బడిమీద పెరిగిన ప్రేమవల్ల లక్ష్మమ్మ వాణ్ణి 'సుబ్బులూ' అని ముద్దుగా పిలుచుకోవడమేగాని 'సుబ్బా' అని పిలవడం కొన్ని ఏళ్లుగా మరచిపోయింది. అదిగాక వయస్సు వచ్చి పెద్దవా డవుతుండినందువల్లా, వానియందు పొడగట్టిన పెద్దగుణములవల్లా, లక్ష్మమ్మకేగాదు గ్రామస్థులకు కూడా వానియందు గౌరవమూ, ప్రేమా ఏర్పడి, ఎవరుపిలిచినా 'సుబ్బులూ' అనే పిలుస్తూ వస్తున్నారు.

సుబ్బులుది మొండిధైర్యం. నదురు లేదు, బెదురు లేదు. రాత్రి ఎరగడు, చీకటి ఎరగడు. పా మెరగడు, పురు గెరగడు. అర్ధరాత్రి జోరున పిడుగులుపడే వర్షంలో నయినా పొలం పోవలసి ఉంటే ఆపని మీద ఒక్కడూ పోవలసినదే. రెండేళ్ల క్రిందట రాత్రిపూట పొలంలో వడ్లకళ్లం దగ్గర ఒంటరిగా పడుకున్నప్పుడు, ప్రక్కన కాపలా

కాచే కుక్కని పట్టుకోను వచ్చిన చిరుతపులిని చేతిబరిశె తీసుకొని పొడిచిన పోటుకు, అంత లావు పులీ ఆవులించి ప్రాణం విడిచింది. బరిమీద పరుగుపెట్టే తాచుపామును తోకపట్టుకొని నేలనేసి కొట్టుతానని బయలుదేరుతాడు సుబ్బడు. అట్లతద్ది పండగకి, అమ్మవారి దేవళాని కెదురుగా మర్రిచెట్టు కొమ్మకు కట్టిన ఉయ్యాల ఊగడానికి వచ్చిన అట్లతద్ది ఆడపడుచులను ఉయ్యాలలో కూర్చోబెట్టి జనపనార మోకు పట్టుకొని ఊపడంలో, ఉయ్యాలతో కూడా ఆకాశంవరకూ లేచి సుబ్బులు క్రిందికి దూకుతుంటే ధణా ధణా అని అదిరిపోతుండేది భూమి. వాని చేత ఉయ్యాల ఊపించుకోను ఆ వూరి కాపు పడుచుల కెంత మనసు!

ఇక వ్యవసాయకృషిలో సుబ్బులుకు తెలియని పని లేదుగదా! అటు వడదుక్కిలోగాని, ఇటు రొంపిదుక్కిలో గాని, వాడు కయ్యలోదిగి నాగేటి మేడితోక పట్టుకొంటే, పదేసివందల రూపాయలు కిమ్మతుచేసే రెడ్డిగారి పెద్ద ఎద్దుల జతకూడా గడగడలాడి పోవలసిందే. వాడి చేత్తో గుంటక తోలి, నల్లమానూ, కర్రలమానూ ఒక్కసారి అట్లా ఆడిస్తే చాలు—నుసుకు అంతా పోయి కయ్య అలా ఉండవలసిందే. నాగేటిఅర్రు మీదపెట్టి, వారిణ బిగించి పణతకొయ్య ఆరు పట్టుకొని, వాడు చాలు తోలితే, ఒక్క మడకతోనే కయ్య పదును తేలి చాడ వేసుకోవచ్చు. విత్తనం ఏ అదున్న చల్లాలో, ఏ అదునులో యారాలు కట్టి పులకవాముడు

తీసి కయ్య ఆరగట్టాలో - సుబ్బులుకు తెలిసినట్టు మరొక సేద్యగాడికి తెలియదని అనుకొంటారు. సరిగదా, ఏరువాక వచ్చి, విత్తనాల పట్టులో గింజ చల్లాలంటే వినాయకుడికి పెట్టుకుని ముందు సుబ్బులుచేత్తో గింజ చల్లిస్తుంది లక్ష్మమ్మ. వాడిచెయ్యి పట్టితే బంగారు పండుతుందని గ్రామంలో ప్రతీతి.

పుట్టకలగర కట్టి మిట్టలు తేలబెడతాడు. మోపు పైకి లేచేసరికి రెండు మూడు కలగరలు పెట్టి నీళ్లు నిల వేస్తాడు. వ్యవసాయంపను లారంభించిన గడియ మొదలు కొని, ఆపైరు ఫలితానికి వచ్చి, పండిన గింజలు ఇంట్లోకి చేరేవరకూ సుబ్బులుకు నిద్రపట్టదు. ఎక్కడెక్కడ ఏయే కయ్యలో నీళ్లు పులక తేలిపోయారో, ఏ కయ్య ఆరగట్టాలో, ఏ కయ్యకు నీళ్లు ఎద్దడయినాయో—అబ్బ! సుబ్బులుకున్న మెలకువ రామిరెడ్డి కేదీ! మొలకచేను మీాద రాత్రిళ్లు చిలవపక్షులు వాలకుండా కిరసనాయిలుడబ్బా చేతపట్టుకొని తెల్లవారులూా అట్లా రాంభజన చేస్తూనే ఉంటాడు సుబ్బులు.

ఒక్కటేమిటి - వరినాట్లు అయిన క్షణం లగాయతు సుబ్బులుకు కయ్యలోనే కాపరం. రెడ్డిగారిచేలో ముళ్లపాచి కనిపించిందంటే వానికి వంటిమీాద ముళ్లు గుచ్చుకొన్నట్లుం టుంది. తుంగా, గాబా, ఊదరా కోయించి, కలుపు తీయించేవరకూ ఊరుకోడు సుబ్బులు. కయ్యలో పైరు పాలు పోసుకొని, సుంకుమీాద పొట్ట తేలి, కరుగు మోపిం

దనేవరకు - ఇక సుబ్బులుసంతోషం చెప్పలేము. కరుగు మోపిన పైరు ఎర్రబారి, అరు వంచిందనంగనే - మంచి రోజు చూచుకొని, రెడ్డిగారిచ్చే కొత్తపంచలు కట్టుకొని, ముఖాన్న కుంకుమ అద్ది, కయ్యలో వంగి, మూడు పిడికిళ్లు పిడితరిగి, వినాయకుడికి వోదెవెయ్యడం ఎప్పుడబ్బా అని వాడికి ఒకటే కలవరింపు. పైరు కోతకి వచ్చిందనేసరికి, వడ్లాబత్తుడు అచ్చయ్య కొలిమికాడికి పోయి, దగ్గర ఉండి ముందు తన కొడవలికి చందనపు పిడీ, ఇత్తడి పొన్నూ తరిమిణి పట్టించి కక్కు కోసి సరిపించేవరకూ వాడికి స్తిమితమేదీ? పొలంపని అంటే ఆ సంతోషమేమో చెప్పలేము. పుష్యమాసంలో పెద్దపండగ చేసుకొని, వరికోతలకు జనం వొంగుతున్నారనంగనే-ఎప్పుడు పేడించిపెట్టాడో వెయ్యి పనకట్టలు పేడించిపెట్టాడు సుబ్బులు. అట్లా కోసిన పన, వోదెవేసేవాళ్లు వేస్తుంటే, ఇట్లా కుప్పలు వేసేవాళ్లు వేస్తుండవలసినదే. ఇంతలావు కమతంమీందా ఎక్కడుంటాడో, పనివాళ్ళని వెయ్యికళ్లతో కనిపెట్టుతుంటాడు. కుప్పవేయడంలో పనివాళ్లు బద్ధకించి ఎగాదిగా వేసినట్టు కనిపించినా-- చేతిలో తట్టుపలకా, తానూ తయారు. కరుగూ, అద్దా, చూపూ - తాను స్వయంగా వచ్చి, తట్టితేనేగాని వానికి తృప్తిలేదు. సుబ్బులు కప్పిన కుప్ప ముద్దులు మూటకట్టుతుందని ఆవూళ్లో పెద్దపెద్ద ఖామందులే వాడికి కితాబులు చెల్లించారు.

రెడ్డిగారి కమతంలో ఉండడానికింకా ఉన్నారు తలమనుష్యులూ, సేద్యగాళ్లూను. కాని వాళ్లందరికీ సుబ్బులంటే సింహస్వప్నం. వొళ్లు దాచి పనిచేయడానికి వాళ్లకి గుండె లేవీ? ఒకానొక పట్టులో రామిరెడ్డి నయినా కళ్లు గప్పడానికి వీలున్నదిగాని, సుబ్బులుని మరిపించడానికి వాళ్లకు వీలేదీ?

## 3

సుబ్బులుకు పాతికేళ్లు నిండినవి. తన పనేమో-అంతే. ఇక రెండో ప్రసక్తి అతగాడికి కాబట్టదు. తనతో సమానంగా పెరిగిన రామిరెడ్డి పెళ్లిచేసుకొని అప్పుడే ముగ్గురుబిడ్డల తండ్రి అయినాడు. తన జీవితంలో యౌవనం వికసించి విజృంభిస్తోంది. సుబ్బులుకుకూడా వివాహం జరగవలసిన రోజులు.

"పిల్ల చదువు చాలించి యింటికాడనే ఉంటున్నది. ఇప్పటికే ఇద్దరికీ పెళ్లియీడు తప్పింది. రెడ్డిగారి మాట తీసుకొని తొందరగా వచ్చి పెళ్ళిచేసుకొని వెళ్ళవలసిం"దని ఏటిఅవతల కమ్మవారిపాలెంనుండి సుబ్బులు మేనమామ జువ్వాడు కబురు చేశాడు. ఇంక ఆలస్యం చేయడానికి వీలు లేదని లక్ష్మమ్మ దగ్గరికిపోయి, "అమ్మా!" అని పిలిచాడు సుబ్బులు.

"ఏమి నాయనా!" అన్నది ఆ అమ్మ.

"ఏటి అవతలనుండి, మా మామ, నన్ను రమ్మని కబురు పంపాడు. పోయివస్తాను" అన్నాడు సుబ్బులు.

"అక్కడ మీవాళ్ళందరూ బాగున్నట్లేనా ?" అని ఖంగారుపడుతూ, అడిగింది లక్ష్మమ్మ.

"అందరూ బాగానే ఉన్నారు. పిల్లకి పెళ్ళిచేయాలి, ఒకసారి వచ్చి మాట్లాడిపొమ్మని కబురు చేశాడు మామ" అన్నాడు సుబ్బులు.

"మేనమామకూతుర్ని పెళ్ళి చేసుకొంటావురా! నా తండ్రి. తప్పక వెళ్ళి తొందరగా రా. పెళ్ళికొడుకుని చేసి పంపుతా"నని సుబ్బుల్ని దీవించి పంపింది లక్ష్మమ్మ.

సుబ్బులుమేనమామ జువ్వాడు మొదటినుంచీ కమ్మవారిపాలెంలోనే కాపురం. రెడ్డిగారిపల్లె లేతకాపుల కెట్లా ఆటపట్టయిందో, కమ్మవారిపల్లె కమ్మవారి కావిధంగా ఆలవాలమైపోయింది. ఆవూరికీ ఈ వూరికీ నడుంగా చిలకలేరు అడ్డం. ఎన్నడో ఇక్ష్వాకుల కాలంలో ఆవూరి కమ్మవారికీ, ఈవూరి రెడ్లకీ సమైక్యత కలిగి మమేకంగానే ఉంటూ వచ్చారటగాని, ఇటీవల పాతిక ఇరవయ్యేళ్ళనుండి మనస్పర్థ లేర్పడిపోయినవి. పాతికేళ్లక్రిందట, ఎందుకు వచ్చిందో - ఈ రెండు ఊళ్లకీ నడుంగా ఉండవలసిన పొలిమేరనిర్ణయం విషయంలో వారికీ వీరికీ పెద్ద తగాదా పడిందని అంటారు.

చిలకలేరు ఇవతలగట్టువరకూ మాపొలిమేరే అంటారు కమ్మవారు. అట్లా కాదు, అవతలగట్టువరకూ రెడ్డిగారి పల్లెపొలిమేరే అంటారు రెడ్లు. చిలకలేటిని పూర్తిగా తమ తమ పొలిమేరలలో చేర్చుకోవాలని ఆ యిరుపక్షాలవారికీ పట్టుదల. ఇంతకీ ఈపొలిమేరతకరారు రావడానికి కారణ మేమిటంటే - ఇటు రెడ్డిగారిపల్లెలో ఒక చెరువూ, అటు కమ్మవారిపాలెంలో ఇంకో చెరువూ వున్నవి. ఈ రెండు చెరువులకూ కూడా, ఊరికి పడమరగా, రెండుమైళ్ళ దూరంలో చిలకలేటిలో ఆనకట్ట కట్టించి, ఆచెరువులోని కో కాలవా, ఈచెరువులోని కో కాలవా—రెండు సప్లయి కాలవలు నదిలోనుంచే తవ్వించారు సర్కారువారు. ఆన కట్ట కట్టు దిట్టంగా ఉండిన రోజుల్లో ఏటికి నీరు తగిలిన వెంటనే ఈ రెండు చెరువుల్లోకీ నీళ్లు ధారాళంగా పోయి, సకాలంలో చెరువులు నిండుతూవచ్చినవి. మరి రానురాను, ఆనకట్టకి మరమ్మతులు లేక శిథిలం అయిపోయినందువల్లనో, లేక అసలు వరవకాలవల అంజీపని రైతులు సరిగా చేసుకో నందువల్ల అవి పూడిపోయిన కారణంచేతనో - ఇటీవల ఏటికి ఎంతెంత వరద వచ్చినా పూర్వం నిండినట్లు చెరువులు సక్ర మంగా నిండడం లేదు. దానితో నీళ్లకు ఎద్దడయి, వచ్చిన నీళ్లన్నీ తమ చెరువుకు రానీయకుండా వాళ్ళ చెరువుకే పెట్టుకొంటున్నారని కాపులూ, మా చెరువుకు అసలే నీళ్లు రానీయడం లే దీరెడ్డిగార్లని కమ్మవారూ ఒకరిమీద

ఒకరు నేరారోపణలు చేసుకొని అధికార్లకు అర్జీలూ పిటీ షనులూ పంపుకొన్నారు. అధికార్లు చేసిన ఉత్తర్వులు ఉభయులకూ తృప్తికరం కాక చివరకు వాళ్ళూ వీళ్ళూ ఏటి కడ్డంగా కలియబడి కొట్టుకొని దొమ్మీలూ, ఖూనీలూ చేసుకొన్నారని ఏనాటి గాథలో చెప్పుకొంటూ ఉంటారు. దానిమీద సర్కారువారేమో రెండు గ్రామాలకీ పొలిమేర సరిహద్దు ఏటికి నట్టనడుంగా పోవాలని తీర్మానించి, ఆనకట్ట దగ్గర ఏటికి నడుంగా ఒక లంకగా కట్టించి పైనవచ్చిన నీళ్లు ఏటిలోనే రెండు భాగాలుగా పంపకం అయేటట్టుచేసి రహిత పెట్టారని అంటారుగాని, ఆనాడు రగుల్కొన్న అగ్ని ఇప్పటికీ చల్లారలేదు. తదుపరి-జిల్లా బోర్డులకీ శాసనసభలకీ ఎన్నికలంటూ రావడం, వాటిలో రామిరెడ్డి ఒక పార్టీ తరఫున నిలబడితే కమ్మవారు కాంగ్రెసు తరఫున పోటీ చేయడం-ఇట్లనే కావేషీలు పెరిగిపోయినవి. చివరకు కమ్మ వారిపాలెం కాంగ్రెసు గ్రామం, రెడ్డిగారి పల్లె ఇంకోపార్టీ గ్రామం అయి, వారిని వీరూ, వీరిని వారూ పబ్లికుగా దూషించు కోవడంలోకి దిగింది.

పాతికేళ్ళక్రిందట జరిగిన కొట్లాట కేసులో జువ్వాడు కూడా కమ్మవారితరఫున గలాటాలో ఉన్నాడని వాడిమీద కూడా పోలీసులు కేసుపెట్టితే, సెషన్సుకోర్టులో అయిదేళ్ళ శిక్షపడి, శిక్షానంతరం విడుదలఅయి ఇంటికి తిరిగివచ్చాడట. తమ తరఫున నిలబడి రెడ్డివారిమీద తిరగబడడమే కాకుండా

ఆ గలాటాలో తలమీద బలమైన గాయంకూడా తిన్నాడని కమ్మవారికి వాడిమీద అభిమానం కలిగి, వాడు తిరిగి రావడంతోటే, ఏటివొడ్డున మంచి వానరయిన స్థలంలో వాడి కోయిల్లు కట్టించి, రెండెకరాల మాగాణి కయ్యకూడా తీసియిచ్చారు. వాడికొడుకు - సుబ్బులు ఈడువాడే - యిటీవలదాకా ఇంట్లోనే ఉండి ఆ కయ్య దున్నుకొని తండ్రినీ, తల్లినీ పోషిస్తూ ఉండేవాడు. కాని యుద్ధం వచ్చిన కొత్తల్లో వాడు ఎవరితోనూ చెప్పకుండా చెన్నపట్నం వెళ్ళి మిలిటరీలో చేరిపోయాడు. జువ్వడికి ఆ కొడుకు తర్వాత ఒక్కతే ఆడపిల్ల-రమణి. మిలిటరీలోకి పోయినకొడుకు ఇంటికాడ తండ్రికి నెలకు పదీ పదిహేనూ పంపుతూనే ఉన్నాడు. అయితేనేం - జువ్వడు పెద్దవాడయిపోయి కళ్లు కనిపించక, సేద్యం నాద్యం చేసుకోలేక, కూతురు రమణిని మేనల్లుడు సుబ్బులు కిచ్చి వివాహంచేసి, వీలయితే వాణ్ణి కమ్మవారి పాలెం పిలిపించుకొందామని ఆశపడ్డాడు.

జువ్వడికొడుకు మిలిటరీకి పోకపూర్వమే కమ్మవారి పాలెంలోని కాంగ్రెసునాయకులు ఆ గ్రామంలో హరిజనులకూ, కేవలం పతితులయిన యానాదులకూ కాలనీలు కట్టించి, వాండ్ల విద్యాభివృద్ధికి పాఠశాలలు నిర్మించి, సర్కారువారి వల్ల అంగీకారమూ, గ్రాంటూ సంపాదించిపెట్టారు. నలుగురితోపాటు రమణి కూడా ఆ పాఠశాలలో ప్రవేశించి చదువుకొన్నది.

ఇప్పుడు రమణికి పద్ధెనిమిదేం డ్లుంటాయి. యుక్త వయస్సు వచ్చింది. ఎనిమిదో తరగతి ప్యాసయింది. చదువుతోపాటు పాఠశాలలో అల్లికా, కుట్టూ, రాట్నం మీద నూలు తీయడం, పాటా పద్యం నేర్చుకొన్నది.

## 4

లక్ష్మమ్మదగ్గర శలవుతీసుకొని సుబ్బులు కమ్మవారి పాలెం బయల్దేరి వెళ్ళాడు. పిల్ల రమణిని చూచుకొన్నాడు. అదివరకు అప్పుడప్పుడు మేనమామగారింటికి వెళ్ళి ఒక పూటో అరపూటో వుండడం, మంచిసెబ్బరలు మాట్లాడుకొని తిరిగిరావడం జరుగుతూనే ఉన్నది. ఈసారిమాత్రం బొత్తిగా తీరికలేక సుబ్బులు కమ్మవారిపాలెం వెళ్లి ఆరునెల లయినట్టయింది. ఇంతకాలం చూడక ఎడమయిన కారణం వల్లనో ఏమో ఇప్పుడు చూచుకుంటే అతని కళ్ళకు విస్తు కలిగిస్తోంది రమణి. తనకంటె ఏడెనిమిదేళ్లు చిన్నవయస్సయినప్పటికీ ఆపిల్ల తన భుజాలుదాటి చెవిగూబలవరకూ పోటీచేసేటట్టు ఏపుగా పెరిగిపోయింది. మనిషిలో పూర్వపు పసితనపు పచ్చి వదలి నేవళం కమ్ముకొని, చామనచాయ చెక్కిళ్ళలో కొత్తరక్తం ఉబికి పన్నీరుపుష్పాన్ని ప్రతిఫలింపచేస్తోంది. మొడ బోసిమెడ అయినా, ముతకఖద్దరు చీర మాటున, కంటిమెడజాకెట్టు వలయంలో కంఠంలో రేఖ లేర్పడి ముద్దులు మూటగట్టుతున్నవి. సన్నని ఎర్రజీర పర్ప

డిన ఆమె విశాలమైన నేత్రాలలో, యౌవనపుసిరి పరిపూర్తి చెంది తొణికిసలాడుతున్నది. ఆ రమణికి ఇంక అలంకారము లెందుకు? నగలెందుకు? ఆమె మనోహరరూపము చూచే సరికి సుబ్బులుకు ఒక్కపెట్టున అనంతమైన కొత్తకోరిక లుబికి, పొంగి పొర్లిపోతున్నవి. సుబ్బులు గడపలో కాలిడిన వెంటనే—

"మామా! కాళ్లు కడుక్కో!" అని మట్టిముంతతో నీళ్లు తెచ్చి దగ్గరపెట్టింది రమణి.

వెళ్ళి నాలుగుమాటలు మామతో మాటాడి రాత్రికే యింటికి తిరిగిరావాలని వెళ్లాడుకాని, వెళ్లినతర్వాత ఆ రాత్రి నిలబడి, మామతోనూ, అత్తతోనూ, రమణితోనూ సావకాశంగా ముచ్చటించనిదీ వదలిరా బుద్ధి పుట్టలేదు సుబ్బులుకు. రాత్రి అన్నాలవేళ ముసలివాడు పెళ్లిమాట తలపెట్టి 'పిల్లని ఇక నిలపడానికి లేను. తొందరగా పెళ్లిచేసుకొని, కమ్మవారిపాలెం లేచి రావలసిం'దని ఆరంభించాడు. పెళ్ళిచేసుకోడానికి మాత్రం వెంటనే అంగీకారాన్ని తెలుపుతూ, రెడ్డిగారిపల్లె విడిచిపెట్టిరావడంమాత్రం తనవల్ల కాదని స్పష్టంగా చెప్పినాడు సుబ్బులు. వాడు కమ్మవారిపాలెం కాపరం రాకపోతేమాత్రం తన కూతుర్ని సుబ్బులుకివ్వడం తప్పుతుందా? 'వెంటనే వెళ్ళి పెళ్లికి లగ్నం రెడ్డిగారిపల్లెలోనే ఖాయపరచుకొని రావలసిం'దని కోరాడు ముసలివాడు.

ఆరాత్రి భోజనా లయినతర్వాత పొద్దుపోయేవరకూ ఏవో యుద్ధపుగొడవలూ, వ్యవసాయపు ముచ్చటలూ మాట్లాడుకొన్నారు మామాఅల్లుళ్ళు. బయట వెన్నెట్లో నులకమంచంమీద రమణివేసిన పక్కమీద పండుకున్న సుబ్బులుకుగాని, లోపల ఈతాకుచాపమీద పండుకున్న రమణికిగాని నిద్ర పట్టనేలేదు. అర్ధరాత్రి అయినది. అర్ధ చంద్రుడు నెత్తిమీదికి కెక్కి కూర్చున్నాడు. ముసలివాళ్లిద్దరూ బర్రెగొడ్డుదగ్గర ఎడంగా వాళ్ళమంచాలు వేసుకొని వొడళ్లు మరచారు. మొగకుక్క ఒకటి ఆడకుక్కను వెంబడించి సుబ్బులుని రాసుకొంటూ వేపచెట్టు క్రీనీడకు తరుముకొనిపోయింది. చెట్టుమీద కూర్కుచెందే రెండు పాలపిట్టలు అదిరిపడిలేచి కువకువమని గోలచేస్తున్నవి. శరీరానికి ఉక్క తగిలి మంచంమీదనే లేచి కూర్చున్నాడు సుబ్బులు. "మంచి నీళ్లు కావలెనా?" అని లోపలనుంచి లేచివచ్చి అడిగింది రమణి. జవా బివ్వకుండగనే, సుబ్బులామె రెండుచేతులూ పట్టుకోగా ఆమె వెనక్కి ముఖం తిప్పి వారెగింది. ఆమెతో లేచి నిలబడి ఇద్దరూ పక్కనే చిలకలేటికి పరుగుపెట్టారు.

వరదకు కొట్టుకొనివచ్చి కరడు కట్టిన యిసుక తిప్పపై బరువుగా పడే చిక్కని చంద్రకాంతి మెరిసిపోతోంది. తిప్ప ఎక్కి ఒకరిచేతులొకరు పట్టుకొని, ఎదురుముఖమై, "రమణీ! ......"అని పిలిచి ఏమిటో చెప్పబోయాడు సుబ్బులు.

అదివర కెన్నిసారులు చూచుకోలేదు ఆ రమణి తన మామను! కాని, ఆరాత్రి వెన్నెలకళలలో వెలిగి పోయే మామ రమణికి ఒక దేవతా పురుషుడులా ప్రకాశించి పోతున్నాడు. ఒక సన్నని లేతకిరణం అతగాడి చిరునవ్వు పెదవులపై లేతమీసంమీదుగా పసిరిక పాములా పాకి పోయింది.

"మామా! ఎంతకాలమని అక్కడ నీవూ, ఇక్కడ నేనూ ఇట్లా పడివుండడం" అని అడిగింది రమణి.

పాప మెరుగని వయస్సులో రమణి సుబ్బులు పెండ్లామై పుట్టిందని వరసయినవాళ్లు పరియాచికాలు పలుకుతుంటే లేగదూడవలె నిష్కపటపుచూపు చూచి తెల్లబోయేవాడు. కాని ఈ నాడు రమణి భార్యఅయే మాట నిజమేనని ఘట్టిచేసుకొన్నాడు సుబ్బులు.

రమణి యీనాదిసంఘాల ప్రాపకంచేత ఇంతకాలం చదువుకొని, డొక్కశుద్ధిలేని తనని పెండ్లిచేసుకొంటుందా అని అప్పుడప్పుడు తనకి దిగులు పుట్టేది. అంతలోనే ఆ దిగులు ఆరిపోతూండేది. తనవద్దనుండి ప్రస్తావన లేకుండగనే, మేనమామే కబురుచేసేసరికి సుబ్బులుకు మేరువు దొరికినట్లనిపించి ఇంటికాడ నిలవలేక ఎగిరివచ్చి పడ్డాడు. అట్టి పర్వదినం నాటి రాత్రి, ఏకాంతంలో రమణే వచ్చి తన చేతులలో కరిగిపోతున్నది. చిలకలేటిలో అననుభూతమైన

ఒక ఆనందమయ ప్రవాహం గట్లు తెగ్గొట్టుకొని ప్రవహించి, సుబ్బుల్ని ముంచెత్తివేస్తున్నది.

"రమణీ! నువ్వు చదువుకొన్నావు, నాకు చదువు రాదు; నన్ను నీవు పెళ్లిచేసుకొంటావా?" అని దీనంగా అడిగాడు సుబ్బులు.

"మామా! నేను చదువుకొన్నది నిన్ను పెళ్లిచేసుకొనేందుకే. నా చదువులో నేను మననం చేసింది నీస్వరూపమే" అన్నది రమణి.

ఆమె రెండుచేతులూ ఎత్తి పెదవులతో స్పృశించి కళ్లు మూసుకొన్నాడు సుబ్బులు. ఆ స్పర్శ సుఖానుభూతికి కన్ను లరమోడ్పువడి తన ప్రియుని వక్షస్థలంపై వాలిపోయింది రమణి.

చంద్రుడు మబ్బుచాటుకు పోయి క్రిందివాళ్లకు తెర గప్పేవరకు, తెరమాటున రమణీ సుబ్బులూ చిలకలేటి ఇసుక తిప్పనే ఆశ్రయించుకొని ఉండి సృష్టిలోని నిశ్శబ్దం దుర్భరమనిపించేసరికి 'ఇంక ఇంటికి పోదా'మని లేచి, రమణి తన యింటికీ, సుబ్బులు రెడ్డిగారి పల్లెకూ పయనమై వెళ్ళిపోయినారు.

## 5

ఎప్పుడు తిరిగి యింటికి చేరుకొన్నాడో సుబ్బులు — తెల్లవారి లక్ష్మమ్మ నిద్రలేచేసరికి పడమటావుకి దాణా పెట్టి,

దూడని విడిచి వెనక కాళ్ళకు బందం వేసి, మోకాళ్ళసందున మానిక తప్పెలా పెట్టుకొని, తేనెటీగల మోతగా, జుంయ్యి జుంయ్యిమని పిండుతున్నాడు పాలు.

"రాత్రే వచ్చావేమిటిరా కమ్మవారిపాలెంనుండి? మరి రాత్రి అన్నానికి రాలేదేం?" అని అడిగింది లక్ష్మమ్మ.

"వేకువజామున లేచి వచ్చాను. రాత్రి అక్కడనే ఉండిపోయాను" అన్నాడు సుబ్బులు.

"పెండ్లిమాట ఏమయింది?"

"రెడ్డిగారిపల్లె వెళ్ళి లగ్నం పెట్టించుకొని రమ్మన్నాడు మామ" అంటూ నురుగు నిండిన మానికతప్పెలా చేత బట్టి, బందం విప్పి, దూడని విడిపించాడు సుబ్బులు.

పాలచెంబు చేతిలోకి అందుకొని "అయ్యగారిని పిలిపించి, లగ్నం పెట్టిస్తానుండు" అని లక్ష్మమ్మ యింట్లోకి పోయింది. చద్దినీళ్లు త్రాగి సుబ్బులు పొలం పోయి పైటన్నానికింటికి రాంగనే—

"సుబ్బులూ! రేపు పున్నమి వెళ్లిన దశమికి మంచి లగ్నం ఉన్నదటరా. అయ్యగారు వచ్చి లగ్నం కాగితం మీద వ్రాసి కోడలి కిచ్చి పోయాడు" అని సుబ్బులుతో చెప్పింది లక్ష్మమ్మ.

సుబ్బులుశరీరం తేలికయిపోయి "ఇం కెన్నాళ్లున్నదో?" అని అడిగాడు.

"ఆరోజూ, ఈ రోజూగాక నడుంగా పదిహేను రోజు లున్నదని చెప్పాడు అయ్యగారు" అన్నది లక్ష్మమ్మ.

అన్నం తిని వెళ్ళిపోయాడు సుబ్బులు.

రమణిని పెళ్ళిచేసుకోవాలని సుబ్బులి కెంత ఆత్రంగా ఉన్నదో, వాడు పెళ్లిచేసుకొని, పెళ్ళికూతురుని ఇంటికి తీసుకొనిరాగా చూడాలని లక్ష్మమ్మకూ అంత ఆత్రంగా ఉన్నది. మళ్లా తన రెండో కొడుకు పచ్చనిగుడ్డలు కట్టుకొని ఇంకో కోడల్ని ఇంటికి తీసుకొనివస్తున్నట్టనిపించి ఆయిల్లా లానందం పొందింది.

పెళ్లిరోజు ఎప్పుడు వచ్చేనా అన్న ఆత్రమేగాని — ఆపెళ్లి కేయే సంబారాలు కావాలో, తా నేమి తీసుకొని పోవాలో, తనకు డబ్బెంత కావాలో, ఆకావలసిన డబ్బు లక్ష్మమ్మనే అడగాలో, రామిరెడ్డినే అడగాలో-ఈ ఆలోచనే తట్టలేదు సుబ్బులుకు. వీడి పెళ్లితాపత్రయం అంతా లక్ష్మమ్మ మాత్రం ఆక్షణం లగాయతు నెత్తిన వేసుకుని అదే ప్రయత్నంలో పడిపోయింది. "పెళ్లిచేసుకొని వస్తే ఈ యానాది వాడు ఆ పిల్ల నెక్కడపెట్టడం?" అని లక్ష్మమ్మకు ఆలోచన పుట్టింది. పాప డుండగా అరటితోటలో కాపురం చేసే చుట్టుగుడిసె వాడు చనిపోయిన తర్వాత ఏనాడో శిథిలమై పోయింది. అది లగాయతు సుబ్బులు రెడ్డిగారింట్లోనే తిని తిరుగుతుండినందున వాడికి ప్రత్యేకంగా గుడిసె వేసుకోవా లన్న ఆలోచనా కలగలేదు; అవసరమూ కనిపించలేదు.

తను ఏకాకి. చీకటి పడితే రాత్రిపూట ఏపొలంలోనో, రెడ్డిగారి ధాన్యపు కొట్లదగ్గరనో, పశువులసాలలోనో ఎక్కడ పండు కుంటే తెల్లవారదు! కళ్లమీది రెప్పలు బరువెక్కితే ఆసమ యానికి తలమీద గుడ్డ తలకింద పెట్టుకొని ఏరామస్వామి దేవళం అరుగుమీదనో పండుకొని వెళ్లబోసుకొంటున్నాడు కాలం సుబ్బులు.

భార్యను తీసుకొని వచ్చేలోపల సుబ్బులుకు ప్రత్యే కంగా ఒక 'ఇల్లు'అని ఏర్పాటు చేస్తేనేగాని వీలు లేదని, ఆరాత్రి భోజనాలవేళ ఈ సంగతి రామిరెడ్డితో ప్రస్తావన చేసి, అరటితోటకి తూర్పుగా ఆనుకొని ఉన్న కొబ్బరితోటలో ఈశాన్యమూలన ఓ రెండు దూలాల పూరికొట్టం వేయించ డానికి నిశ్చయించుకొన్నది లక్ష్మమ్మ. సుబ్బులుతోనే చెప్పి తన తాటితోపులో చేవగల రెండు తాటిమానులు నరికించి, వడ్డెవాళ్లను పిలిపించి తాను దగ్గరఉండి గుణావర్ధనం త్రవ్వించి, కీట్లు తీయించి మట్టిగోడలు పెట్టించింది. కంసాలి బత్తుణ్ణి పిలిపించి పశువులకొట్టంలో అటకమీద ఆరబెట్టిన పాత వేపకొయ్యలు క్రిందికి దింపించి, తలుపూ, ద్వారబంధం, రెండు కిటికీలూ చేయించి, గోడలకి బిగించింది. తనదగ్గర సమయానికి నిలవలో లేకుంటే, మిట్టమీదిపల్లెకు బండ్లు పంపించి రెండుబళ్లు సజ్జచొప్పా, విడవలీ, రెండుబళ్లు అడవి

వాసాలూ తెప్పించి, పైకప్పూ, చూరూ కప్పించి, ముత్తా నికి పెళ్లి అయిదురోజు లుందనగా సుబ్బులు కాపురానికి యిల్లు కట్టించి వాణ్ణి పిలిచి, "సుబ్బులూ! ఈ ఇల్లు నీదిరా" అని వాడి కప్పగించింది లక్ష్మమ్మ.

ఏమి సమాధానం చెప్పాలో వాడి కర్థం గాక, "నీచలవ తల్లీ" అని దణ్ణం పెట్టి ఊరుకున్నాడు సుబ్బులు.

రామలింగేశ్వరస్వామిఆలయానికి సంబంధించి కమ్మ వారిపాలెంలో ఉన్న ఏభయ్యెకరాల మాన్యం విషయమై ఇటీవల ఆవూరు కమ్మవారికీ, దేవళం ధర్మకర్త అయిన తనకూ దావాలూ తగవులూ పడి, ఆ సందర్భంలో హైకోర్టులో వాయిదా ఉండినందున వారంరోజుల క్రిందటనే చెన్నపట్నం వెళ్ళిపోయాడు రామిరెడ్డి. "తెల్లవారితే మూడురోజులే ఉన్నది పెళ్లికి గడువు. మేము సర్వం సిద్ధం చేసుకొన్నాం. తెల్లవారితే పెండ్లి అనగానే యిక్కడికి చేరుకోవా"లని కబురుచేశాడు మేనమామ జువ్వాడు. తన పేరిట యిల్లని ఒకటి ఏర్పడింది గదా, రమణి వస్తే గృహ ప్రవేశం కావడమే తరవాయి అని ఉరకలు వేస్తున్నాడు సుబ్బులు.

"రామిరెడ్డి పట్నంనుండి రా లేదని కూర్చుంటే అయినట్టే"నని అంటూ ఎప్పుడు తెప్పించిపెట్టిందో – తెల్ల వారితే పెళ్ళి అనగా ఈ రోజు ఉదయం సుబ్బులుకు తలకు నీళ్లు పోయించి, కొత్తపంచెల జామారు కట్టబెట్టి, కాళ్ళకు

పసుపూ పారాణీ పూయించి, ఆనాడు పప్పూ పరమాన్నం వండి పండుగ చేసింది లక్ష్మమ్మ; మధ్యాహ్నం తరలివెళ్లే టప్పుడు సుబ్బుల్ని లోపలికి పిలిచి "ఇదిగో, ఈ పాతిక రూపాయలూ దగ్గరఉంచుకో. అవసరమైతే ఖర్చుపెట్టుకో. ఈ చీర తీసుకొనివెళ్లి పెళ్లికూతురుకు కట్టబెట్టు" అని సుబ్బులు చేతి కిచ్చింది.

మొలకి కొత్తపంచె, పైకి కొత్త ఉత్తరీయం - ఏమి! సుబ్బులు జాతకం! ఆ గడ్డమీద అదివర కేయానాదివాడికి పట్టింది ఈ మహాదశ! సుబ్బులుకు తనపాలిట ప్రత్యక్షదైవములా గోచరిస్తోంది లక్ష్మమ్మ. జొటజొట కన్నీరు కారి గద్గదస్వరం పడి, నోట మాటరాక, నిలువునా మోకాలి మీద వాంగి, లక్ష్మమ్మ పాదాలు కళ్లకద్దుకొని నిలబడ్డాడు వాడు.

రెండుచేతులూ అతని చెంపలమీదుగా తిప్పి, తన చెంపన పెట్టుకొని వేళ్లు విరిచి, "నాయనా! వెయ్యేళ్లు వర్ధిల్లు. తొందరగా పెళ్లి చేసుకొని వచ్చి బిడ్డల తండ్రివి కా" అని దీవించి, "ఆ మహారాజు ఉంటే చూచి ఎంత ఆనందించే వాడో! 'సుబ్బులంటే యానాదివాడటే! వాడు రత్నం' అని ఊఁ, పొంగిపోయేవాడు" అని తన భర్త కృష్ణారెడ్డిని తలచుకొని కళ్లు తుడుచుకొన్నది లక్ష్మమ్మ.

సుబ్బులు లేచి నిలబడ్డతర్వాత - "ఇదిగో! చెయ్యి పట్టు. ముందుగా యిస్తే మరచిపోతావని ఇవ్వలేదు. ఈ కాసు

తీసుకొని వెళ్లు; పెళ్లి రాత్రి గదిలో పెళ్లికూతురుచీర చెంగుకు కట్టిరా'' అని నవ్వుతూ తనతాలూకు పాతసొమ్ముల బాపతు కాసుల పేరులో ఒక బంగారు నవర తీసి, మెరుగు పెట్టించి, పెళ్లికొడుకుచేతిలో పెట్టింది లక్ష్మమ్మ.

నల్లని తన చేతిలో మెరిసిపోయే ఆ బంగారు నవర సుబ్బులు కళ్లలో తళుక్కుమని చీకట్లుకమ్మేసింది. 'రాత్రి' 'గది' అని లక్ష్మమ్మ అనేసరికి వల్లమాలిన సిగ్గు పుట్టి, కళ్లు నేలచూస్తూ తలకాయ వంచి అట్లనే నిలిచిపోయాడు సుబ్బులు.

''భద్రం! జాగ్రత్తగా పెట్టుకో: మరిచేవు సుమా'' అని పదేపదే హెచ్చరించి సాగనంపింది లక్ష్మమ్మ.

## 6

లక్ష్మమ్మ దీవెన లందుకొని పెండ్లికొడు కారాత్రికే కమ్మవారిపాలెం చేరుకొన్నాడు. మామ ఎప్పుడు గుమ్మంలో అడుగుపెట్టుతాడా అని ఎదురు తెన్నులు చూచే రమణికి సుబ్బులురాక బ్రహ్మానందమై పోయింది. ఆ యిరువురి జీవితాలలో సర్వోత్కృష్టమైన ఘడియ లవి.

తన తండ్రి ముసలివాడు. కళ్లు కనిపించక బయటకు పోయేస్థితిలో లేనందున ఎంత స్వల్పంగా చేసుకొందా

మనుకొన్నా పెండ్లి కార్యాలన్నీ రమణే, ఆమె తల్లీ స్వయంగా చూచుకోవలసి వచ్చింది. ఆమె అన్న ఉండీ కూడా మిలిట రీలో చేరి సమయానికి అక్కరకు రాకుండా పోయినాడు. ఆ పూరికొంపకే లోపలా బయటా మట్టిపూతా, పేడపూతా తల్లీకూతుళ్ళే స్వయంగా పూసుకొని, సున్నం కొట్టించు కొన్నారు, ఇంటివాకిట పందిరిపై ఎండిపోయిన బండెడు పాతతడికలు తీయించివేసి, పచ్చని కొత్తతడికలు కప్పి పందిరి బాగుచేయించింది రమణి. ఒక అయ్యను బ్రతిమలాడి ఇన్ని మామిడాకులు తెప్పించి, తోరణం కట్టించింది పందిరికీ, వాకిలికీని. బడిలో చదువుకొనే హరిజన పిల్లకాయలనూ, యానాది పిల్లకాయలనూ పెళ్ళికి వచ్చి అన్నం తిని పోవల సిందని స్వయంగా పిలిచింది రమణి. ఆ తాలూకా యానాది సంఘాల కధ్యక్షుడయిన రాఘవయ్యగారిని పెళ్ళికి తప్పక రావలసిందని జాబు వ్రాసి పంపింది. ఆ పాలెంలో చదువు కొన్న యానాది పిల్లకు పెళ్లి కావడం యిదే మొదటిసారి అయినందువల్ల సంతోషంకొద్దీ పెళ్లికూతురుకోరిక ప్రకారం హాజరయ్యారు రాఘవయ్యగారు.

పాఠశాల ప్రధానోపాధ్యాయుడు వివాహానికి ఆధ్వర్యం వహించి మంత్రాలు చదివి శుభలగ్నాన రమణిమెడలో సుబ్బులుచేత మంగళ సూత్ర ధారణ చేయించాడు. పాఠశాల అయ్యవార్లు మొగా ఆడా అందరూ వచ్చారు. గ్రామంలో కాంగ్రెసునాయకులు నలుగురూ వచ్చి రమణినీ, సుబ్బుల్నీ

దీవించి అక్షతలు చల్లి వెళ్లిపోయారు. పెద్ద అయ్యావారమ్మ-గాంధీగారి ఆశ్రమంలో ట్రెయినింగయి వచ్చిన ఆమె-మహాత్ముని ఆత్మ చరిత్ర పెళ్లికూతురుకు కానుక చదివించింది. శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి"ని రాఘవయ్యగారు కానుక చదివించారు.

ఇప్పటి కారుమాసాలుగా తాను స్వయంగా రాట్నం మీద వడికిన నూలుతో మామ కో పంచా ఉత్తరీయం, తన కో చీరా రవికా నేయించి నెలరోజుల క్రిందటనే తయారుగా పెట్టుకొన్నది రమణి. రాత్రి ఏకాంతంలో మామకి కొత్త పంచలు తను స్వయంగా కట్టబెట్టి, కొత్తచీర తాను ధరించింది. "నీకు లక్ష్మమ్మ పంపిన కానుక" అని చెప్పుతూ బంగారుసవర రమణి చేతిలో పెట్టాడు సుబ్బులు.

మూడు నిద్రలూ అయిన తర్వాత పిల్లని తీసుకొని రెడ్డిగారిపల్లె వచ్చాడు సుబ్బులు. వచ్చీరావడంతోనే కొత్త గుడ్డలతో దంపతులు ఇద్దరూ వెళ్లి ముందు లక్ష్మమ్మకీ, తర్వాత ఆమెకోడలికీ కాళ్లకి మ్రొక్కి వారి దీవెన లందుకొన్నారు. అప్పటి కింకా చెన్నపట్నంనుంచి రానేలేదు రామిరెడ్డి.

లక్ష్మమ్మ దగ్గర ఉండి, సుబ్బుల్నీ, రమణినీ కొత్త ఇంట్లో గృహ ప్రవేశం చేయించి, వారి సంసారానికి కావలసిన అన్ని సదుపాయాలూ చేసి పెట్టింది.

రమణికీ, సుబ్బులుకీ చిరకాలం చేసుకొన్న తపస్సు ఫలించినట్లనిపిస్తోంది. స్వంతయిల్లు. రమణి తనభార్య; సుబ్బులు రమణిభర్త. ఆమె అతని ప్రియురాలు; అతడు ఆమె ప్రియుడు. ఇంట్లో కాపురానికి లోటు లేకుండా సమస్తమూ సప్లయి అయే రెడ్డిగారి ప్రాపకం. ఆహా! ఏమి అదృష్టం!

పూరిల్లు రెండుదూలాల కొట్టం అయినందువల్ల మూడు అంకణాల కొంప. తూర్పుతట్టు అంకణంలో వంట చేసుకోడానికి కేటాయింపుగా దూలంకింద పొడుగునా మేదరతడిక అదివరకే అల్లించి పెట్టించింది లక్ష్మమ్మ. పడమటితట్టు అంకణంలో వాండ్లు నిద్రచేయడానికి ఒక నులక మంచంకూడా కొత్తది సప్లయిచేసింది ఆయిల్లాలు. ఇంక ఆ సంసారానికి కావలసిన పెద్ద హంగులుమాత్రం ఏమున్నవి? పెట్టుకొంటే ఎన్ని హంగులయినా పెరుగుతూనే ఉంటవి. రామిరెడ్డి పెండ్లికి - ఆ రోజుల్లో మామగారు అయిదు కావిళ్లతో రూపాయలూ, వెండి బంగారు సామానూ అల్లుడికి కట్నం చదివించి, కూతుర్ని అత్తవారింటికి పంపే టప్పుడు పందిరి పట్టెమంచం, చాందినీ, పరుపులూ, దిండ్లూ, అద్దాలూ, బీరువాలూ, లేకు పెట్టెలూ, అలమరలూ, గుండిగలూ, అండాలూ, బిందెలూ, మరచెంబులూ, గ్లాసులూ, పళ్లేలూ— ఒకటేమిటి, కొత్తసంసారానికి కావలసిన వన్నీ, పూచీపుల్లతోసహా అయిదుబళ్లమీద గొప్ప

సారె పెట్టి పంపించారట పుట్టింటివారు. ఆ దిగిన సామాను పెట్టుకోను ఇల్లు చాలక, నిత్యసంసారానికి అంత సామానుతోనూ అవసరం కనిపించక, దానిలో ముప్పాతిక సామాను అటకమీాది కెక్కించి ఇల్లు ఖాళీచేయించిందట లక్ష్మమ్మ. రమణి కంత సారె పెట్టడానికి ఆ తల్లిదండ్రులకు శక్తీ లేదు; ఈ సంసారానికి అవసరమూ లేదు. ఎటువచ్చీ రమణి తనతో తెచ్చుకొన్నది తనగుడ్డలు, పుస్తకాలు పెట్టుకొనే జాజిచెక్కలపెట్టె ఒకటీ, ఒకరాట్నమూ, ఏకుల బుట్టాను.

గృహప్రవేశం అయినవెంటనే గుమ్మానికెదురుగ్గా కొంచెం పడమటి వాలుగా గోడకి గాంధీ మహాత్ముని పటం తగిలించి, దానికి ఒక ప్రక్క టంగుటూరు ప్రకాశంగారి పటం, రెండో ప్రక్క పట్టాభిసీతారామయ్యగారి పటం కొట్టింది రమణి. ఆ ప్రక్కనే తగిలించింది యీనాది సంఘోద్ధారకుడు రాఘవయ్యగారిపటం. ఇంతకు మినహా ఆమెతో కూడా తెచ్చిన సామానేమీా లేదు. ఇంతా చేస్తే, ఒక్క మహాత్ముని పటానికి తప్ప మిగిలిన పటాలకు వొట్టి చట్టాలే గాని, అద్దాలు లేనేలేవు. వేయించుకొందామంటే వాళ్ళకు శక్తి లేకపోయింది; అసలు అద్దంపెంకు కరువూ అయిపోయింది.

ఇంట్లో ఉండేది ఇద్దరు మనుష్యులు. ఉదయమో అర్ధశేరూ, రాత్రికో అర్ధశేరూ బియ్యం నూకలు ఉడకవేసుకొంటే ఎక్కతిక్కలు. అన్నం వండుకొనేందుకు ఒక కుండా,

కూరకి ఒక అటికా, పులుసు కాచుకోను ఒక ముంతా మాత్రం తెప్పించింది రమణి. ఇత్తడిపాత్రలు తెప్పించి యిస్తానని లక్ష్మమ్మ తొందరపెట్టిందిగాని వాటిలో వంట చేయడం తన కలవాటు లేదని వద్దని చెప్పింది. ఆఖరుకి మంచి నీళ్లు త్రాగడానికి రెండు కంచుగ్లాసులయినా తీసుకొంటేనే గాని వీల్లేదని, రమణి వద్దంటున్నా రెండు గ్లాసులూ, ఒక యిత్తడిచెంబూ కొని పంపించింది లక్ష్మమ్మ. లోపల మంచినీళ్ళ కోబుంగా, ఒక కడవాను, బయట స్నానాల కొక బానా, నోరు వెడల్పు తొట్టేని. దానితో రమణీ సుబ్బులుల సంసారం కొల్లబోతున్నది. "ఇంకేమీ వద్దు. మా విషయమై మీరు శ్రమ పడకండత్తా" అని రమణి లక్ష్మమ్మని గడ్డం పుచ్చుకొని బ్రతిమలాడింది.

వ్యవహారం పనిమీద రెడ్డి చెన్నపట్నం వెళ్లితే మట్టుకు వ్యవసాయపు జవాబ్దారీ సుబ్బులుకు తప్పతుందా? ఆమాటకి వస్తే రామిరెడ్డి ఊళ్లో లేనపుడే సుబ్బులుకు జవాబ్దారీ ఇబ్బడయిపోతుంది. పుష్యమాసంలో పెద్దపండగ వెళ్లిపోయిన వెంటనే కోత లందుకొంటేనేగాని చేలన్నీ నిండు పంటమీద ఉన్నవి పాడయిపోతవి. కోతలనాటి కయినా రెడ్డి వస్తాడో రాడో! ఆయన లేకుండానే తాను స్వతంత్రించి రమణిని పెళ్లిచేసుకొని కాపురానికి తీసుకొని వచ్చినందుకే సుబ్బులుకు గుండెలు పీచుపీచుమంటున్నవి. కొడుకు నడిగే యిల్లు కట్టించి యిచ్చానని లక్ష్మమ్మ ధైర్యం

చెప్పుతున్నదిగాని తాను ఆయింట్లో ప్రవేశించే నాటికయినా రెడ్డి వచ్చివుంటే ఎంత బాగుండేది అని వాడి కదే ఆలాపన. అయినా లక్ష్మమ్మ కష్టసుఖాలు తెలిసిన పెద్దవరస మనిషి గాని చిన్నపిల్ల కాదుగదా? ఇంటిపెత్తనం తనమీద ఉన్నప్పటికీ, ఈ విషయంలో లక్ష్మమ్మమాట కాదనడానికి రెడ్డికి నో రెట్లా వస్తుందీ? మరేమీ భయంలేదులే అని గుండె నిబ్బరం చేసుకొన్నాడు సుబ్బులు. ఇంతలోనే, తాను పట్నంనుండి యింకా పదిహేను రోజులవరకూ రా వీలు లేదనీ, సుబ్బులునే కూలీలను మాట్లాడి కోతలు పట్టించవలసిన దనీ రామిరెడ్డి జాబు వ్రాయనేవ్రాశాడు. ఇంక నేంభయం!

పెద్దపండుగ వెళ్లి, కనుమూ, ముక్కనుమూ గడచిన మరునాడే సుబ్బులు కోత లారంభించి, మామూలు ప్రకారం-ఏయే చేలలో వేయవలసిన కుప్పలు ఆయాచేలలో వేయించి, పది పదిహేనురోజులకే సాపు సీదా పంట అంతా ఒబ్బిడిగా అమర్చి పెట్టేశాడు. తాను పగలూ రాత్రీకూడా కుప్పలూ, కయ్యలూ అజమాయిషీ చేసుకొనివస్తున్నాడు. కోతలు కోయడంతోటే కయ్యల్లో తడి ఆరకుండా కొన్నిట్లో ఉలవా, కొన్నిట్లో జనుమూ, మరి కొన్నిట్లో పిల్లి పెసరా – పశువుల మేతకు కొయ్యకాలుమీదనే విత్తనాలు చల్లించివేశాడు. అక్కడక్కడ చవిటికయ్యలు కొన్ని ఏర్పడి కాస్త సత్తువ పెట్టినగాని పనికిరావని కనిపించే కయ్యల్లో సత్తువకోసరం నీలివిత్తనాలూ, వెంపలాకూ చల్లించి, మొక్క మొలిచే

వరకూ ఒకటి రెండు తళ్లు నీళ్లుకూడా పెట్టించి కట్టుదిట్టం చేశాడు. సుబ్బులు కీనాడు కొత్తగా నేర్పవలసిన విద్య గనకనా! కంట్లో వత్తివేసుకొని ఖామందుకమతం కనిపెట్టుకు రావడం వాడికి వెన్నతో బెట్టిన విద్య.

రమణి కాపురానికి వచ్చి నెలరోజు లయినది. కొత్త కాపురం. ఎంత కాలంగానో తపస్సు చేసి చేసుకొన్న పెనిమిటి సుబ్బులన్న మాటేగాని, రెడ్డిగారిపల్లెలో కాలు పెట్టినదిలగాయతు చూస్తుందిగదా, తన మామకు తీరికే కనిపించదు. వేకువన కోడికూతతో లేచి వెళ్లిన వెళ్ళడం, పొలంనుండి రెండు బారల పొద్దెక్కేవరకూ చద్దన్నానికే రాడు, చద్ది నీళ్లు త్రాగి మళ్లా వెళ్లితే పైటన్నానికి ఒకరోజు ప్రాప్తి ఉంటే ఉంటుంది. ఇంకోరోజు ఉండనే ఉండదు. అందులో వరికోతలుకూడా వచ్చిపడ్డాయో ఏమో. చిక్కంగా చీకటిపడి గూటిలోని పక్షులు కూర్కుపెట్టినగాని ఇంటికి చేరలేక పోతున్నాడు సుబ్బులు. పగలంతా ఎండా, గాలీ అతగాడి పాలయిపోతున్నవి. ఇంటికి చేరి ఉడుకు నీళ్లు పోసుకొని నులకకుక్కిమీద నడుము వాలిస్తే మళ్లా కోడికూతతోనే మెలకువ అతనికి. తన తండ్రిగారింటికాడి వాళ్లుకూడా వొళ్లు అమ్ముకొని బ్రదికేవాళ్లయినా, ఈ విధంగా నెత్తురూ మాంసం హరించి పోయేటట్టు కష్టపడగా తాను చూచిన గుర్తు లేదు రమణికి.

"ఏమి టిది మామా ఈపని? వేళకు కూడూ నీళ్లూ అమరకపోతే వాళ్లు చెడిపోరూ!" అని తను అంటే— 'ఎద్దులకు గాలికుంటు తగిలినందువల్ల వైద్యుడికోసరం పొరుగూరు వెళ్లివచ్చా'ననో, 'రెడ్డిగారింట్లో పొయ్యిలోకి కట్టెలు లేకుంటే తోపులో తాటిమట్టలు కోయించి యింటికి తోలిస్తున్నా'ననో, లేక 'రెండెద్దులబండికి ఇనపపట్టాలు వొదులయి తొలగిపోతే కమ్మరికొలిమి కాడ కాపించివస్తున్నా' ననో— ఒకటేమిటి, ఎప్పటి కప్పుడే ఏదో సాకు చూపించి ఆమె నూరటపెట్టుతున్నాడు సుబ్బులు.

పెనిమిటి కష్టపడుతుండగా చూడలేకపోతున్నది ఆ పసియిల్లాలు. తానుకూడా పెనిమిటితోపాటు, పోయి సమానంగా కాయకష్టంచేసి అతనితో భాగం పంచుకొంటే బాగుండును. ఇంటిపట్టున తాను రాణివాసం చేయడం, తన భర్త చెమట ఊడ్చి కష్టంచేయడమూనా? రమణి పెనిమిటితో కూడా వేకువనే లేస్తుంది. మెడలోని పుస్తెకళ్ల కద్దుకొంటుంది. గాంధీగారి పటం దగ్గరకు పోయి మొక్కరించి నమస్కరిస్తుంది. ముఖం కడుక్కొని పాచీ పని చేసుకొంటుంది. సుబ్బులుకి చద్దన్నం పెట్టి, తా నింత తిని, అతను వెళ్లిన తర్వాత వాకిలి బిగించి ఒక సారి రెడ్డిగారింటికి వెళ్లి అక్కడ చెంబు ఇక్కడా, ఇక్కడ బిందె అక్కడా పెట్టి పని కల్పించుకొంటుంది. రెడ్డిగారి పిల్లలకు తల దువ్వి జడలేసి స్నానంచేయిస్తుంది. రెడ్డిగారి భార్యకు బావిలో

నీళ్లు తోడిచ్చి, ఆమెస్నానం అయ్యేవరకూ అక్కడనే ఉంటుంది. లక్ష్మమ్మదగ్గరకు పోయి కూరా నారా తరిగి యిచ్చి ఏవేవో ముచ్చటలు చెప్పుతుంది. పొద్దు నెత్తిమీది కెక్కేసరికి ఇంటికి వచ్చి వంటచేసి పెనిమిటి వచ్చేవరకూ ఏ పుస్తకమో, ఏరాట్నమో పెట్టుకొని కూర్చుంటుంది. చీకటి పడగానే ప్రమిదలో వేపచమురు దీపం వెలిగించి గాంధీగారిదగ్గర పెట్టి ఏవో వెర్రిమొర్రిపాటలు పాడుకొం టుంది. పెనిమిటి రాంగానే అతగాడికి వేడినీళ్లతో స్నానం చేయించి అన్నం పెట్టుతుంది. ఇదీ ఆమెదినచర్య.

## 7

రామిరెడ్డి పట్నం వెళ్లి నెల్లాళ్లు దాటింది. సుబ్బులు పెళ్లి వారంరోజు లుందనగా వెళ్లిన వెళ్లడం. ఇదిగో పది హేను రోజుల్లో వస్తానని వ్రాసిన రెడ్డి కోతలయి కుప్పలు పడ్డా తిరిగి రాలేదు. కొబ్బరి తోటలో తన కొత్తకాపరం ఆ రెడ్డి చూచి ఆనందించాలని ఎంత మనస్సుపడుతున్నాడో సుబ్బులు - అంత కంతా రామిరెడ్డిరాక ఎడమే అయిపో తోంది. ఎడమయిన కొద్దీ సుబ్బులు కామెడబాటు దుస్సహ మైపోతోంది. ఇంటిదగ్గర భార్యా పిల్లలూ రెడ్డికోసరం కలవ రించిపోతున్నారు. ఏమిటో ఆరోజు రెడ్డిమీద అతగాడికి మరు లుపోయి మనస్సు ఉండబట్టలేక లక్ష్మమ్మ కాడికి పరుగెత్తి-

"అమ్మా! అయ్య యిన్నాళ్ళుగా రాలేదు. పట్నంలో ఏమి చేస్తున్నట్టు?" అని అడిగాడు సుబ్బులు.

"ఈ వూరి రామలింగేశ్వరస్వామికి ఆ కమ్మవారి పాలెంలో ఏభయ్యెకరాల మాగాణీ మాన్యం ఉన్నది. దానిని పండించి, మావూరి దేవుడికి ఖర్చు పెట్టుతాం గాని నీ కివ్వడానికి లేదని పేచీ పెట్టారట ఆవూరు కమ్మవారు. వీడు మన వూరి దేవుడికి ధర్మకర్త కాబట్టి ఆ భూముల స్వాధీనానికి వ్యాజ్యెంవేసి కోర్టు కెక్కి ప్లీడర్లతో మాట్లాడి వస్తానని వెళ్లాడు"

"మన వూరు దేవళానికి కమ్మవారిపాలెంలో భూము లెట్లా వచ్చినవి?"

"ఆ వూళ్లో కమ్మ చలమానాయుడు, పిల్లకాయలు లేక చనిపోతూ తాను శివభక్తుడయినందువల్ల, తన ఆస్తిలో యాభై ఎకరాలు ఈ దేవుడికి వ్రాసి యిచ్చి చచ్చిపోయాడట"

"అట్లానా?"

"అది లగాయతూ దేవుడు మన వూళ్లో ఉండినా ధర్మకర్తలు ఆ కమ్మనాయుళ్లే ఉండి, ఈదేవుడికి పూజలూ పురస్కారాలూ, ఉత్సవాలూ, వాళ్లే చేసుకొంటూవచ్చారు. నీటిమడవల తకరారుపడి ఏటిలో తలకాయలు పగలగొట్టు కొన్నప్పటినుండీ ఆ కమ్మవారు పేచీ పెట్టుకొని భూముల మీద వచ్చే ఆదాయం వాళ్ళవూరు రామస్వామి దేవళం క్రిందా, మాల మాదిగల చదువులక్రిందా, యానాది సంఘాలకిందా ఖర్చు పెట్టుతున్నారట."

"నే నెరుగను సుమా"

"మనవాడు ఈ మధ్య పట్నంలోకి! గొప్ప వాళ్లనీ, అధికార్లనీ, కలెక్టర్లనీ పట్టుకొని తాను ధర్మకర్తగా ఉండేటట్టు ఉత్తరువులు తెచ్చుకొని భూమిస్వాధీనానికి కోర్టులో దావా పడేశాడు. కాని ఆ కమ్మవారు స్వాధీనం పడనిస్తారా! ఏదో అన్నరు పెట్టి హైకోర్టుదాకా తీసుకొనిపోయారట వ్యవహారం."

"అబ్బా!"

"అసలు చలమానాయుడు వ్రాసియిచ్చిన వీలు నామా చెల్లదని వాళ్ళ వాదమట."

"బాగానే ఉంది!"

"'వద్దురా నాయనా! ఆ దేవుడిమాన్యాలూ, బ్రాహ్మణ మాన్యాలూ మనకు వద్దు. మనకున్నది తింటే చాలు. మీనాయన పరాయిసొమ్ము పాపిష్టి సొమ్ముగా చూచి పరువుగా బ్రదికి భళా అనిపించుకొన్నాడు. ఈ కుమ్ము నీవు నెత్తికి తెచ్చి పెట్టుకోవ'ద్దని శతవిధాల చెప్పాను. విన్నాడు కాదు" అని అంటూ లక్ష్మమ్మ లోపలికి వెళ్లి పోయింది.

సుబ్బులు కీ దేవరహస్యాలు తెలియవు. కాకుంటే ఈ వూరి రెడ్డిగార్లకీ, ఆ వూరి కమ్మవారికీ బొత్తిగా సరిపడ దనిమాత్రం ఎరిగున్నాడు. ఎరిగున్నా ఏ విషయంలో పట్టినా కమ్మవారికంటె తన రెడ్డిచెయ్యే పై చెయ్యిలా

కనిపించేది సుబ్బులుకు. తన రెడ్డి ఆవూరికి మునసబు. తహశీల్దార్లు, కలెక్టర్లు, పోలీసు అధికార్లు - గొప్ప గొప్పవాండ్లు గుర్రబ్బండ్లూ, మోటారుకార్లూ వేసుకొని రెడ్డిగారింటికి రావడం, ఈయనతో చెయ్యీచెయ్యీ కలుపుకొని మాట్లాడడం, ఏవో నల్లవీ, ఎర్రవీ నీళ్లు గ్లాసుల్లో పోసుకొని తాగడం —తన రెడ్డి జిల్లా అధికారి ఉన్నట్టుంటాడు. ఈ మధ్య నాలుగు నెలలక్రిందట తన రెడ్డి కేదో "సాహెబు" అని సర్కారు వారు కొత్తగా పేరు కూడా పెట్టారని రెడ్డిగారి పల్లెలో ఎంతో మంది గొప్ప వాళ్లు వచ్చి రెడ్డిగారిని ఎత్తయిన కుర్చీలో కూర్చోబెట్టి, మెడలో పూలదండలు వేసి పూజించి వెళ్లారు కూడాను. సర్కారువారుకూడా తనరెడ్డికి లొంగసానయినట్టే కనిపించేది సుబ్బులుకు. చెన్నపట్నం దావాలో రెడ్డిగారే గెలిచితీరుతా రనుకొని, ఏమేమిటో ఆలోచించుకొంటూ ఇంటికి వచ్చాడు సుబ్బులు.

ఆ రాత్రికే పట్నంనుండి గ్రామానికి తిరిగివచ్చాడు రామిరెడ్డి. గ్రామానికి వచ్చిన తర్వాత కూడా ఏవో తొందరపనులలో రెడ్డి వారం పది రోజులదాకా ఇంటికాడ స్తిమితంగా ఉండడమే లేదు. ఒకరోజు మధ్యాహ్నం నాలుగు గంటలప్పుడు కాఫీ తీసుకొందామని రెడ్డి దక్షిణపు వాకిట్లోకి వచ్చేసరికి వసారాలో కూర్చుని ఒక పడుచుపిల్ల తన భార్యకు తల దువ్వి జడ అల్లుతోంది. ఆ పిల్లని చూచి, "ఎవరే ఈ మనిషి?" అని భార్య నడిగాడు.

కూర్చున్న మనిషి సిగ్గుపడి లేచి పక్క ధాన్యపు పురిచాటుకు తప్పుకుంది.

తన భార్య సమాధానం చెప్పేలోపలనే "నువ్వు చూడనేలేదటరా అబ్బాయీ! సుబ్బులు పెళ్లాం" అని కాఫీ కొడుకుచేతి కిచ్చి "రమణీ! ఇట్లా రా అమ్మా" అని ఆమెచెయ్యి పట్టుకొని తీసుకొనివచ్చి "రమణి అంటే రమణి కాదురా, మణిపూస. యానాదివాళ్లలో తప్పబుట్టింది. సుబ్బులు అదృష్టం కొద్దీ దొరికిం"దని రామిరెడ్డికి ఎదురుగా నిలబెట్టింది లక్ష్మమ్మ.

కాఫీ గుటకలు మింగుతూనే ఆపిల్ల నట్లా పదిసార్లు క్రిందినుంచి పైదాకా మొఖమంతా కళ్లుచేసుకొని చూచాడు రామిరెడ్డి.

ఎడంగా నిలబడే "నమస్కారమండీ బాబుగారూ" అన్నది రమణి.

రామిరెడ్డి పలకలేదు.

"అవ్వూళ్లో యానాది సంఘాలవాళ్లు పెట్టించిన బడిలో చదువుకొన్న దట. చదువు రానివాడయినా, మేనత్త కొడుకని సుబ్బుల్ని చేసుకొన్నది. ఈ కాలంలో చదువు కొన్న ఏ ఆడది చదువురానివాణ్ని చేసుకొంటుంది చెప్పూ? దాని బుద్ధి బంగారు బుద్ధి" అన్నది లక్ష్మమ్మ.

రామిరెడ్డి ఇంకా గుటకలు మింగుతూనే నిలబడ్డాడు.

"అబ్బాయీ! వాడిపెళ్లికి నీవు లేవని సుబ్బులు ఎంత ఇదయి పోయాడనుకొన్నావు! రెడ్డిగారు రెడ్డిగారు అని కలవరించిపోయాడంటే నమ్ము" అన్నది లక్ష్మమ్మ.

"అట్లాగా!" అన్నాడు రామిరెడ్డి.

"కొత్తబట్టలు కట్టబెట్టి పసుపు రాచి నేనే పెండ్లి కొడుకుని చేశాను. బంగారు సవరొక టిచ్చి పంపాను. ఎన్ని ఇస్తేనేమట్టుకు సుబ్బులుఋణాం మనం తీర్చుకోగలమా నాయనా?" అని ఏమిటో పాఠం చదువుతోంది లక్ష్మమ్మ.

రామిరెడ్డి రమణి ముఖంలోనికీ, ఆమె తొడుక్కొన్న పొట్టిచేతుల జాకెట్టులోనికీ ఏదో వెర్రిచూపులు చూస్తూనే ఉన్నాడు. కప్పులో మరింత కాఫీ పోయించుకొని "సుబ్బులుకు మన కొబ్బరితోటలోనేగదూ నీవు యిల్లు కట్టించి యిచ్చింది? మంచిపని చేశావు" అని తల్లిని మెచ్చుకొంటూ, వాకిట్లోకి పోయి చుట్ట నోట్లో పెట్టి అగ్గిపుల్ల ముట్టించాడు రెడ్డి.

"అత్తయ్యగారూ! ఆయన్ని చూస్తే నాకు కాళ్ళల్లో దడ పుట్టిందండీ" అని లక్ష్మమ్మతో అని, రామిరెడ్డిభార్య వెనక్కి పోయి, కొరవబడ్డ జడ అల్లుతూ కూర్చుంది రమణి.

పొద్దు గ్రుంకినవెంటనే సుబ్బులుని ఒకసారి పిలిపించి, రమణిని పెళ్లిచేసుకొని తీసుకొనివచ్చినందుకు వాడికి అభినందనాలు చెప్పి సాగనంపాడు రెడ్డి.

బిళ్లలమొలతాడు

రమణి తన దృష్టిలో పడిన వేళావిశేషం! రమణి శరీరంమీద అలంకారాలేమీ లేనేలేవు. బిళ్ళారిగాజులు ఈ చెయ్యికో జతా, ఆ చెయ్యికో జతాను. ఎడమచేతి అనామికకుమాత్రం ఒక వెండిఉంగరం ఉన్నది. మెడలో పసుపురాచిన తాడూ, తాడుకు మంగళసూత్రమూను. కంఠానికి కొంచెం గుత్తంగా ఒక నల్లపూసల దండా, దండలో ఒక బంగారు మిరియంపూసాను. ముక్కూ, చెవులూ బోసివే. కాళ్ళకిమాత్రం వెండిగొలుసుల జత ఒకటి ఉన్నది. ఖద్దరుచీర కట్టుకొని, నీలి అంచు ఖద్దరు రవికె తొడుక్కున్నది. ఎటువచ్చీ ఆమె సిరిఅంతా కళ్ళల్లోనూ, చుట్టుకొంటే తలని తన్నే నల్లని జడచుట్టలోనూ నిలిచిపోయింది.

ఆమె రూపాన్నీ, సౌందర్యాన్నీ నేత్రాలనీ మరచి పోలేకపోతున్నాడు రామిరెడ్డి. వీథివాకిట్లో చుట్ట కాలుస్తూ ఏకాంతంలో అట్లనే నిలబడిపోయాడు. మనస్సులో ఏదో చెప్పరాని బాధ, ఉద్రేకం, ఆవేదనాను. చెయ్యిపెట్టి కలచిన ట్లున్నది మనస్సులో. చుట్ట చేతికి తీసుకొని, తెల్లటికొడి దులుపుతూ - పరధ్యానమో ఏమో - కొడి రాలిపోయిన పిదపకూడా చిటికెనవేలు నిప్పుమీద అట్లనే ఆడిస్తున్నాడు. ఘాటయిన చుట్టేమో, కింద పాదాలూ, చేతులూ, పైన తలా వేడెక్కి రక్తం బిరుగా ప్రసరిస్తోంది. చిటికెనవేలికి నిప్పు చుర్రుమనేసరికి అతని శరీరం జ్వరం తగిలినట్టయి పోయింది. దీర్ఘనిశ్వాసాలతో ముక్కుపుటాలు పెరిగి నోటి

లోకి పీల్చిన పొగ ముక్కురంధ్రాలగుండా తెరలు తెరలుగా బయటికి కమ్ముకొంటోంది. దొడ్లోకి వెళ్లి ఇంకోసారి రమణిని చూడాలనిపించింది. చుట్ట పారేసి "మంచినీళ్లు కాసినియ్యి అమ్మా" అంటూ మళ్లా దొడ్లోకి వెళ్లాడు. కాని అక్కడ రమణీ లేదు; తన భార్యా లేదు.

# 8

ఫాల్గుణం వెళ్లి ఉగాది అంచుకొన్నది. ఈ యేడు కుప్పలన్నీ తొందరగా నూర్పించాలనీ, ధాన్యం కొట్లో చేర్పించాలనీ రెడ్డికి తొందరపుట్టింది. ఏమో - కాలం చూడవస్తే బాగుండడంలేదు. యుద్ధంవచ్చి బర్మానుండి బియ్యం సరఫరా కాక సర్కారువారు లేనిపోని కంట్రోళ్లు పెట్టి రైతుల కంఠానికి గండకత్తెర తీసుకొనివచ్చారు. బెంగాలుదేశంలో బ్రహ్మాండమైన కరవు వచ్చి జనం తండాలు తండాలుగా చచ్చిపోతున్నారట. ఈసంవత్సరం పైర్లన్నీ అసలు పొలం మీాద ఉండంగనే దేశరక్షణచట్టంక్రింద జప్తీచేసి సర్కారు వారు స్వాధీనపరచుకొంటారని ఆ మధ్య అనేకమయిన పుకార్లు బయలుదేరినవి. కోత లెట్లనో అయిపోయి కుప్పలు పడ్డవి. సర్కారువారు కుప్పలమీాద స్వాధీనం పెట్టుకొన్నా పెట్టుకోవచ్చు. తన కెంత పలుకుబడిగల అధికారా లున్నా, చట్టం బయల్దేరి బిగుసుకొన్న తర్వాత తాను రావుసాహే

బును అంటే విడిచిపెట్టుతారా? అయినా చెయ్యి కాలేదాకా పట్టుకొని కూర్చోడం దేనికి? ఎందుకయినా మంచిది పొలం మీాద ఉన్న పదికుప్పలూ తొందరగా నూర్పించి గింజలు కొట్లో చేర్చుకొంటే పడవలమీాద దొంగతనంగా దాటేసే ఏ కోస్తా వర్తకులకయినా బ్లాకుమార్కెట్టులో బేరం తెగ్గొట్టుకొంటే, కొన్ని కాకపోతే కొన్ని పుట్లయినా సర్కారుకు దక్కకుండా దాటించుకోవచ్చు అని సుబ్బుల్ని పిలిపించి "మంచిరోజు చూచి ముందు బాడవచేలో పెద్దకుప్ప పడదొక్కించరా" అని చెప్పాడు రామిరెడ్డి.

రామిరెడ్డి ఆజ్ఞ సుగ్రీవాజ్ఞ సుబ్బులికి. ఆ మరునాడే-తెల్లవారితే బేస్తవారమనగా, బుధవారం రాత్రికే కుప్ప పడగొట్టించాడు సుబ్బులు. అది సామాన్యపు కుప్ప గాదు - అరవై డెబ్బయి పుట్లు అయ్యే అలవిమాలిన కుప్ప. తాటిచెట్టు ప్రమాణాన ఉన్నది. ఒకటోరకమైన జెట్టీవంటి మనుష్యులను నలభయిమంది మాలవాళ్లని కూలికి ఏర్పాటు చేసి ఇరవై ఇరవై వంతున వాళ్ళను రెండుఉద్దీలుగా ముడదలు పెట్టించి తూర్పుతట్టు ఒక ఉద్దీ, పడమటితట్టు ఒక ఉద్దీ కుప్ప ఎక్కించి వినాయకుడి కట్ట తాను దగ్గరనే ఉండి పడదోయించాడు సుబ్బులు. వంకాలు చేతిలో తీసుకొని ఆ రెండు ఉద్దీల వాండ్లూ కిలారించుకొంటూ కుప్ప ఎక్కేసరికి అంత లావు కుప్పా జవజవలాడి సన్నగిలిపోయింది. కుప్ప పైకెక్కి తట్లు మారేవాండ్లు మారుతుంటే, క్రింద పొలిబద్దలు చేతబట్టుకొని

నూరు పెద్దపసరాలను కుప్ప చుట్టూ తిప్పి తొక్కించేవాళ్ళు తొక్కించి, తొక్కిన గడ్డిని కలిమెట్టు కట్టేవాండ్లు కట్టుతున్నారు. అయిపాయె—రాత్రి రెండుజాములకు పడవేసిన కుప్ప తెల్లంగా తూర్పురేఖ లారేసరికే పూర్తిగా లోబడిపోయి గింజ దులిపి తొండివెంటిమీద కడిమి కట్టడంకూడా పూర్తి అయిపోయింది. ఇంక గడ్డి విదిలించి వామి వేయడమే తరువాయి. పొద్దు పడమటికి వాలేసరికి వామి పూర్తిగా వేసేసి, కళ్ళం జారడం, చేగుడు వేయడంకూడా అయిపోయింది. ఆనాడు వడ్లు పోగుచేసి అడ్డబోతులు వేసేసరికి చీకటిపడినందున ఆ రాత్రికే ఇంకోజట్టు కూలీలను పిలిపించి వెంటనే తూర్పారబట్టాలని అనుకొన్నారుగాని చీకటిపడే వరకు పడమట కొద్దిగా మబ్బులేచి పైరుగాలి మట్టగించేసరికి ఆ పని నిలుపుదల చేసుకొని అడ్డబోతులమీదనే ముద్రపిండి పెట్టి పలక అద్ది గుర్తులు పెట్టించి చినుకుపడినా నీరు దిగకుండా గడ్డి కప్పించాడు సుబ్బులు.

ఆ రోజంతా సుబ్బులు పొలంపనిమీదనే నిలిచిపోయాడని రామిరెడ్డికి తెలుసు. అంతలావు కుప్ప పడదోసి తొక్కిస్తున్నప్పటికీ తానొకసారి పొలంచాయ పోయి చూచి రావాలన్న ఆలోచన అతగాడికి తట్టనేలేదు. కనుచీకటి పడ్డతర్వాత ఒకసారి సుబ్బులింటికి పోయి ఏకాంతంలో రమణితో ముచ్చటించి రావాలనిమాత్రం ఆలోచన పుట్టింది. పోవాలనుకొంటే తన కభ్యంతరమేమున్నది! ఆ యిల్లు

దూరమా భారమా? తన మండువాలోగిలికి ఉత్తరం ధాన్యపు కొట్లూ, దాని వెనక పశువులసాలా, దాని కానుకొని కొబ్బరితోటా, తోటలో ఈశాన్యంమూలను సుబ్బులు యిల్లూను. ధాన్యపుకొట్లూ, పశువులకొట్టం, కొబ్బరితోటా తణిఖీ చేసుకొంటూ వెళ్లినట్లు ఒక్కడూ చేత కర్ర పట్టుకొని సుబ్బులింటికి వెళ్లాడు. ఇంటిముందు పందిరిలో నులకమంచం వేసి యింటితలుపు గొళ్లెం బిగించి, యిల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. రమణి ఎక్కడకు పోయిందా అని ఆలోచనలో పడుతుండగనే ఇంటి వెనక తడికలచాటున నీళ్ళశబ్దం వినవచ్చి రెడ్డి పడమటివేట్లు తడకచాటుకు పోయి నిలబడి సందులోకి తొంగి చూచాడు. రమణి సున్నిపిండి తీసి కళ్లుమూసుకొని ముఖం రుద్దుకొంటోంది. రెడ్డి ఆదృశ్యం చూడనూలేకపోయాడు; ఆ స్థలం విడిచి బయటపడనూలేకపోయాడు. పొలం నుండి సుబ్బులు ఇంటికి వచ్చేవేళేమో అనిపించి, ఇది సమయం కాదని వెనక్కు తిరిగి వెళ్లాడు.

రెడ్డి వైదొలగిన పావుగంటకే సుబ్బులు అసురుసురయి యింటికి ఘటం చేరవేసి నెత్తిమీది గుడ్డ తలక్రింద పెట్టుకొని నులకమంచంమీద వెల్లకిలా పండుకొన్నాడు. పున్నమి ముందు దశమో ఏమో అప్పటికే చిక్కని వెన్నెల నల్లని కొబ్బరాకులమీదుగా జర్రున జారిపోతోంది. గాలికి కదిలే కొబ్బరాకులు వెన్నెట్లో వెండిబెత్తాలవలె తళతళమంటున్నవి. ఆ చంద్రుని ధాటికి తాళలేక సన్నటి చుక్కలు

దూరంగా లేచిపోయి కొబ్బరాకుల సందుల్లో రెప్పలార్చు కొంటున్నవి. కొబ్బరిమట్టల సందున గూడు కట్టుకొన్న రెండు తెల్లకొంగలు వెన్నముద్దలవలె కూర్చొని సుబ్బులు దృష్టికి విందుగొలుపుతున్నవి. రెడ్డిగారి పశువులసాలలోని ఆవుదూడ అంబా అని పాలకోసరం అలమటించిపోతుంటే, చూడలేని గోమాత పొదుగులో పాలు చేపి మెడపలుపు లాక్కొంటూ మేతమేయడం మరచి పోతోంది. ఒక సన్నని పిల్లగాలి తెర సుబ్బులు చెవిలో ఏవో రహస్యాలు చెప్పి పైకి తేలిపోయింది.

మంచందగ్గరగా వచ్చి తన ప్రియుణ్ని చూచుకొని జాలిపడి ప్రక్కన కూర్చొని, అతని చెక్కిలిమీద చెయ్యి వేసి నెన్నుదురు నిమిరి...

"ఉడుకు నీళ్లున్నాయి. లేచి తానమాడు, బడలిక తీరుతుంది" అన్నది రమణి.

కన్నులు విప్పి చూచాడు సుబ్బులు.

"వయస్సులో నీకు తెలియడంలేదు గాని ఈ విధంగా వొళ్లు విరుచుకొని పనిచేస్తే ఎంతకాలం తట్టుకొంటుంది ఈ శరీరం? వేళ కిన్ని మెతుకులు తినడానికి కూడా నోచుకో లేదే? లే; లేచి తానంచెయ్యి" అంటూ సుబ్బులు మొఖంమీద చెక్కిలి పెట్టి, ఒక కన్నీటిబొట్టు అతగాడి కపోలం మీద విడిచింది రమణి.

"అన్నం తిని పెందలాడే పొలం పోవాలి మళ్లా. కళ్లంకాడ కాబ్దారీ ఎవ్వరూ లేరు. తొందరగా నీళ్లు పెట్టు: నీళ్లోసుకొంటా" నంటూ సుబ్బులు కూర్చున్న రమణి భుజాలమీద చేతులానించి ఆమెను దగ్గరగా తీసుకొన్నాడు.

లేచి స్నానంచేసి అన్నం తిని చెప్పులుతొడుక్కొని కర్ర చేత బట్టుకొని కళ్లందగ్గరకు వెళ్లిపోయాడు సుబ్బులు.

కొబ్బరిచెట్టుమీది కొంగలు గూటిలోచేరి కూర్కు పెట్టినవి. ఆవుదూడ పాలుతాగి పడక వేసింది. దశమిచంద్రుడు కొబ్బరిచెట్ల చాటుకు తప్పుకొన్నాడు.

బోర్లించిన గంపమీద ప్రమిద దీపం పెట్టుకొని ఈతాకు చాపమీద కూర్చుని రాఘవయ్యగారు బహుమతి చేసిన "మాలపల్లి" తీసి కళ్ల కద్దుకొని వెనుకటిరోజు తర వాయి చదువుకొంటోంది రమణి.

"అగ్గిపెట్టె ఉంటే ఇయ్యి" అని అడుగుతూ వాకిట్లో ఒకమనిషి నిలబడి చుట్టమొన కొరికి పళ్లసందున పెట్టి నాలుకతో తడుపుతూ చేత్తో తిప్పుతున్నాడు.

పిడుగుపడ్డ ట్టనిపించి అదిరిపడి లేచింది రమణి.

"అగ్గిపెట్టె యిస్తూ; చుట్ట కాల్చుకోవాలి" అని అగ్గిబిచ్చం అడిగాడు ఆ మనిషి.

"ఎవరండీ మీరూ?" అని అడిగింది రమణి.

"మరచిపోయావ్రూ అప్పుడే? నేను రామిరెడ్డిని" అన్నాడు ఆ మనిషి.

రమణిగుండెలు టపటప కొట్టుకొన్నవి. రెక్కలు టప టప కొట్టుకొంటూ గూటిలోనుండి బయటికి వచ్చి కొబ్బరి చెట్టుమీద వాలినవి కొంగలు.

ఆ రామిరెడ్డిని మంచంమీద కూర్చోండని గౌరవించాలో, చుట్ట ముట్టించుకోను అగ్గిపెట్టె యివ్వాలో ఇవ్వ కూడదో ఆమె కర్థం కాలేదు. కలగదొక్కుకొంటున్నది రమణి.

"ఇంట్లో అగ్గిపెట్టె లేదాయేమిటి పిల్లా! కొత్త కాపురం కాబోలులే" అన్నాడు రెడ్డి.

"పొయ్యిలో నిప్పు ఉన్నదేమో తీసుకొనివస్తా నుండండి" అని వంట పొయ్యికాడికి పోయి చూచింది రమణి; కాని పొయ్యి శూన్యంగా ఉండి పోయింది. అగ్గిపెట్టె కనిపించ లేదు.

వాకిట్లోకి వచ్చిన పెద్దమనిషి చుట్ట కాల్చుకోను నిప్పయినా లేదని చెప్పడానికి నోరు రాక, తను అగ్గిచూపి తేనే కాని వాకిట్లోనుండి కదలనని శపథం పట్టినట్లు కనిపించే రెడ్డిని కాదనలేక గంపమీద పెట్టిన వేపచమురు ప్రమిద దీపం తెచ్చి గడపలో నిలబడ్డ రెడ్డి కందిచ్చింది రమణి. రెండడుగులు ముందుకు వేసి, ప్రమిద తాను తీసుకోకుండ గనే చుట్ట ముట్టించడానికి మూతి దగ్గరగా పెట్టినట్టే పెట్టి ఉఫ్‌మని ఆమెచేతిలో దీపం ఆరిపేశాడు రెడ్డి. ప్రపంచం

అంధకారమైపోయి కళ్లు చీకట్లుకమ్మి గడగడ వణకుతూ చేతిలో ప్రమిద జారవిడిచి వెనక్కు తగ్గింది రమణి.

గడపలోపల ఎడమ కాలు పెట్టి "ఇంత భయ మెందుకు యానాది పిల్లా" అంటూ ఆమెచెయ్యి పట్టు కొన్నాడు రెడ్డి.

అన్నిటికంటెనూ బలవత్తమమయినది అవసరం. ఆమె కాగడియలో ఏమేమి భావములు మనస్సులో ఉదయించి నవో, వాటి పరిణామమేమో ఆమెకే తెలియదు ఆస్థితిలో.

"మీవంటివారి కిది తగదు" అంటూ ఆయన గుండెలమీద తన కుడిచెయ్యి అదిమి, బలముతో వెనక్కు ఒక్కతోపు తోసింది రమణి. అంతలావు రెడ్డి బెండు ముక్కయిపోయి గడప అవతల ఆరడుగుల దూరంలో వెల్లకిలా పడిపోయాడు. తలుపుమూసి లోపల ఇనుపగడియ బిగించింది రమణి.

ఏనుగంటి రెడ్డి పీనుగయిపోయాడు. కింద మట్టిలో పడ్డ మనిషి లేచి గుడ్డలు దులుపుకొన్నాడు. రెక్కలు టప టపమని కొట్టి చప్పట్లు చరిచి అతన్ని వెక్కిరిస్తూ ఆ చెట్టు మీది కొంగలు ఈ చెట్టుమీది కెగిరివచ్చినవి. తన స్థితి చూచి చంద్రుడు చేసిన అపహాస్యం కొబ్బరిచెట్ల సందుగా అతనిమీద పడి అతన్ని నులిమేస్తోంది. బిగించిన తలుపు తీయనే లేదు రమణి. ఇక తీస్తుందన్న ఆశకూడా కనిపించటం లేదు. రమణిని ఆక్షణంలో మసిచేయాలన్నంత క్రోధాగ్ని అతని

గ్రుడ్లలోనుంచి మిణుగురులు కక్కుతోంది. ఆ యానాది దాన్ని లోపలనే పెట్టి కొంపకు బయట నిప్పంటించాలని అతని కావేశం కలిగింది.

చొక్కా చేతులు పైకి లాక్కొని తువ్వాలుతో వీపు దులుపుకొని ఒక విచిత్రమయిన స్థితిలో ఇంటికి వెళ్ళిపోయాడు రామిరెడ్డి.

## 9

ఆరాత్రి రమణికి కాళరాత్రి అయిపోయింది. తలుపు తెరవడానికి భయపడి చీకటింటిలోనే ఉండిపోయింది. దీపం ముట్టించడానికి అగ్గిపెట్టె కనిపించలేదు. సుబ్బు లెత్తుకొని పోయాడో యేమో. చెయ్యిజారి ప్రమిద వాకిట్లోనే బ్రద్దలై పోయింది. కిరసనాయిలు రేషనింగులో సుబ్బులు సంసారం కరణంగారి జాబితాలో చేరనందున గ్రామంలోని ఇతర యానాది గుడిసెలతోబాటు సుబ్బులింటికి కూడా రేషనింగు కార్డు లేక బుడ్డిదీపం కూడా కరవే అయిపోయింది రమణికి. కమ్మవారిపాలెంలో తనతల్లి అవెన్యూ రోడ్లమీద ఏరి తెచ్చిన వేపవిత్తనాలు ఎండబెట్టి ఆడించుకొన్న చమురు తాను వస్తూ ఒకదుత్తెడు తెచ్చుకొని దానిలో ఏకులతో దూదివత్తి చేసిపెట్టుకొని కాలక్షేపం చేస్తోంది రమణి. లోపల దీపం వచ్చేవిధం ఆమెకు కనిపించలేదు.

ఎన్నడూ పిరికితనమంటూ ఎరుగని ఆమనిషి తన ఇంట్లో పేరుకొనిపోయిన గాఢాంధకారము భరించలేకపోతున్నది. లోపలినుండి ఎవరినన్నా పిలుద్దామన్నా తన యింటికి చుట్టుప్రక్కల దగ్గరలో ఇండ్లు లేవు. తన సుబ్బులుఖామందు రామిరెడ్డిదగ్గర ఇటువంటి చపలత్వం వున్నదని ఆమె యెరుగదు. తన నాథుడు ఇంటలేని సమయంలో ఆ రెడ్డి ఇంతపనికి పూనుకోడానికి కారణం తన బీదస్థితే కాదూ? యానాది కులంలో పుట్టడమే కాదూ తాను చేసుకొన్న మహాపరాధం? అదే తనతో సమాన ఛాయాగల మరొక రెడ్డిపడుచు అయినట్టయితే ఆ రెడ్డికీ దొమ్మలుంటాయా? భోరున పొర్లివచ్చే దుఃఖాన్ని ఆపుకోలేకపోయింది. ఈతాకు చాపమీద పడిపోయి వెక్కి వెక్కి యేడ్చింది రమణి.

తనకు జరిగిన పరాభవం సుబ్బులు చెవిని పడితే ఏమవుతుందో! ఆమె ఆవేదన మరణవేదనయిపోయింది. తా నీ సంగతి సుబ్బులుతో చెప్పడమా చెప్పకపోవడమా? 'మామా' అని మరిగిపోయే మనసుతో వెర్రిగా ఆక్రోశించింది. ఒక్క గూటిలో నివసించే పక్షులకు ఎడబాటు ఉండదని నమ్మింది రమణి. ఆ సమయాన మామ తన కెంత దూరమైపోయినాడు? సప్తద్వీపములు దాటి పారిపోయినట్టనిపించింది. ఆ మామ బాడవచేలో రెడ్డిగారి సొత్తు కాపాడుతుంటే తన మామసొత్తు దోచుకోడానికి వచ్చాడు రెడ్డి. అబ్బా అని విలపించింది రమణి.

## ఆమెరోదన మరణ్యారోదనమేనా?

పడమటితట్టు కిటికీనుండి లోపలి కొక్కసారి తొంగి చూచాడు దశమిచంద్రుడు. రాత్రి ఎంత ప్రొద్దుపోయిందో, లోపల ప్రవేశించిన చంద్రకాంతి ఇంటిలోని అంధకారంతో బాటు రమణి మనోవేదననికూడా కొంత ఉపశమింప జేసింది. చంద్రబింబం పడమటికి ఏటవాలుగా దిగజారిన కొద్దీ కిటికీలోని వెన్నెల ఇంటిలో గోడమీది కెక్కి గాంధిమహాత్ముని మీది కెగబ్రాకింది. ఆయన ముఖంలో దివ్యతేజస్సు వెలిగిపోతోంది. చీర చెరగుతో కళ్ళు తుడుచుకొని లేచి వెళ్ళి మహాత్ముని ఎదుట మోకరిల్లింది. ఆ మహాత్ముడు ఆమెవీపు నిమిరి, "అమ్మా! నీవు నాకన్న తల్లివి" అని లేవనెత్తి దగ్గరగా తీసుకొన్నాడు. "భారత జాతికి పట్టుకొన్నది దారిద్ర్యపిశాచం ఒక్కటే కాదమ్మా! దారిద్ర్యంకంటె భయంకరమైనది పిరికితనం అని తెలుసుకో. కమ్మవారిపల్లెలో చదువుకొనేరోజులలో రాఘవయ్యగారి దగ్గర నీవు నేర్చుకొన్న ధైర్యం ఈనాడేమయింది తల్లీ! ఆ ధైర్యం ఏటి అవతలనే అప్పచెప్పి ఈ గడ్డన పిరికి మందు తిన్నావా? నిర్భయం, నిర్భీతి – వీటిని మననం చేయి. సత్యాన్ని మరచిపోకు. అహింసను విడిచిపెట్టకు. నీవంటి వాళ్ళు పిరికితనంతో కంట నీరు పెట్టుకొని ఏడుస్తుంటే నీ యానాదిజాతికేకాదు, అసలు భారతజాతికే బ్రతుకేదీ? ఏడుపు వీరుల లక్షణం గాదు. చూడు! ఒకానొక రాక్షసుడు

వచ్చి నీ నఖశిఖ పర్యంతం కసాయివాడి కత్తితో చెండాడు తున్నా నీవు కంపించకూడదు తల్లీ! అప్పుడే నీకు స్వాతం త్ర్యం, స్వేచ్ఛా, గౌరవమూను...లే! లేచి నీవు ధైర్యం అవలంబించి నీ మామకు ధైర్యం చెప్పు'' అని ఆయన తనకు ఏమేమో చెప్పుతున్నట్టు అనిపించింది. చంద్రకళకు పడమటికొండ అడ్డుతగిలి తిరిగి తన యింట్లో అంధకారమే అలుముకొన్నది. నవనాళ్ళూ పట్టువదలి ఆమె క్రింద పడి పోయింది.

పడినతోనే ఎప్పుడు నిద్రపట్టిందో ఎంతసేపయిందో- తూర్పురేఖ లారి వాకిట సుబ్బులు వచ్చి 'రమణీ' అని తలుపు తట్టేవరకూ ఆమెకు మెలకువ రానేలేదు. అమృ తోపమానమైన ఆ ప్రియునివాక్యం చెవిని బడంగనే లేచి, దూకి తలుపు తీసింది. ''ఇంకా నిద్రేనా'' అని సుబ్బు లేమో చెప్పబోతుండగనే, ''మామా! వచ్చావా! ఇట్లారా! అబ్బా!'' అని తలుపు మూసి, అతనిని ఆపాదమస్తకమూ, ప్రతిపరమాణువూ ఆరాధించి, తన ఆత్మ - తన సర్వస్వం అతనిలో ప్రతిష్ఠించింది. అతనిని కదల నివ్వదు. తాను కదలదు. అర్ధగంటకాలం ప్రియుని ఉపాసించినమీాదట ఇరు వురికీ శరీరాలు తేలిక అయినవెంటనే లేచి వాళ్లు బయటకు వచ్చారు.

చద్దినీళ్ళు త్రాగి పొలం వెళ్ళిపోయాడు సుబ్బులు. రోజూ ఒకసారి రెడ్డిగారి భార్యదగ్గరకు వెళ్ళివచ్చే అలవాటు.

ఆనాడు ఇల్లు కదలలేకపోయింది రమణి. ఆ రెడ్డిగారింట్లో అడుగుపెట్టడానికి రోతనిపించింది. పెందలకడనే వంటచేసి, పెనిమిటికి పైటన్నం కళ్ళం దగ్గరకు పంపించి, తానింత తిని తలుపు బిగించి దీర్ఘాలోచనలో పడింది రమణి.

ఇంతటితో తనని రెడ్డి వదిలిపెడ్తాడా? జరిగిన పరాభవం అతనిలోని పౌరుషాన్ని ఇనుమడింపజేస్తుందిగాని, పుట్టిన తాపాన్ని ఉపశమింపజేస్తుందా? తనతోబాటు సుబ్బులుకూడా ఆ రెడ్డి ఆగ్రహాగ్నికి అహుతి అయిపోతాడేమో అని రమణి కంపించిపోయింది.

ఆ రాత్రి జరిగిన విషయం తన మామకు తెలియదు. ఆయన చెవిని వేయకుండా దాచడం ఎట్లా? ఆ మామసందునా తనసందునా దాపరికా లుండవచ్చునా? ఆమె కా దినమంతా కలవరపాటే మనస్సులో.

మహాత్ముని ఆత్మచరిత్ర తీసి చదువుకొన్నది. దక్షిణాఫ్రికాలో మోటారులోనుండి దిగిపొమ్మని ఒక తెల్లదొర మహాత్ముని చావగొట్టుతున్నాడు. ఆయన లక్ష్యపెట్టడం లేదు. "మాలపల్లి" తీసి చదువుకొన్నది; తన కూతురుశీలం కాపాడడానికి శిరస్సుతీసి నేలమీద పెట్టుతానని రామదాసు జ్యోతికి అభయప్రదానం చేస్తున్నాడు.

రమణి లేచింది. రాట్నం త్రిప్పింది. ఏదో పాట పాడింది. వాకిలి చిమ్మింది. తల దువ్వుకొని స్నానంచేసింది.

మంచి గుడ్డలు కట్టింది. ముఖాన్న కుంకుమ బొట్టు పెట్టింది. మహాత్మ్యానికి దీపారాధన చేసి పూజ చేసింది. అదివరకు నాయకుల మెడలో కట్టిన వాడిలిపోయిన పాత పూల దండలు తీసేసింది. తాను వొడికిన నూలు చిలపలు నలుగు రికీ నాలుగు మెడలో కట్టింది. వా రందరికీ ముఖాన కుంకుమ పెట్టి, లేచి నిలబడి కన్నులు మూసి దణ్ణంపెట్టింది.

ప్రొద్దు గ్రుంకి ఇంటికి రాగానే సుబ్బులుకు ఉడుకునీళ్లు పోసి కుంకుడుకాయతో వొళ్లూ వీపూ రుద్ది స్నానం చేయించింది. అతని తలకి కొబ్బెర చమురు రాచి, తల దువ్వి ముడి కట్టింది. విస్తట్లో అన్నం వడ్డించి—

"ఈ పొద్దుకూడా తిరిగీ పొలం పోవలెనా" అని అడిగింది.

"ఆహా!" అన్నాడు సుబ్బులు.

"ఎప్పటి కయ్యేను ఈ కుప్పనూర్పిళ్లు?"

"కళ్లం పూర్తిగా జారి ధాన్యం యింటికి చేరేసరికి ఇంకా రెండు రోజులు పట్టుతుంది."

"మామా! నీవు ఈ వరసన పగలూ రాత్రీ పొలంలోనే కాపురం చేయి. నేను ఇంటికాడ ఒక్కర్తినీ అల్లాడి పోతుంటా" నన్నది రమణి.

"పనిపడ్డప్పుడు వొళ్లు దాచుకొంటే ఎట్లా? పెళ్లాన్ని కరుచుకొని ఇంటికాడ కూర్చుంటే కడుపులోకి బువ్వో!" అని ఎగతాళిగా మాట్లాడినాడు సుబ్బులు.

"ఇంటికాడ రాత్రిళ్లు నేను ఒక్కదాన్నీ ఉండలేక ఇదవుతున్నాను. రాత్రిపూటకూడా నీకు పొలంలో పని ఉంటే నేనూ వస్తాను పద, ఇద్దరం ఆడనే ముడుచుకొందాం" అన్నది రమణి.

"నేను వద్దన్నానా? కళ్లంకాడనే గడ్డి కప్పి గుడిసె పెట్టించా. వరి చెత్తమీాద చాపేసి పండుకుంటే ఆ చల్ల గాలికి వొళ్లు తెలియదు" అన్నాడు సుబ్బులు.

ఇద్దరూ అన్నం తిని లేచి చెయ్యి కడుక్కొన్నారు. వక్కా, ఆకూ పెనిమిటి కిచ్చి, తానుకూడా ఇంత నోట్లో వేసుకొన్నది రమణి. పొద్దు పోయింది. ఊరు మాటు మణిగింది. తొందరగా వెళ్లి కళ్లంకాడి మనిషి నింటికి పంపి తేనేగాని వాడికి భోజనానికి పొద్దుపోతున్నదని సుబ్బులనే వరకు, రమణి, తలుపు బిగించి, పెనిమిటితో కళ్లంకాడికి పయనమై వెళ్లింది.

## 10

గతరాత్రి తలుపు వేసుకొని చీకటింట్లో రమణి ఎంత వేదన పడిందో దానికి రెండింతలు మరణబాధపడుతున్నాడు ఇంటిదగ్గఱ రామిరెడ్డి. రాత్రంతా కంటిమీాద కునుకుపట్టితే వొట్టు!

రమణివంటి మనిషి తనకు చిక్కకరాదు. తాను తలచుకొంటే ఆ గడ్డన కాదనడాని కెవరికి దొమ్మలున్నాయి?

తనవిషయం రమణి కింకా తెలియదేమో గాని, గ్రామంలో ఆబాలగోపాలమూ ఎరిగిన సంగతే. ఇంటికాడ చేసుకొన్న భార్య గాక అతను సాలిమనిషి పడుచుపిల్ల పెనిమిటిని ప్రోత్సహించి మిలిటరీలోనికి పంపి, ఆ పిల్లను దగ్గరకు చేరదీసి, దానికి పిల్ల కాలవగట్టున పెంకుటిల్లు కట్టించి, దాని పేర రెండెకరాల కయ్యి సెటిల్‌మెంటు వ్రాసి యిచ్చి పోషిస్తున్నాడు కూడాను. మొగవాడి జీవితంలో అప్పు డప్పుడు కొత్త రుచులు చవిచూస్తుంటేనేగాని అందం లేదని అతని భావం. అంత కాళ్లూ చేతులూ కట్టివేసుకొని పడి ఉండడానికి తన కేమి కర్మం కాలింది? చేతిలో డబ్బు లేకనా, పలుకుబడి లేకనా, వంట్లో రక్త మాంసాలు లేకనా? నిజానికి చెప్పాలంటే తనవంటి రెడ్డికి ఆ మాత్రపు పటాటోపం లేకుంటే ఈ కాలపు సంఘంలో చిల్లి గవ్వకు పనికి వస్తాడా తను? అసలు ఆ ఫ్రూళ్ళో రెడ్డిగారి ప్రాపకం దొరికితే నే చాలునని అల్లాడుతూ ఉంటారు అలగాజనం.

అలగాజనం లెక్కేమిటి? రెడ్డిగారి పల్లెకు ట్రాన్సు ఫరయివచ్చిన బోర్డుస్కూలు అయ్యవారమ్మలు ఎంతమంది తన మనస్సు మెప్పించి వెళ్లిపోలేదు? ఈసారి వచ్చే ఎన్నిక లలో జిల్లా బోర్డు ప్రెసిడెంటు పదవికి ఎన్ని వేలయినా ఖర్చు పెట్టి పోటీచేస్తున్నాడు కూడాను రామిరెడ్డి.

అటువంటి రెడ్డిని కాదని కాల దన్నిందే ఈ యానా దిది? దీని భృగు వెంత, ఇది ఎంత? అది నెట్టిన నెట్టడానికి

అబ్బా!—గుండెలమీద నొప్పి పెట్టడమే గాక, విసురుమీద వెల్లకిలా పడ్డాడేమో, నడుం బెణికినట్టు కూడా ఉన్నది. రవంత వల్లతప్పితే ప్రక్కనే ఉన్న పచ్చడిబండమీద పడవలసింది తల. దేవుడి దయవల్ల తప్పిపోయింది.

యానాదిదాని కింత తలపొగరేమా అని రెడ్డి కాక్రోశం. దేనిని చూచుకొని దీని కింత మిడిసిపాటుతనం? తన కిట్టి పను లిష్టంలేకపోతే పెద్దమనిషితో ఆ సంగతి నెమ్మదిగా చెప్పుకోరాదూ! మెడబట్టి నెట్టవలసిన ప్రమేయ మేమి వచ్చిందీ?

అయినా ఈ వ్యవహారంలో తనదే లోపమేమో! అది యానాదిది. కేవలం మూఢురాలు. దరిద్రగొట్టుది. ముందుగా ఇంత డబ్బాశ పెట్టి, నైతరంగా బుజ్జగించివుంటే లొంగుబాటులోకి వచ్చివుండేది. తొందరపడి, పెద్దపులి పడ్డట్లు ఒక్కసారిగా మీదపడేవరకు, పాపం పసిపిల్ల బెదురుకొన్నది. పశ్చాత్తాపపడ్డాడు రెడ్డి. ఈ వ్యవహారంలో మరి రెండోవాడి జోక్యం లేకుండా తనే అతిరహస్యంగా సారథ్యం చేసుకొని ఆ రమణిని సాధించుకోవాలని దృఢనిశ్చయం చేసుకొన్నాడు.

చుట్ట తీసి ముట్టించాడు. ఒక వందరూపాయల నోటు తనది కాదనుకొంటే కొండమీది కోతికూడా దిగివస్తుంది; రమణి ఒక లెక్కా అనుకొన్నాడు. మర్నాడు రాత్రి పది గంటలకు తిరిగి రమణియింటికి పోయి "భయపడకు. ఇవిగో

వందరూపాయలు. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తా. సుబ్బు లేమనుకొంటాడో అని సందేహించకు. నా విషయంలో వాడు సంతోషిస్తాడు గాని విచారించడు. నిన్నూ వాణ్ణీ కూడా బంగారు పిచ్చుకల్ని చేస్తాను'' అని తను స్వయంగా వెళ్ళి బుజ్జగిస్తే ఆమె తన చేతిలో వెన్నముద్దలా కరిగిపోదూ!

రెడ్డిమనస్సు ఉరకలు వేస్తోంది. కళ్లంలో కుప్పసంగతి మరచిపోయి ఆ రోజంతా చీకటికోసరం తపస్సు చేశాడు.

సూర్యుడ స్తమించి అతని తపస్సు ఫలించింది. చీకటి లేక వెన్నెల వచ్చినా అతని కార్యానికి దోహదమిచ్చి ఆప్యాయంగానే ఉన్నది. బాగా పొద్దుపోయి సుబ్బులు అన్నం తిని కళ్లంకాడికి పోయేసరికి రాత్రి పదిగంట లవుతుంది. కాళ్లకి చెప్పులు తొడుక్కొని, చేత కర్ర పుచ్చుకొని, జేబులో నోటుకాగితం పెట్టుకొని, సుబ్బులింటికి వెళ్ళి చూచుకొన్నాడు రెడ్డి. తలుపు తాళంవేసి ఇల్లంతా నిశ్శబ్దంగా ఉన్నది. అతనికి కాళ్లు చల్లబడినవి. పెనిమిటితో కూడా కళ్ళంలోనికి పోయిందికాబోలనుకొన్నాడు. అతనికి భయం కూడా వేసింది. స్తిమితం చెడి, సాలిమనిషింటికి పయనమై వెళ్ళిపోయినాడు రామిరెడ్డి.

# 11

పున్నమిగడియ లెదురయినకొద్దీ చందమామ కళలు ముదురవుతూ ఉన్నవి. చైత్రమాసపు గాడుపేమో, పగలు

## సన్నజీవాలు

కాచిన ఎండతీక్ష్ణం రాత్రికాచే వెన్నెలకు వెయ్యిరుచులు కలిగిస్తోంది.

ఇంటికాడ బయల్దేరిన రమణీ, సుబ్బులూ కాలవగట్టెక్కంగనే చెట్టాపట్టాలేసుకొని ఆ వెన్నెట్లో విర్రవీగిపోతున్నారు. ఊరినుండి ఒకమైలు నడిస్తే రెడ్డిగారి బాడవచేనూ, చేనుప్రక్కనే రెడ్డిగారి చిన్నచెరువూను. పిల్లకాలవలోకి నీళ్లు వచ్చినవెంటనే చెరువుకు నీళ్లు నింపుతారు. సుబ్బులు వెళ్ళి కళ్ళంకాడ కాపలామనిషి నింటికి పంపివేశాడు.

సుబ్బులుకూ, రమణికీ ఆ రాత్రి నిద్రవచ్చేటట్టు లేదు. బ్రహ్మాండమైన పెద్దకళ్ళం. కళ్లంచుట్టూ కోటగోడలా వలయాకారపు గడ్డికడిమి, వలయంలో నట్టనడుమ పోశారు అడ్డపోతులూ, వడ్లరాసీని. తూర్పార బట్టిన రాశిలో కీడికలూ, తరకలూ ఇంకా తొలగించనేలేదు సేద్యగాళ్లు. కళ్లంలో నిలిచిన గోరిగింజల కోసరం మాలెతలు చిమ్మివెళ్ళిన కళ్ళం కాబోలు వెన్నెట్లో అద్దంలా మెరిసిపోతోంది. తరకలు తొలగించి వేస్తే, మేలురాసి వాగళ్ళంకాడ పోయించి గంపలతో సెలగలు కొలిపించి బస్తాలు బళ్ళ కెక్కించడమే తరవాయి.

కడిమి కట్టిన వాగళ్లంచుట్టూ రమణీ సుబ్బులూ తిరుగుతున్నారు. ఒకసారి చెరువుగట్టెక్కారు. కలకతేరిన నీటిపై తేలిపోయే కలువపూలు గడకొంకితో గట్టుకు లాగి, రేకు లేర్చి, రమణిజడలో తురిమి ముక్కుదగ్గర పెట్టు

కొన్నాడు సుబ్బులు. గట్టుమీద కలకత్తా జామిచెట్టున రమణిలా దోరముగ్గిన పండొకటుంటే కోసి తన ప్రియురాలికిస్తే ఆమె సగం కొరికి ప్రియునినోటి కందిచ్చింది. ప్రక్కనున్న మామిడిగున్నలు విరియబూసి కమ్మని సువాసనలు కళ్ళంపైకి చిమ్ముతున్నవి. రెండు పావురాయిల జంట కళ్లంలో ముక్కు లీన్చుకుంటూ పాట పాడుతున్నవి. పిల్ల కాలవగట్టున టెలిఫోన్ తీగెలమీద రెండు కోయిలలు వాలి ఉయ్యాల ఊగుతూ పావురాయిల పాటకు శ్రుతి కల్పుతున్నవి. రాత్రిపూట దారితప్పిన రెండు పందుకోతులు కళ్ళంలో జొరబడి అల్లరిచేయసాగినవి. గుడిసెలోని చాప బయటికి లాగి, గడ్డి పరిచి పక్క వేశాడు సుబ్బులు. తాటాకుతో అల్లిన గడ్డిదిండొకటి తలక్రింద పెట్టింది రమణి.

సుబ్బులు నడుము వాల్చాడు. రమణికి నిద్ర రాదు: మనస్సు కలగుండుపడిపోతోంది. ఆమె నిలదొక్కుకొంటోంది. ఆమె మనస్సులో చెలరేగిన తుపాను అతనికి తెలియదు

పెనిమిటిప్రక్కలో కూర్చున్నది. ప్రియుని వక్షస్థలంపై చెయ్యివేసి నిమిరి—

''మామా'' అని పలకరించింది.

''ఊఁ'' అన్నాడు సుబ్బులు.

''నీవంటి మామ దొరకడం నా అదృష్టం'' అన్నది రమణి.

రమణిని దగ్గరగా తీసుకొన్నాడు సుబ్బులు.

"ఇంటికాడ ముసలివాళ్ళు - మా వూరు కమ్మవారు-రాఘవయ్యగారూ నిన్ను తలచుకొని ఎంత మెచ్చుకొంటారో నే చెప్పలేను" అన్నది రమణి.

తానొక మహాసామ్రాజ్యానికి చక్రవర్తి అయినట్టు పొంగిపోయాడు సుబ్బులు.

"ఎన్నిజన్మ లెత్తినా - నువ్వూ నేనూ ఇట్లనే పుట్టాలని నా కోరిక".

ఆమె చెక్కిలిపై తన పెదవులు మెదిపాడు సుబ్బులు.

"మామా! నాకేసి చూడు".

"..............."

"నీతో ఒక్కసంగతి చెప్పుతా! ఎవ్వరితోనూ చెప్పనని నా చేతిలో చెయ్యివేయి" అన్నది రమణి.

సుబ్బులుగుండె దడదడమన్నది. చేతిలో చెయ్యి వేశాడు.

"నీవు ఈ రెడ్డిని వదిలించుకోవాలి మామా."

సుబ్బులు నడుము జారిపోయి—

"ఎందువల్ల?" అని అడిగాడు.

"ఆయనసంగతి నీవు ఎరగవూ?"

"ఎరుగుదును."

"ఆ యింటిలో మనం ఉన్నట్టయితే ఆ రెడ్డి నన్ను నీకు దక్కనీయడు."

"అంటే?" అన్నాడు సుబ్బులు.

ఆమె నోరు పెగలలేదు. గొంతుక బిగుసుకొనిపోయిన ట్టయి, తన చేతులు అతని కంఠానికి చుట్టవేసింది.

అతని హృదయం, ఆమె హృదయం శరవేగంతో కొట్టుకొనిపోతున్నవి.

"ఎందు కీ యేడుపు?" అని ఆమె కన్నీరు తుడిచాడు సుబ్బులు.

"నిన్న రాత్రి నీవు యింటి కాడ లేకుండా చూచి, రెడ్డి మనింటికి వచ్చి దీపమార్చి నా చెయ్యి పట్టుకొన్నాడు."

సుబ్బులు చెవులలో హోరు బయల్దేరింది; రెండు చెవులూ మూసుకొని, చాపమీద వొరిగాడు.

"నాకు వొళ్ళుమండి మెడబట్టి నెట్టాను. ఆయన క్రిందపడ్డాడు. నేను తలుపు బిగించాను."

"ఆఁ!" అన్నాడు సుబ్బులు.

సుబ్బులుకు ముచ్చెమటలు పోసినవి. వరికళ్లం కుమ్మరి సారె తిరిగినట్టు గిర్రున తిరిగిపోతోంది. కళ్లు మూసుకొన్నాడు; తెరిచాడు. చంద్రబింబంలోని కళంకం నల్లగా మసికమ్మి అసహ్యమనిపిస్తోంది. చేతులు నడుము కానించి నిలబడ్డాడు.

"ఈ సంగతి నువ్వు ఎవరితోనన్నా చెప్పినట్టయితే, నన్ను చంపుకు తిన్నట్టే" అని ముదలకించింది రమణి.

సుబ్బులు కళ్లలో రామిరెడ్డీ, లక్ష్మమ్మా కదిలారు. కళ్లు మూసుకొని భోరున ఏడిచాడు సుబ్బులు. చీరచెరగుతో అతనికి విసురుతూ అంది రమణి—

"మామా! ఎందు కాయాసపడతావు? ఈ రెడ్డిని వద లించుకోలేకనే ఈ భయమంతా?"

సుబ్బులు పలకలేదు.

"నీకు ఇంతటి ఘోరం తలపెట్టిన మనిషిదగ్గర నీ వింకా ఉండవచ్చునా?"

సుబ్బులు మాట్లాడలేకపోతున్నాడు.

"నీవు, నేనూ కుక్కలం, పశువులం అనుకొన్నాడు రెడ్డి. కూటికి గతిలేని దరిద్రులం. నీకూ నాకూ విషం పోయా లని తలచాడు రెడ్డి."

సుబ్బులు కళ్ళు విప్పి ఆమె ముఖంలోకి చూచాడు.

"ఆనాడు మనకు రాఘవయ్యగారు చేసిన ఉపదేశం మరచిపోయావా? కూటికి బీదలమైనా, గుణానికి మనం బీదలం కామని ఈ రెడ్డికి తెలియజెప్పాలి. భయపడి 'దేహి' అంటే, నెత్తి అణగదొక్కుతారు బలవంతులు. నిలదొక్కు కొని ఎదురు తిరిగితే కాలు కదపలేరు. పిరికిపందలు."

సకిలించాడు సుబ్బులు.

"ఈ కమతం విడిచిపెట్టితే బ్రతకలేనని నీకు భయం వద్దు. నీకు నేనున్నాను; నాకు నీవున్నావు. మనిద్దరికీ రాఘవయ్యగారున్నారు. లే, వెళ్లి రేపే రెడ్డితో చెప్పి చక్కా రా! వెళ్లిపోదాం."

"లక్ష్మమ్మని విడిచిరావడం ఎట్లా రమణీ?" అని అడిగాడు సుబ్బులు.

"ఆమె ఈ కొడుకుని విడిచిపెట్టి వేరే కాపరం పెట్టితే నువ్వూ నేనూ ఆమె పాదాలు వొత్తుదాం."

"ఆమె అడిగితే ఏం చెప్పేది రమణీ!"

"నేను రమ్మని లాక్కొనిపోతున్నానని నామీద చెప్పు."

"అయితే కమ్మవారిపాలెం వెళ్లుదామంటావా?"

"కమ్మవారిపాలెం నీకిష్టం లేకుంటే మరొకపాలేనికి పోదాం" అన్నది రమణి.

చంద్రుడస్తమించి, చీకటిపడి తూర్పురేఖ లారకుండానే రమణి నింటికి తీసుకొనిపోయినాడు సుబ్బులు.

## 12

రామిరెడ్డి కమతం విడిచిపోవడానికి నిశ్చయం చేసుకొని, బాడవచేలో కుప్ప నూర్పించడం అయిన మర్నాడు రమణిని ముందుగా కమ్మవారిపాలెం పంపించి తాను వెనకనే నిలబడిపోయాడు.

యుద్ధానికి కూలీలు సప్లయిచేసే సందర్భంలోనూ, ఇంకా ఇతరపనులమీాదా అర్జంటుగా మాట్లాడవలసిన పని మీాద తహశీల్దారూ, కలెక్టరూ చెప్పి పంపితే రెడ్డి వెళ్ళి వారంరోజులయింది. ఎన్నడూ ఇన్నాళ్ళుండేవాడు కాదు. ఎందువల్లనో ఇంకా తిరిగిరాలేదు. అధికార్ల ప్రాపకం గట్టి పరుచుకోవడంలో రెడ్డిది అందెవేసిన చెయ్యి. అందులో యుద్ధం వచ్చినతర్వాత అదేమి తాపత్రయమో, అతనికి రెండోపని కనిపించడంలేదు. యుద్ధనిధికి గవర్నరుగారివద్ద ఇతడు స్వయంగా రెండువేలు చదివించాడట. చెన్నపట్నంలో దిగిన తెల్ల మిలిటరీ సిపాయీాలకు పనిలేక బజార్లలో పడు చులవెంట తిరుగుతుంటే వాండ్ల బాధానివారణార్థం ఏర్పరచిన నిధికి అడగకుండానే వెయ్యి రూపాయలు కట్నం చదివించా డట. డిస్ట్రిక్టకలెక్టరుగారు మకాంచేసినప్పుడు-యుద్ధంలో సిపా యీాల బుర్ర గొరగడానికీ, గుడ్డ లుతకడానికీ పాతికమంది మంగళ్ళనీ, పాతికమంది చాకళ్ళనీ తన పలుకుబడిమీాద సప్లయి చేశాడట! ఇక ఈ రెడ్డిగారంటే అధికార్లు చెవి తెగ్గోసుకొంటారు. తత్సంబంధమైన త్యాగఫలితంగానే ఈ సంవత్సరం ఉగాది కానుకల్లో రామిరెడ్డి రావుసాహేబు కూడా అయిపోయినాడు.

వారంరోజులుగా ఇంటికాడ లేడన్నమాటేగాని - రామిరెడ్డికి రమణిమీాదనే నిలిచిపోయినవి మరులన్నీ. బొందె అక్కడా, మనసు ఇక్కడా తిరుగుతున్నవి. ఏమయినాసరే

ఆ పిల్లని తన హస్తగతం చేసుకొని తీరవలసిందేనని - జ్ఞాపకానికి వచ్చినప్పుడల్లా తీర్మానించుకొంటూనే ఉన్నాడు. దానింటికి తాను స్వయంగా వెళ్లి చెయ్యి చేయనేచేసుకొన్నాడు. ఇంక నడుంగా విడిచిపెట్టితే ఎంత అప్రతిష్ఠ! అవసరమైతే సుబ్బులునయినా ఏదో మిషమీద వెళ్లదరిమి, ఆ పిల్లని చీలదీసి తనింటికాడ నిలుపుకోవలసినదే. సుబ్బులట్లా లేచిపోయినవెంటనే దానిపేర అయిదెకరాల కయ్యా, కొబ్బరితోటలో సగం వ్రాసి యిచ్చి, పూరికొంప తీసేసి పెంకుటి భవంతి వేసిపెట్టవలసిందే! సుబ్బులు సంసారం కొబ్బరితోటలో చేర్చి తల్లి తనకెంత మహోపకారం చేసింది! రమణి తన పిడికిటిలో చిక్కిపోయిందని దృఢపరుచుకొన్నాడు. ఉరకలు వేసుకొంటూ, వెళ్ళిన వారంరోజులకు ఇంటికి తిరిగి వచ్చాడు రెడ్డి.

భోజనంచేసి రవంత విశ్రాంతి తీసుకొన్నాడు. సాయంకాలం నాలుగుగంటలకు కాఫీ పుచ్చుకొని, రమణి వ్యవహారం ఏదో తొందరగా తేల్చుకోవాలని అనుకొంటుండగా, వెదికే తీగ కాళ్ళకి చుట్టుకొన్నట్లు సుబ్బులే వచ్చి అరుగువారగా నిలబడి——

"వచ్చే తొలేకాదశి పండగకి నేను నిలిచిపోతానండి. వేరే మనిషి నేర్పాటు చేసుకోం"డని నేల బొటనవ్రేల రాస్తూ నిలబడ్డాడు.

ఇది స్వప్నమా, నిజమా? రెడ్డి కర్థం కాలేదు. తనంతట సుబ్బులే వచ్చి ఈ మాట అంటాడని రెడ్డి అనుకోలేదు. నిలిచిపోవడం అంటే? తానొక్కడే నిలిచిపోతాడా? నిలిచి పోయి ఎక్కడకు పోతాడు? పోతే కూడా రమణిని తీసుకొని పోతాడా, దాని నిక్కడ విడిచిపోతాడా?

అయితే వాడంతట వాడే నిలిచిపోతానని చెప్ప డానికి కారణం? ఆ రాత్రి ఆమె చెయ్యి పట్టుకోవడమేనా తను చేసిన మహాపరాధం? రెడ్డికి రవంత ఖంగారు కలిగింది.

"నౌకరీ మానుకొంటా నంటావు. కారణ మేమిటి?" అని అడిగాడు రెడ్డి.

"నా భార్యకు ఇక్కడ ఉండడం ఇష్టంలేదు" అన్నాడు సుబ్బులు.

"ఎందువల్ల? చేదుమేసిందా?"

"దానికీ గడ్డన ఉండడం చేదనిపించి రోతగా ఉన్నది".

"దానికి రోతనిపిస్తే నీకో?"

"నాకూను."

"అయితే ఆడది ఎట్లా ఆడమంటే అట్లా ఆడతావా?"

"మేము యానాదులం."

"నీకు పౌరుషం లేదూ?"

"ఉండబట్టే లేచిపోతున్నాను."

"లేచిపోయేవాడివి మిలిటరీలోకి లేచిపోరాదూ? దున్నపోతులా ఉన్నావు! కడుపునిండా కూడూ, వంటినిండా గుడ్డా యిస్తారు. జీతం యిస్తారు."

సుబ్బులు పలకలేదు.

"అక్కడ నీ మనవర్తికి సరిపోగా నెలనెలా ఇక్కడ పెళ్ళానికి పదిరూపాయల డబ్బులు పంపినా బ్రతికిపోతుందే? నౌకరీ మానుకొని ఏమి తింటావు?"

సుబ్బులు నిలదొక్కుకొంటున్నాడు.

"నామాట విని మిలిటరీకి పో. నేను తహశీల్ దారుతో చెప్పివచ్చాను. నీ భార్య నిక్కడనే ఉంచు. ఇంట్లో పనీ పాటా చేసుకొని బ్రతుకుతుంది. దాని కేమీ దిగులు లేకుండా చూచే భారం నాది."

సుబ్బులుకు రోషం, దుఃఖం కలిసి పొంగిపోతున్నవి.

"ఇంటికాడ ఉన్నది కాబోలు - రెడ్డిగారు నిన్ను సాకుతా నంటున్నారు; నన్ను మిలిటరీకి పొమ్మంటున్నారు అని చెప్పి వొప్పించిరా" అన్నాడు రెడ్డి.

"ఆమనిషి కమ్మవారిపాలెం వెళ్ళిపోయింది" అన్నాడు సుబ్బులు.

"ఆఁ! ఎప్పుడూ? ఇప్పు డింటికాడ లేదూ?"

"లేదండీ"

"చూశావా! నీవంటే దానికి గడ్డిపరక ప్రమాణంరా.

జుట్టు పట్టుకొని కూర్చోబెట్టకపోయావూ! వొట్టి చవట దద్దమ్మవురా'' అన్నాడు రెడ్డి.

సుబ్బు లక్కడ నిలవలేకపోయాడు. గిర్రున తిరిగి వెళ్ళిపోతుండగా—

''ఇదిగో! ఈ రాత్రికే ఆలోచించుకొని, ఉదయాన్న ఏ సంగతీ నిఖరుగా చెప్పాలి. నిన్ను నమ్ముకొని తెల్లవారే సరికి మిలిటరీకి ఒక మనిషిని సప్లయి చేస్తానని తహశీల్ దారుకు మాటయిచ్చి వచ్చాను'' అని అంటూ, పోయే సుబ్బుల్ని హెచ్చరిస్తూ ఇంటిలోకి లేచిపోయాడు రెడ్డి.

మిలిటరీ అనేసరికి సుబ్బులుకు భోరున దుఃఖం వచ్చింది. కలకలలాడే యింట్లో రమణి లేక బావురుమంటోంది. తలుపుతీసి లోపల నులకమంచంమీద బోర్లగిలా పడి డొక్క లెగరేసి ఏడిచాడు. రమణిఉంటే అతగాడి కింత ధైర్యం చెప్పి ఊరడించేది. రెడ్డిగారి వ్యవహారం శ్రుతి మించిపోయింది. ఆ ప్రదేశంలో క్షణం నిలవడానికి వాడి కిష్టం కలగడంలేదు. పైన గుడ్డవేసుకొని తలుపు తాళంవేసి లక్ష్మమ్మతోనయినా చెప్పకుండా ఆ రాత్రికే యెకాయెకిని కమ్మవారిపాలెం వెళ్ళి పోయాడు సుబ్బులు.

## 13

తెల్లవారి లేచేసరికి సుబ్బులు కమ్మవారిపాలెం వెళ్ళా డని తెలిసింది రెడ్డికి. రమణితో సంప్రదించి రావడానికి

వెళ్ళి ఉంటాడని అనుకొన్నాడు రెడ్డి. చిలకలేరు దాటితే రెండుమైళ్ళు కమ్మవారిపాలెం. వెళ్ళడం ఎంత, రావడం ఎంత? చద్దన్నంవేళకే రావలసిన సుబ్బులు మధ్యాహ్నం పొద్దు తిరిగినా రాలే దేంకువల్లనా అని రెడ్డికదే ఆలాపనగా ఉన్నది. సాయంత్రానికయినా రాకపోతాడా!

సుబ్బుల్ని మిలిటరీకి పంపడం అన్నదే సర్వోత్కృష్టమైన కార్యం. వాడు మిలిటరీలోకే వెళ్ళినట్టయితే తాను వేసుకున్న ప్రణాళిక దిగ్విజయమే!

కాని, సాయంత్రం చీకటిపడ్డా సుబ్బు లింటికి రాలేదు. ఆ రాత్రికి ఓపికపట్టి ఊరుకున్నాడు. మర్నాడుకూడా వాడు రాకుంటే వాడికోసరం ముతరాచువాణ్ణి పంపాడు. కాని— వెళ్ళిన మనిషి చక్కావచ్చి సుబ్బులు రానన్నాడని చెప్పాడు.

"ఆఁ!" అని రెడ్డి గ్రుడ్లురిమాడు. అయితే సుబ్బులు తన కమతం విడిచి నిలిచిపోయినట్టేనా?

"వాడి తప్పు లేదు. వాడి ప్రాణానికి దాపురించింది పెళ్ళాం కాదు - రాక్షసి. అది వాడి కేదో మందుపెట్టి మనసు తిప్పేసింది. అదిగాక, కమ్మవారిపాలెం కాంగ్రెసు జెండాగ్రామం. యానాదివాళ్ళకు రాఘువయ్యగారి ప్రాపకం. సుబ్బులుగాని, రమణిగాని తన కంత సుళువుగా లభ్యపడే ఆశలే"దని నిర్ధారణ చేసుకున్నాడు రెడ్డి.

సుబ్బుల్ని మిలిటరీలోకి పోవలసినదని రెడ్డి అడిగిన విషయంగాని, రెడ్డి రమణిచెయ్యి పట్టుకుని లాగిన విషయం గాని లక్ష్మమ్మకు తెలియనే తెలియదు. స్వచ్ఛమైన స్ఫటికంలా వెన్న ముద్దవంటి ఆమెహృదయం సుబ్బులుకోసరం, రమణికోసరం అలమటించి, కాగి, మరిగిపోతూ—

"అబ్బాయీ! కమ్మవారిపాలెం వెళ్లినా సుబ్బులెన్నడూ ఇన్నాళ్లు ఉండి ఎరగడు. ముసలివాడు—వాడి మేనమామ కెట్లా ఉన్నదో, వాడి కెట్లా ఉన్నదోరా" అని కొడుకు నడిగింది లక్ష్మమ్మ.

"ముసలివాడి కేం రోగం? ఆ యానాదిదానికి కళ్లు నెత్తికెక్కి సుబ్బడికి విషంపెట్టి పుట్టింటికి లాక్కొనిపోయింది. వాడు మన కమతంలో ఉండడం లేదని చెప్పి వెళ్లిపోయాడు" అన్నాడు కొడుకు.

"ఆఁ! మానుకోవడమే?" అని మొదలు నరికిన చెట్టులా పడిపోయింది లక్ష్మమ్మ.

"మానుకొని బెదిరిస్తాడా ఏమిటి? ఈఖర్శన్న కాకంటే మరో విస్సన్న. అసలు వాడి వ్యవహారం నాకీమధ్య బొత్తిగా బాగుండక, నేనే వాణ్ని నిలిపివేయాలని అనుకొన్నాను" అన్నాడు రెడ్డి.

"అయ్యో! వా డేం పాపం చేశాడురా" అని ఏడిచింది లక్ష్మమ్మ.

"ఏం చేయడ మేమిటి! పచ్చిదొంగ అయిపోయాడు వాడు. ఆ పెళ్లాం దాపురించిందిలగాయతు వాడు అసలు వొళ్లు వొంచుతున్నాడా? ఎంతసేపూ ఆ ముండతో తెయి తక్కలూ, భోగమాటాను. బాడవచేలో అంతలావు కుప్పా వాణ్ని నమ్మి అప్పగిస్తే వా డాత్బ్లు మొదలక ఎక్కడి ధాన్యం అక్కడ పలాములయిపోయినవి. ఆ ముండ చెప్పడం, వీడు కట్టలు కట్టలు కమ్మవారిపాలెం అత్తగారింటికి వడ్లు దాటవెయ్యడమూనట. నీ కేం తెలుసు వాడి సంగతి!" అన్నాడు రామిరెడ్డి.

"రామ రామ! నే వినలేకపోతున్నానురా" అని కళ్లు తుడుచుకొన్నది లక్ష్మమ్మ.

"వాడికి వినాశకాలం దాపురించిందిలే. లేకుంటే వాడు నాతో చెప్పనయినా చెప్పకుండా ఆ కుక్కమూతి పిందెను పెళ్లి చేసుకొనివస్తాడా?" అన్నాడు రామిరెడ్డి.

"నారాయణమూర్తి! నా కెందుకు పోశావో యీ ఆయువూ?" అన్నది లక్ష్మమ్మ.

"వా డికమీద తిరిగివస్తేమట్టుకు నేను గుమ్మం తొక్కనిస్తానా? నా కంటికి వాడు కనిపించాలి—నిలువునా చీల్చి కొరతనివేయకపోతే నేను కృష్ణారెడ్డికొడుకును కాదు" అన్నాడు రెడ్డి.

లక్ష్మమ్మకు కాళ్ళల్లో దడపుట్టింది. తనకు తెలియకుండానే వ్యవహారం చాలాదూరం ముదిరిపోయిందని

గ్రహించింది. తన కొడుకుది భల్లూకపు పట్టు. తగిలేసి ఎరగడు, తప్పేదీ ఎరగడు. ఆ యానాది బిడ్డ లిద్దరూ అర్భకులు. తన కొడుకు దెబ్బకు వాళ్లు ఈగలూ, దోమలూ అయే రోజు వచ్చిందని నిశ్చయించుకొన్నది. ఆకొడుకుదగ్గర నిలవలేక, పశువుల సాలలోకి పోయి, కొబ్బరితోట తిరిగి సుబ్బులుఇల్లుచూచి గుండెలు బాదుకొన్నది. "సుబ్బులూ! నా నాయనా! నాతో చెప్పకుండా పారిపోయావటరా! ఇక నాకు కనిపించవటరా" అని గోలపెట్టింది. ఒక్కసారి వెళ్లి, ఆ చిన్న కొడుకునూ, ఆ కోడల్నీ కరవుతీరా కౌగిలించుకోవాలని ఆమె ఆరాటం!

ఆతోటలూ దొడ్లూ చూచి భరించలేకపోయింది లక్ష్మమ్మ. కొబ్బరితోటకు ప్రేతకళ పట్టింది. ఆ చెట్లమీద అన్ని కొంగ లుండేవి. ఒక్కపక్షీ కనిపించదు. పశువులసాల పీనుగులసాలలా భయంకరంగా ఉన్నది. బండెద్దులూ, దుక్కిటెద్దులూ డొక్కలు దించుకొనిపోయి మేత మేయక గుంజలకాడనే శవాకారాలతో చెవులు నిక్కబెట్టి అట్లనే నిలబడిపోయినవి. పడమటావు — సుబ్బులు కూర్చుంటే, చిటికెన వ్రేలంతలావు ధార, నిలువునా నాలుగుశేర్లిచ్చే ఆవు—దూడని దగ్గరకు రానీయడం లేదు. రెండు గమిడి గేదెలూ పొదుగు లీచుకొనిపోయి, పెయ్యదూడల్ని తన్ని పారేస్తున్నవి. ధాన్యపు కొట్లు పందికొక్కులపాలయి, ఒక్కొక్క కొట్టుక్రింద వందబళ్ల మట్టి మేటవేసుకొనిపోయింది.

అరటితోటలో చీలిపోయి ఎండిపోయిన ఆకులే గాని - కళ్లు పొడుచుకున్నా గెల కనిపించడంలేదు. కొబ్బరిచెట్లకు మోవుల్లో పురుగుపట్టిందో ఏమో, తలలు వాల్చి పుచ్చెలు రాలిపోతున్నవి. రెండు మండువాల లోగిలి - పెంకు తిరగ వేయించే దిక్కులేక, కోతుల దెబ్బకు కప్పు అంతా బీభత్సమై సూర్యచంద్రులు నట్టింట్లోనే కాపురం చేస్తున్నారు. లక్ష్మమ్మ దొడ్డి అంతా తిరిగి తిరిగి శోష వచ్చి ఇంట్లో కాలు పెట్టే వరకు శుక్రవారపు పొద్దు, చీకటిపడ్డా ఇంట్లో దీపం లేదు. పసిపిల్లలు అన్నమో అని గోలచేస్తున్నారు. రెడ్డి స్నానం చేయడానికి నీళ్లకింద దుగ్గుఅయినా దొరకలేదు.

లక్ష్మమ్మ ఆరాత్రి అన్నం తినలేదు. "సుబ్బులూ, సుబ్బులూ" అని విధి విరామం లేదు ఆమెనోటికి.

ఏమి పనిబడ్డదో - తెల్లవారు జామున గుర్రబ్బండి కట్టుకొని, పెళ్లాంతో కూడా తల్లితో చెప్పకుండా వెళ్లి పోయాడు రామిరెడ్డి.

లక్ష్మమ్మ సుబ్బులూవాళ్ల ఎడబాటు భరించలేకపోతు న్నది. వాళ్లని రావలసినదని చెప్పి పంపితే వస్తారో రారో అని ఆమె సందేహం. తానే వెళ్లి వాళ్ళ నొకసారి చూచి రావాలని నిశ్చయించుకొన్నది. చీకటిపడేవేళ రెండుమైళ్ళ దూరంలో ఉన్న చిలకలేటికి తాను బండి కట్టుకొని వెళ్ళి రమణినీ, సుబ్బుల్నీ అక్కడకు పిలిపించుకొన్నది.

"నాయనా! నామీద అలిగి వెళ్ళిపోయావా!" అని సుబ్బుల్ని సందిట తీసుకొని వలవల ఏడిచింది.

"రమణీ! నువ్వుకూడా చెప్పకుండానే వెళ్ళి పోయావా? ఎంత పాపం చేశానే నేను" అని ఆమెను కౌగలించుకొని పసిపిల్లలా బారుమన్నది.

సుబ్బు లోకవంకా, రమణి ఒకవంకా - చిలకలేరు నిండిపోతోంది వారి ఏడుపులతో.

"అమ్మా! ఇంక నాకు నీచేతి ఋణం తీరిపోయింది. ఇంక నన్ను మరచిపో తల్లీ" అని బారుమన్నాడు సుబ్బులు.

"కమ్మవారిపాలెంలో ముసలివాళ్ళిద్దరూ బెంగటిల్లి పోతూంటే వచ్చేశాం" అని మాత్రం ఆమెతో చెప్పి, ఆమె నోదార్చి, ఆమెపాదాలు కళ్ళ కద్దుకొని, ఇంటికి సాగనంపి సుబ్బులూ, రమణీ ఇంటికి వెళ్ళిపోయారు.

# 14

రెడ్డిగారిపల్లెలో రామలింగేశ్వరస్వామికి కమ్మవారి పాలెంలో ఏర్పడ్డ ఏభయ్యెకరాల మాగాణిభూమి ఆస్తి రెండు గ్రామాలకూ పెద్ద గండగత్తెర వ్యవహారమై కూర్చున్నది. ఆ వ్యవహారం ఇప్పటికి పది పన్నెండేళ్ళుగా నానాబీభత్సం గానూ ఉన్నది.

అసలు ఆభూమి సుందరశివరావు అనే ఒక ఆర్వేల నియోగి పంతులిదట. ఆయన బి. ఏ. ప్యాసయి పట్నంలో నాటక కంపెనీలూ, సినీమాలూ, అచ్చాఫీసులూ పెట్టి, ఆ వ్యాపారాల్లో దెబ్బ తిని దివాలా తీశాడట. ఆ సందర్భంలో కమ్మవారిపాలెంలోని ఏభయ్యెకరాల భూమీ కమ్మ చలమానాయుడికి ఆ రోజుల్లో స్వాధీనపు అడుమానం పెట్టి పది హేనువేల రూపాయలు కాంపౌండు వడ్డీకి తీసుకొనిపోయి, ఆబాకీ తీర్చలేక, చలమయ్యకు స్వాధీనమైన ఆస్తికి స్వస్తి చెప్పి ఊరుకొన్నాడట. ఆయన అనంతరం ఆయనమైనరు కొడుకు వెంకటశివరావు మేజరయి, తన తండ్రి దుర్వ్యసనాలకు లోనయి, కుటుంబాస్తిని పాడుచేసినాడు కాబట్టి, చలమయ్యకు పెట్టిన అడుమానంగాని, ఆ బాకీలుగాని చెల్లవనీ, అందువల్ల చలమయ్య సదరు భూమిని దేవుడికి ధారాగ్రహీతంగా దానంచేసి ఇవ్వడానికి అధికారాలు లేవనీ, ఆ స్తికంతా తనే ఉత్తరవారసుననీ లాపాయింట్లు వెదకి దావా పడేశాడట! క్రింది కోర్టులో దావా ఖాయమైనదట గాని, ఇప్పుడు హైకోర్టులో అప్పీలులో ఉన్నదని అంటారు.

దావా ఇట్లా ఉండగా, చలమానాయుడికి సపిండుడు రంగపనాయుడొకడు బయల్దేరి చలమానాయుడికి సంతతి లేదనీ, ఆయనఆస్తికి తను వారసుననీ, ఆయన దేవుడికి దస్తావేజు వ్రాయనే లేదనీ, అది ఫోర్జరీ వ్యవహారమనీ, అసలు చలమానాయుడు ఏ సంవత్సరంలో చనిపోయినదీ రికార్డు

మూలకంగా దాఖలాలు లేవనీ, కాబట్టి ఆస్తి తనకు సంక్రమించాలి గాని అటు దేవుడికీ, ఇటు వెంకట శివరావుకీ చెందడాని కెంతమాత్రమూ వీలులేదనీ తా నింకోదావా పడవేశాడట.

దావాఆస్తి పేచీలోపడి చెడిపోకుండా కోర్టువారు రిసీవరును అప్పాయింటుమెంటుచేసి ఇప్పటికి పదెనిమిదేళ్ల క్రిందట ఆస్తి యావత్తూ ఆయనస్వాధీనం చేశారు.

రెడ్డిగారిపల్లెలో దేవు డుండట మేమిటి, తాను ఆ గ్రామానికి పెద్దగా ఉండడ మేమిటి, ఆస్తి కమ్మవారు అనుభవించడ మేమిటి—బాగుండలేదని తాను దేవుడికి ధర్మకర్తననీ, చలమయ్య వ్రాసిన దస్తావేజు చెల్లవలసినదేననీ, రిసీవరు అప్పాయింటుమెంటు కేవలం అక్రమం కాబట్టి ఆస్తి అంతా తనకే స్వాధీనపెట్టవలసినదనీ హైకోర్టులో పిటిషన్ పెట్టాడట రామిరెడ్డి. అంతా కప్పలతక్కెడగా ఉన్నది వ్యవహారం.

పాపయకు స్వంతంగా వ్యవహారం జరుపుకోడానికి శక్తి లేదు. అందువల్ల వెంకటశివరావు ఈ వ్యవహారంలో రాఘవయ్యగారిని ఆశ్రయించి, ఆయనగనక పనిచేసి తన దావా గెలిపించినట్లయితే పాతికెకరాల భూమి యానాది సంఘానికి ఉచితంగా వ్రాసి యిచ్చి మిగిలిన పాతికెకరాలభూమీ తాను తీసుకొని తృప్తిపడతానని రాఘవయ్యగారి పేర చేజాబు వ్రాసి యిచ్చాడట.

రాఘవయ్యగారు ఆ జిల్లాలో పేరుపడ్డ సివిల్ క్రిమినల్ వకీలు. కాంగ్రెసులో చేరిపోయి ముఖ్యంగా యానాదులనూ, హరిజనులనూ పైకి తీసుకొనిరావాలని ఆయన ఆశయం. కమ్మవారిపాలెంలో స్థాపించిన యానాది సంఘం ఆయన స్థాపించినదే. అన్ని వాదాలలో పాపరువాదం న్యాయమని ఆయనమనస్సుకి తోచి అతని తరఫున నిలబడి ఉచితంగా పనిచేస్తున్నాడు రాఘవయ్యగారు.

చలమయ్య చనిపోయినతర్వాత ఆస్తి నా అన్న దిక్కు లేక ఏడూ గాడూ అయిపోయింది. భూములు మంచివే గాని, ఏమిలాభం! పదేళ్లుగా దానికి బండి ఎరువు తోలి సత్తువచేసిన పాపాన్ని పోయినవారెవరూ లేరు. నిరుటి సంవత్సరం ఆభూమి రిసీవరుదగ్గరనుండి కౌలుకు తీసుకొన్న కౌలుదారుకూడా చనిపోతే, సాగుచేసే దిక్కు లేక సగం భూమి బీడుగానే నిలిచిపోయింది.

ఈస్థితిలో సుబ్బులు కమ్మవారిపాలెం కాపురం వచ్చేసరికి రాఘవయ్యగారూ, రిసీవరూ, గ్రామస్థులూ కూడబలుక్కొని యానాదిసంఘం తరఫున ఈయేభయ్యెకరాలూ సుబ్బులు సాగుచేసి మక్తాకొలిచేటట్లూ, కొళ్లు అతనిపేర పుట్టించవలసినట్లూ ఏర్పాటుచేసి, భూమి అతగాడి స్వాధీనం చేసేశారు.

సుబ్బులుపేర కొళ్లు పుట్టి భూమి వాడి స్వాధీనం అయిందనేవరకు రామిరెడ్డికి ఒకవిధమైన సంతోషం కలిగి,

అతడు స్వయంగా పిలిపించకుండా మధ్యవర్తుల చేత, ఆ భూమి తనకు లోపాయకారీగా స్వాధీనం పెట్టవలసిందనీ, వాడి పేర వ్రాయించుకొన్న కాళ్లు తనపేర ట్రాన్సుఫరు చేయించవలసిందనీ, లేక వాడే పంట పండించి ఆ కమ్మవారి కంటబడకుండా పండిన పంట ఏరు దాటించి రెడ్డిగారిపల్లెకి చేర్పించవలసిందనీ సుబ్బులుకు చెప్పి పంపించాడు. పట్టుదలకు ఒక్కయే డయినా భూమి తన స్వాధీనానికి తెచ్చుకోవాలని రెడ్డి ఆలోచన.

తాను రాఘవయ్యగారి బంటుననీ, ఇందులో తన ప్రమేయ మేమీ లేదనీ, తన్నడగవద్దనీ చెప్పి పంపాడు సుబ్బులు.

సుబ్బులు పంపిన సమాధానంతో రెడ్డికి చుర్రుమనింది. అతను తలపెట్టిన కార్యమల్లా విఘ్నమే అవుతున్నది. సుబ్బులుని మిలిటరీలోకి పంపాలనుకొన్నాడు; సాగలేదు. రమణి కోసరం తపస్సు చేశాడు; ఫలించలేదు. కమ్మవారిపాలెం ఆ స్త్రీవిషయంలో సాయం చేయవలసిందని సుబ్బుల్ని నోరు విడిచి అడిగాడు; వాడు తోసిరాజన్నాడు. రెడ్డి జొడు కరిచాడు. యానాదివాణ్ణి అట్లా విడిచిపెట్టితే ఎట్లా?

“మీకు వెయ్యిరూపాయ లిస్తాను. ఒక తప్పుడు సారాయికేసు ఆ సుబ్బడిమీద పెట్టి వాణ్ణి ఒక్కసారి పట్టుకొని, నాచేతి కందియ్యండి. ఈ సాయం చేయండి – ఇంక

ఇటువంటి కోరిక మిమ్మల్ని కోరను'' అని అబ్కారీ ఇన్స్పెక్టరుదగ్గరకు వెళ్లి అడిగాడు రెడ్డి. లాభం లేక పోయింది.

# 15

తెల్లవారింది. ఆరోజు సోమవారం. సుబ్బులూ, రమణీ నిద్ర లేవలే దింకా. తలుపులు వేసి నిద్రపోతున్నారు. రమణితల్లి వాకిలి చిమ్ముతోంది. ముసలివాడు లేచి వేప చెట్టుక్రింద పళ్లు తోముకొంటున్నాడు.

చేతిలో లాఠీలూ, నెత్తిన ఎర్రటోపీలూ పెట్టుకొని, ఇద్దరు పోలీసు జవానులూ, సబిన్స్పెక్టరూ వాకిట్లోకి వచ్చి నిలబడి—

''సుబ్బ డెక్కడ'' అని అడిగారు.

కమ్మవారిపాలెం మునసబూ, కరణమూ ఎడంగా నిలబడ్డారు.

''అమ్మా! రమణీ'' అని పిలిచింది రమణితల్లి.

కళ్లు నులుముకొంటూ తలుపు తీసి ఎర్రటోపీలు చూచి బెదురుకొన్నది రమణి. వెళ్లి మామను లేవగొట్టింది. మొలగుడ్డ బిగించుకొంటూ బయటికి వచ్చాడు సుబ్బులు. పోలీసులకు దణ్ణం పెట్టాడు.

''దణ్ణాని కేంగాని - నీమీాద చోరీకేసు రిపోర్టు అయింది. నీ మొలనున్న వెండి మొలతాడు ను వ్వెక్కడ చోరీచేశావు?'' అని, వెళ్లి అతని రెక్క పట్టుకొన్నారు పోలీసులు.

సుబ్బులి కర్థం కాలేదు. ఇప్పటికి సంవత్సరంగా తాను దానిని పెట్టుకొనే ఉంటున్నాడు. అందరికీ తెలిసిన విషయమే.

"ఈ మొలతాడు నాదేనండి" అన్నాడు సుబ్బులు.

"నువ్వు సంపాదించావు! స్టేషన్‌కు పద. పట్టుకో వోయ్" అని ఇన్‌స్పెక్టరు అనేసరికి, పోలీసు జవానులు అరెస్టుచేసి పట్టుకొన్నారు.

సుబ్బులు లోపలకు పోయి గుడ్డ వేసుకొని వచ్చాడు.

పోలీసు లింట్లోకిపోయి ఏమేమో సోదా చేసుకొన్నారు. ఇం కేమీ దొరకలేదు.

"మా మామమీద కేసు పెట్టిం దెవరండీ?" అని అడిగింది రమణి.

"సొత్తు పోగొట్టుకొన్నవారు."

"ఆయన పేరండి?"

"రావు సాహెబ్ పల్లపోతు రామిరెడ్డీ, ఆయన మేనమామ కొడుకు అయ్యపరెడ్డీని."

"ఏమని వారు పెట్టిన కేసు?"

"అయ్యపరెడ్డీ, రామిరెడ్డీ రెడ్డిగారిపల్లెలో నిద్ర పోతుండగా మొన్నటి రాత్రి సుబ్బడు ఇంట్లో ప్రవేశించి, అయ్యపరెడ్డి మొలనున్న వెండిబిళ్లల మొలతాడు చోరీగా తీసుకొని పోతుండగా వాళ్లిద్దరూ చూశామని."

"చిత్తమండి" అన్నది రమణి.

సుబ్బులు నవ్వుకొన్నాడు, ముసలివాడూ. ముసలిదీ గొల్లుమన్నారు. రమణి వాళ్ల నోళ్లు నొక్కింది.

పోలీసులు సుబ్బుల్ని తీసుకొనిపోయినారు. పోలీసు స్టేషన్‌కు పోకుండా రెడ్డిగారిపల్లెలో రామిరెడ్డి కొబ్బరి తోటలో లక్ష్మమ్మ సుబ్బులికి కట్టించిన యింటికి తీసుకొని పోయినారు. ఊళ్లో జనం పోగయితే పోలీసులు తరిమివేసి నారు. రెడ్డీ, ఇన్‌స్పెక్టరూ లోపలికి వెళ్లారు.

"వచ్చావటరా సుబ్బా!" అని అడిగాడు రామిరెడ్డి. సుబ్బులు దణ్ణం పెట్టి ఊరుకున్నాడు.

"ఇంతట నయినా చెడిపోక ఆ దేవుడి మాన్యం రామిరెడ్డికి అప్పచెప్పు" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

సుబ్బులు పలకలేదు.

"రామిరెడ్డి నీకు చేసిన మహోపకారానికి ఇప్పుడు ఈమాత్రం సాయం నీవు చెయ్యలేవూ? రెడ్డిపేర దస్తావేజు వ్రాయించి పొలం స్వాధీనంచెయ్యి. ఆతరువాత కమ్మవా ళున్నారు; రెడ్డి ఉన్నాడు; కోర్టు లున్నవి" అన్నాడు పోలీసు ఇన్‌స్పెక్టరు.

సుబ్బులు పలకలేదు.

"చెరకా బెల్లం పెట్టమంటే పెట్టుతుందండీ. దాన్ని గానుగలో పెట్టి మర తిప్పితే రసం కారుస్తుంది" అన్నాడు రామిరెడ్డి.

"అంతపనీ జరగవలసిందేనా" అన్నాడు ఇన్‌స్పెక్టరు.

రామిరెడ్డిచేతిలో పేపబెత్తం, పోలీసులచేతిలో లాఠీకర్ర! జన్మ ఎత్తినందుకు సార్థకం అయిపోయింది వాటి జన్మ. సుబ్బులు శరీరం వప్పజెప్పి ఊరుకున్నాడు; అధికార్లిద్దరూ చెరిసగం పంచుకొన్నారు! పందిని బాదినట్లు బాది విడిపించారు.

ఇద్దరూ కాఫీ తీసుకొని, గుర్రబ్బండిమీద వెళ్లిపోతే వెనక పోలీసు జవానులు సుబ్బులుని అరదండాలు వేసి తీసుకొనిపోయినారు.

సుబ్బులుకు మంటలెత్తిపోతోంది శరీరం; రక్తపింజర పాములా ఎర్రగా తాటలు తేలిపోయింది.

లక్ష్మమ్మని ఒక్కసారి తలుచుకొని కళ్ల నీరు నింపాడు సుబ్బులు. ఆమె కోడల్నీ, మనుమల్నీ తీసుకొని రామిరెడ్డి అత్తగారింటికి వెళ్లింది; ఊళ్ళో లేవని అక్కడ చేరినవారిలో ఒకరు చెప్పారు సుబ్బులుకు.

ఆ తీసుకొనిపోవడం ఎకాయెకీని డిస్ట్రిక్టు కలెక్టరుగారి కోర్టుకు తీసుకొనిపోయి సుబ్బులుమీద కేసు పెట్టారు. వంటిమీది దెబ్బలు కనిపించకుండా గుడ్డ కప్పుకొన్నాడు సుబ్బులు.

పోలీసులు తన పెనిమిటి నట్లా తీసుకొనిపోయిన వెంటనే రమణి కాంగ్రెసు నాయకులను తీసుకొని, రాఘవయ్యగారిదగ్గరకు పోయింది. రాఘవయ్యగారు సుబ్బులు తరఫున కోర్టులో హాజరయ్యారు.

మొదటి సాక్షి రామిరెడ్డి, రెండో సాక్షి అయ్యపరెడ్డి బోనెక్కి, దేవుని యెదుట ప్రమాణం చేసి అంతా నిజం చెప్తామని ప్రమాణం చేశారు. ఆ రాత్రి వాళ్ళిద్దరూ రెడ్డిగారిపల్లెలో నిద్రపోతుండగా ముద్దాయి ఇంటి తాళం పగలగొట్టి లోపల ప్రవేశించి అయ్యపరెడ్డి నడుముకు పెట్టుకున్న వెండిబిళ్లల మొలతాడు తీసుకొనిపోతుండగా మేము చూచినామని ఇద్దరూ సాక్ష్యం చెప్పారు. ముద్దాయి తీసుకొని పోయిన మొలతాడు ఇదేనని ఋజువుచేశారు సాక్షులిద్దరూను.

కమ్మవారిపాలెం మునసబు కరణాల సమక్షంలో ముద్దాయివద్ద చోరీ సొత్తు వశపరుచుకొన్నామనీ, నేరం చేసిన మాట నిజమేనని ముద్దాయి పోలీసు విచారణలో పెద్ద మనుష్యుల ఎదుట ఒప్పుకొన్నాడనీ పోలీసు ఆఫీసరు సాక్ష్యం చెప్పాడు.

కోర్టువారు సాక్ష్యం అంతా వ్రాసుకొన్నారు. 'నీవేమి చెప్తావ'ని ముద్దాయి నడిగారు. నాకేమీ తెలియదన్నాడు ముద్దాయి.

"పోలీసులు తెచ్చిన సాక్ష్యం బలంగా ఉన్నందున నీవు నేరం చేసినట్టు మేము నమ్ముతున్నాం. నీతరఫున ఉత్తర సాక్షు లున్నారా?" అని అడిగారు కోర్టువారు.

"నాకు ఒక్క లక్ష్మమ్మ తప్ప ఇం కెవ్వరూ సాక్షులు లే"రని చెప్పాడు ముద్దాయి.

కోర్టువారు లక్ష్మమ్మని విచారించడానికి కేసు వాయిదా వేశారు.

## 16

లోకంనోరు మూయడానికి మూకు దున్నదా? లక్ష్మమ్మ కోడల్నీ, మనుమల్నీ తీసుకొని యింటికి వచ్చి రావడంతోటే ఊరంతా అట్టుడికినట్టు ఉడికి పోతోంది. రమణిని రెడ్డి చెయ్యిపట్టుకొని లాగిన విషయం, సుబ్బులుని మిలిటరీకి పంపడానికి చేసిన ప్రయత్నాలూ, సుబ్బులుమీాద కేసు పెట్టడం, దొడ్లో చావగొట్టడం, జెయిల్లో పెట్టడం - అన్నీ ఆమె చెవిలో పడ్డవి. ఆమె యేమి చేయగలదు? తన కొడుకు చివరకు రాక్షసు డయిపోయినాడు.

జెయిల్లో ఉన్న సుబ్బు లామెకళ్ళల్లో మెదిలేసరికి ఆమెకు దుఃఖం వచ్చి కుంపటిముందు కూర్చుని ముక్కు తుడుచుకొంటోంది. "అమ్మా! ఆకలవుతోంచె. నీ చేత్తో ఇంత

అన్నం పెట్టమ్మా'' అని సుబ్బు లడుగుతున్నట్టు అనిపిస్తే ఆమెకడుపు తరుక్కొనిపోతున్నది.

''మీరు పెద్దవారు. కంటనీరు పెట్టకండ త్తయ్యా'' అని రమణి ఆమె కన్నీరుతుడిచి పాదాలు ఒత్తుతున్నట్టయింది.

తన కడుపున ఆ రామిరెడ్డికి బదులు సుబ్బులే పుట్ట కూడదూ? అరవయ్యేళ్లు వచ్చిన తర్వాత కొడుకు తన ఎదురు రొమ్ముమీద కుంపటి తీసుకొని వచ్చి పెట్టాడు. ఇంతలో కొడుకు వచ్చి,

''అమ్మా, అట్లా కూర్చున్నావేమి?'' అని అడిగాడు.

లక్ష్మమ్మ చీదరించుకొన్నది.

''ఆ యానాదివాడు చూశావుగదూ: పెద్దయింటి వాళ్లం - రచ్చకెక్కించాలని కోర్టులో నిన్ను సాక్ష్యం వేసు కొన్నాడు.''

''నన్నా ?''

''నిన్నే.''

''సాక్ష్యమా ?''

''అవును.''

''ఏమని ?''

''ఏమో ?''

లక్ష్మమ్మ పలకలేదు.

"అమ్మా! ఆడదాన్ని నిన్ను వాడు సాక్ష్యం వేసుకొని అవమాన పరచవచ్చా?"

లక్ష్మమ్మ తల వంచుకొని కూర్చున్నది.

"వాడి కసలు ఈ కేసులో సాక్ష్యం ఎందుకమ్మా చెప్పు. నేను పోలీసువారికి సహాయపడి రికార్డు అంతా మనకి అనుకూలంగా సృష్టించి పెట్టాను. ఏదో తెలియక చేశానని కోర్టులో వాడు నేరం ఒప్పుకొంటే తీరిపోదూ! కోర్టువారు ఏదో, ఇరవయ్యో జుల్మానా వేస్తే ఆపైకం నేనే కట్టి వాణ్ని విడిపించుకొని రాకపోయానా?" అన్నాడు రామిరెడ్డి.

కొడుకు కళ్లల్లోకి వికారంగా చూచింది లక్ష్మమ్మ.

రామిరెడ్డి కర్థం కాలేదు ఆమెచూపుల్లోని భావం.

# 17

యానాదివాడి కేసులో లక్ష్మమ్మ సాక్ష్యం చెప్తుందని ఆనాడు జనం తండాలుగా వచ్చిపడ్డారు. లక్ష్మమ్మను ముద్దాయి సాక్ష్యం వేసుకోవడం దేనికో ఎవ్వరికీ అర్థం కాలేదు. చోరీసొత్తు ప్రత్యక్షంగా ముద్దాయిదగ్గర దొరకనే దొరికింది. చోరీ చేస్తుండగా స్పష్టంగా చూచినట్లు రావు సాహేబూ, అయ్యపరెడ్డీ చెప్పనేచెప్పారు. వాళ్లు అబద్ధ

మాడడానికి కారణ మేమిటి? లక్ష్మమ్మ ముసలిది—ఏమి చెప్పగలదు కోర్టులో! సుబ్బులికి రెండేళ్ళు శిక్ష తప్పదు. అందులో డిప్టీకలెక్టరు చండప్రచండుడు. శిక్షానంతరం వాణ్ణి దొంగయానాదిగా కేడీలలో చేర్చి, రామిరెడ్డి గ్రామమునసబు అయినందున, ఆ కేడీమీద అధికారం యిచ్చి, వాణ్ణి ఆయన గారి స్వాధీనం చేస్తాడు. ఇక సుబ్బులూ, రమణీ రామిరెడ్డి చెప్పుక్రింద తేలయిపోతారు.—రామిరెడ్డి పొంగిపోతున్నాడు.

ముందు లక్ష్మమ్మని బోనెక్కించారు; ప్రమాణం చేయించారు. ఆమెకెదురుగా పోలీసుల నడుమ సుబ్బులు. ఒకరి నొకరు చూచుకొని కళ్లనీళ్లు పెట్టుకొన్నారు.

రాఘవయ్యగారు కుర్చీమీద కూర్చుంటే ఆయన వెనకనే నిలబడింది రమణి. ఎదురుగా పోలీసు ఇన్‌స్పెక్టరు. ఆయనప్రక్క రావుసాహేబు రామిరెడ్డి, ఆయనప్రక్క అయ్యపరెడ్డిని.

ముద్దాయి చోరీచేసిన వెండిబిళ్లల మొలతాడు కోర్టు వారు తెప్పించి బల్లమీద పెట్టారు.

రాఘవయ్యగారు లేచి—

"అమ్మా!" అని పిలిచారు.

"అయ్యా!" అన్నది లక్ష్మమ్మ.

"రామిరెడ్డి నీకొడుకా అమ్మా?"

"ఆ! నాకడుపునే పట్టాడండి."

"ముద్దాయి నెరుగుదువా?"

"అయిదోయేడు అప్పటినుండి వాణ్ణి సాకినానండి."

"వాని భార్య రమణి నెరుగుదువా?"

"అది నా రెండో కోడలండి."

"ముద్దాయికి నీవు వెండిబిళ్లల మొలతాడు చేయించి పెట్టావా?"

"పెట్టానండి."

"ఎన్నాళ్ళయింది?"

"సంవత్సరం అయిందండి."

"ఎందుకుగాను చేయించిపెట్టావు?"

"నిరుటి సంవత్సరం నేను గోదావరి పుష్కరాలకు కోటిలింగాల దగ్గర స్నానంచేస్తుంటే కాలుజారి గోదావరిలో పడి కొట్టుకొనిపోయాను. సుబ్బులు అంత గోదావరిలోనూ దూకి ఈదుకొనివచ్చి నన్ను గట్టున చేర్చాడు. నాకు వొళ్లు స్మారకం తెలియలేదు. సుబ్బులు నన్ను ఇంటికి తీసుకొని వచ్చిన తర్వాత నెల్లాళ్ళు ఖాయిలాపడ్డాను. నా కొడుకు రామిరెడ్డి సాలిమనిషిని తీసుకొని బెంగుళూరులో ఉంటే 'మీఅమ్మకి ప్రాణంమీదికి వచ్చిం'దని మూడు టెలిగ్రాము లిచ్చినా అతడు ఇంటికి రాలేదు. సుబ్బులు నన్ను బ్రతికించి నాకు చేసిన చాకిరీ నేను మరచిపోలేక సంతోషంకొద్దీ నూటపధయి రూపాయలు పెట్టి మొలతాడు చేయించి పెట్టాను. ఎన్ని చేయించిపెట్టినా వాడి ఋణం నేను తీర్చుకోగలనాండి?" అన్నది లక్ష్మమ్మ.

"ఆ మొలతాడు ఇదేనా?"

"ఇదేనండి."

లక్ష్మమ్మను బోను దిగుమన్నారు కోర్టువారు.

సుబ్బులు నిర్దోషి అని నిరూపిస్తూ, అబద్ధపు కేసు బనాయించినందుకు రామిరెడ్డినీ, అయ్యపరెడ్డినీ అరెస్టుచేసి కొట్టులో పెట్టించారు కోర్టువారు.

కోర్టువారిచ్చిన మొలతాడు కళ్ళకద్దుకొని, కోర్టువారికి నమస్కరించి లక్ష్మమ్మపాదాలకు సాగిలపడ్డాడు సుబ్బులు.

"అత్తా" అని నమస్కరించింది రమణి.

"నా తండ్రి! నీవే నాకొడుకువు, ఇదే నాకోడలు. ఇంక నేను రెడ్డిగారిపల్లె గడ్డ తొక్కను. నీవద్దనే యానాది సంఘములో చేరి, పతితులకు సేవచేస్తాను. పదండి" అన్నది లక్ష్మమ్మ.

గూడు విప్పిన మోటారులో లక్ష్మమ్మని నడుంగా కూర్చోబెట్టి, ఆమె కిరుప్రక్కలా సుబ్బుల్నీ, రమణినీ, రాఘవయ్యగారినీ కూర్చోబెట్టి, మెడలో పూలమాలలు వేసి మేళతాళాలతో "జే యానాది సంఘాలకు జే! హరిజనులకు జే! కూలీలకు జే!" అని అరుస్తూ కమ్మవారి పాలెం తీసుకొనిపోయారు — ఆవూరి కమ్మవారూ, యానాదులూ, హరిజనులూను.



THE LIBERTY PRESS, MADRAS - 1



## శ్రీ కందుకూరి అనంతం

ఉరఫ్

'కరుణకుమార'

* పుట్టింది పశ్చిమ గోదావరిజిల్లా; మెట్టింది నెల్లూరుజిల్లా.
* విత్తంలేక ఉన్నత విద్యకు వీలులేక పోయింది; ఉదరపోషణకు ఉపాధి వెతుక్కోవలసి వచ్చింది.
* బస్సు కండక్టరుగా ఆరంభించి, కచ్చేరి గుమాస్తాగిరి చేపట్టి, తహసీల్దారు గిరితో తలమున్కలై, జీవితంలోని తీపిని చేదును రుచిచూచి వెలుగునీడలను లెస్స ఎరిగిన అనుభవశాలి.
* పుట్టినింటి మమకారంకన్న మెట్టినింటి మమకారమే మహత్తరమై, నెల్లూరి జీవితాన్నీ, నెల్లూరి భాషనూ నీటుగా అలవరచుకొన్న ప్రజ్ఞాశాలి.
* సన్నజీవుల బ్రతుకులనూ, బాధలనూ కన్నుంచి కనిపెట్టిన ఘటికుడు.
* కుతిమెత్తని హృదయం; సూటిపోటుల చురుకుపాళీ.
* పల్లెసీమలలోని ప్రజల సుఖదుఃఖాలు, వారి జీవితవిశేషాలూ ఇతివృత్తంగా, వారి జీవితాలకూ వారి అభిరుచికీ సరిగ్గా అమరే చక్కని వ్యావహారికంలో కమ్మని కథలను తీర్చి చదువరులకు విందుచేయగలిగిన చతురుడు.
* పల్లెటూరిహృదయం, పల్లెటూరిజీవితం, పల్లెటూరిభాష - ఈయన కథల్లోని కొత్తదనం, గొప్పదనమూను.

జననం : ఏప్రిల్ 1901] [మరణం : డిసెంబరు 1956

---

"SANNAJEEVAALU" (Six select stories) Rs. 2-50.
Samskriti Nilayam, 88, Kutcheri Road, Madras-4.

218

